

పోలీసు శతవార్షికోత్సవాల సందర్భంగా హైద్రాబాదులో అక్టోబరు 21 వ తేదీన శ్రీమతి సంజీవయ్య బహుమతులు పంచిపెట్టారు ఆంధ్రప్రదేశ్ గవర్నరు బహుమతి అందుకుంటున్న దృశ్యం



**1961 నవంబరు 1 వ తేదీన, రాష్ట్రావతరణ దినోత్సవం. పంచాయతీ రాజ్య ద్వితీయ వార్షికోత్సవంతోపాటు తృతీయ ప్రణాళిక ప్రథమ ప్రణాళికల సప్తాహానికి కూడా రాజధానీనగరంలో ప్రారంభోత్సవం జరిగింది "త్రివిధములైన" ఈ ఉత్సవాలకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేసినప్పటి చిత్రం**

# ఆంధ్రప్రదేశ్

సంపుటి 6 | డిసెంబరు 1961
మార్గశిర-పుష్య 1883 శక సం. | సంచిక 2

# విషయసూచిక

ముఖచిత్రం: కర్షక కుటుంబం.

వెనుకఅట్ట: కర్నూలుజిల్లా, గిద్దలూరు తాలుకా చోళ్లవీడు గ్రామంలోని రంగయ్యనాయుడు చెరువు దృశ్యం. ఈ చెరువు పునరుద్ధరణ కార్యక్రమానికి ప్రణాళికా శాఖామంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి అక్టోబరు 29 న ప్రారంభోత్సవం చేశారు.

చందా వివరాలు

| | | |
|---|---|---|
| సంవత్సరానికి | — | 3 రూపాయలు |
| విడి ప్రతి వెల | — | 25 నయాపైసలు |

Edited & Published by the Director of Information & Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Vir Milap Press, Mukarramjahi Road, Hyderabad.

# తెలుఁగు తల్లి!

శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి

మంటిలో బంగారుపంట లెత్తించు "ప్రా
జెక్టు" లింతింతలై చెలఁగుచుండె!
విజ్ఞానతేజమ్ము వెదఁజల్లఁ బాఠశా
లలుగళాశాలలు వెలయుచుండె
మనసులోని కలంతలను రూపుమాపి హా
యి నొసంగు "రేడియో" లెనయుచుండె!
మన జీవ పరిమాణ మనుపమానముగాగ
జతనమ్ము లెన్నియో జరుగుచుండె!
నీకుమారులు మున్ముందు లోకములను
ప్రబలి దీపించు "రోజులు" వచ్చునమ్మ
తఱుగులేదమ్మ నీకెందుఁ గొఱఁతలేదు
వెలుఁగు మొకవెల్గు గుణవల్లి తెలుఁగుతల్లి!

చలిచీమనైన ఁగాఘలఁ బడ్డరక్షించు
నా "యహింస"యెగదా యాయుధమ్ము!
ఒరులు తొందరపడ్డ దరిచేరి లాలించు
"శాంతి" దీపమెగదా సదనరక్ష!
మిన్ను మన్నేకమై మిడిసి నొక్కినఁగాని
"సత్య" వాదమెగదా నిత్యశోభ!
పరులెంతగా దూయఁబట్టిన క్షమియించు
"సహన"భావమెగదా శాశ్వతమ్ము!
నీకుమారులు పదునాల్గు లోకములకు
మూఁడు ప్రొద్దులు నాదర్శమూర్తులమ్మ
తఱుగులేదమ్మ నీకెందుఁ గొఱఁతలేదు
వెలుఁగు మొకవెల్గు గుణవల్లి తెలుఁగుతల్లి.

లోకాలచీఁకట్లఁబోకార్ప జ్యోతియై
"నెహ్రూ" మహాబోధినిలిచినాఁడు!
కఱవు రాకాసి మూకల గుండియలు చీల్ప
"శ్రీ వినోభా" ముందుచేరినాఁడు!
కరుడు గట్టిన శాంతికల్లోలినీస్వామి
"రాజేంద్రుడు" పదాల వ్రాలినాఁడు!
పుంజీభవించిన పుణ్యంపురాశి "సం
జీవయ్య" జోహారు చెప్పినాఁడు!
నీకుమారులు నీకోసమేకమైరి
కష్టముల లెక్క చేయరే కాలమందుఁ
దఱుగులేదమ్మ నీకెందుఁగొఱఁతలేదు
వెలుఁగు మొకవెగ్గు గుణవల్లి తెలుఁగుతల్లి!



**వస్తుస్థితిని గుర్తించి విజయానికే కాదు అపజయానికిసైతం స్వాగతం** పలుకగలిగినవాడే గొప్పవాడు.

* * *

**అభ్యుదయ** హర్మ్యానికి సోపానాలు ప్రజా ప్రభుత్వాలు—ఆ సోపానాలకు రాచబాట దేశ భక్తులైన ప్రజల హృదయాలు.

# నేటి ఆంధ్ర నాటకరంగ సమస్య

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి

నేఁటి యాంధ్ర నాటక రంగ పరిస్థితి బహు విచిత్రా వస్థలో మన్నది. "అంగడిలో అన్నీ యున్నవి అల్లుడి నోట్లో శని" యన్నట్లు తోఁచు చున్నది నేటి కాలపు టాంధ్ర నాటక రంగ పరిస్థితిని పరిశీలించి నపుడు. "నాట్యకళ" అను త్రైమాసిక పత్రికలో "శ్రీవాత్సవ" యనువారు "పునరుజ్జీవన" మను వ్యాసమున నిట్లు వ్రాసిరి. "ఇదివర కెన్నడును లేనంత యుత్సాహము ఈ నాఁడు తెలుగునాట నాటక కళమీద నందఱును ప్రదర్శించు చున్నారు. అయినప్పటికిని సజీవమైన రంగ స్థలము రూపొందడము లేదు తెలుగు నాటక కళ యుండవలసి నంత యుచ్చ స్థాయిలోనుండి యభివృద్ధి కావుట లేదు. ఈ సంగతి యటు నటీ నటులూ, నిర్మాతలతో పాటు రచయితలు, విమర్శకులూ ప్రేక్షక వర్గమూ గమనించారు. సమయము వచ్చి నపుడు ఈ యభిప్రాయాన్ని యన్ని వర్గాల వారూ వెల్లడిస్తూన్నారు. నేటి తెలుగు నాటక కళ అంత సంతృప్తి కరముగా లేదన్న మాట అందఱి నోట వెంటా వింటున్నాము. ............... కాని తెలుగు నాటక కళ యెడల నిరసన భావముతో కాక, నిర్మాణాత్మక దృష్టితో అభివృద్ధి మార్గాలు అన్వేషించి యొక మంచి సూచన చేసే వారు అరుదై పోయారు. 75 సం రాల నుండి అభివృద్ధి చెందుతూ వున్న ఆంధ్ర నాటక కళ ఈ నాడు కొంచెము అపమార్గము త్రొక్కిందంటే దాని కారణాలు శాస్త్రీయంగా పరిశీలించాలి...............తెలుగు నాటక కళ శ్రేయోభి వృద్ధులు కాంక్షించే వ్యక్తులున్నారు. సంస్థలూ ఉన్నవి. వారి సదుద్దేశాలను ఆశంకించ వలసిన పనిలేదు. ఆంధ్ర నాటక కళా పరిషత్తు, థియేటరు సెంటరు ఉద్యమం, నాటక సమాఖ్య మొదలైనవి ఇతోధిక సేవ చేస్తున్నవి." (డిశెంబరు. 1957., సంచిక) దాని సంపాదకీయములో "ఆంధ్ర నాటక రంగము నేడు మహా సంక్షోభములో చిక్కుకుంది. అటు పూర్వ సంప్రదాయ నాటక రంగము, ఇటు ఆధునిక ఔత్సాహిక నాటక రంగము రెండూ కొట్టు మిట్టాడు తున్నాయి. చుక్కాని లేని పడవలా నడుస్తున్నాయి ఆర్థిక స్థోమత లేకుండా పోయింది నాటక ప్రదర్శనాలు ప్రజల నెక్కువగా ఆకర్షించడం లేదు. ఈ పరిస్థితులలో 'ఏం చేయాలి' అనే ప్రశ్న సహజంగా ఉత్పన్న మవుతుంది" అని శ్రీనివాస చక్రవర్తిగారు వ్రాసినారు. ఇఁక 1958 సం. డిశెంబరు నాటి సంచికలో సంపాదకీయ వ్యాసమగు "పునరుజ్జీవనోద్యమం" అనే వ్యాసములో నిట్లు వ్రాయఁబడినది. "నేటి ఆంధ్ర నాటక రంగం అవతరించి 70 సంవత్సరాలు దాటింది. ఔత్సాహికంగా ఆవిర్భవించి వృత్తి రంగంగా మారి ఒక వెలుగు వెలిగింది. వృత్తి నాటక రంగం క్రమంగా క్షీణదశకు రావడంతో, ఔత్సాహిక నాటక రంగం తిరిగి తన స్థానాన్ని ప్రతిష్ఠించుకుంది. ఔత్సాహిక నాటక రంగం కూడా గత 30 సం. లలో ఒక వెలుగు వెలిగి నేడు స్తంభించి పోయింది. సంక్షోభంలో చిక్కుకుంది. విశాలాంధ్ర అంతటా కొన్ని వందల నాటక సమాజాలు, కొన్ని వేల మంది నటులు, ఈ ఔత్సాహిక నాటక రంగంలో పాత్ర వహిస్తున్నారు. ఆంధ్రలో ఉన్నంత నాటక సంచలనం ఏ రాష్ట్రంలోనూ లేదు కాని అనేక చిక్కులకు, కష్ట నిష్ఠురాలకు చిక్కుకొని ఔత్సాహిక నాటక రంగం ఉక్కిరి బిక్కిరి అవుతోంది. నటులలో ఉత్సాహం సడలి పోతోంది. శాస్త్రీయ పద్ధతులలో సాధనం జరగటం లేదు. ప్రోత్సాహం ఎక్కువగా లభించడం లేదు. తగిన పరికరాలు, ప్రదర్శన శాలలు మనకు కరవయినాయి. క్రమ క్రమంగా ఔత్సాహిక నాటక రంగంకూడా దెబ్బతినే ప్రమాదానికి గురి అయింది" అని.

ఆంధ్ర నాటక రంగ మీస్థితికి వచ్చుటకు గారణమేమి యని విచారింప వలసి యున్నది. నాటక రంగాభ్యుదయము ముఖ్యముగా ముగ్గురి మీఁద నాధారపడి యుండును. ఒకటి, నాటక రచయిత; రెండు, నటులు; మూడు, సామాజికులు; (ప్రేక్షకులు). ప్రజాభిరుచులను నట నాటక రచయితలు గౌరవించుటతోఁ బాటు, వారు ప్రజాభి రుచులను చక్క దిద్దుటయు గూడ చేయఁ దగిన పని.

అనగా నట నాటక రచయితల ప్రభావము ప్రేక్షకుల పైనను ప్రేక్షకుల ప్రభావము నట నాటక కర్తల పైనను పరస్పరముండునని గ్రహింప వలసినది. నాటకము దృశ్యము గాని కేవలము శ్రవ్యము గాదు. కవి రచించిన నాటకమును నటు లభినయ పూర్వక వ్యాఖ్యానముతో నటించి ప్రేక్షకుల నానంద పఱతురు. ఈ విధముగ నాటక ప్రదర్శనము సామాజికుల హృదయా నందమునకే కాక, చిత్త సంస్కారమునకుఁ గూడఁ దోడ్పడును. ప్రజలు విజ్ఞానమును నాగరకతయు గూడ నాటక రంగం నుండి గ్రహింతురు. గ్రీసు దేశమున నాటక రంగమే విద్యా విజ్ఞాన బోధలకు నిలయములుగా నుండెదిదట. ఇట్టి గొప్ప బాధ్యతను నాటక రంగం వహించును. తమ ప్రభావము సామాజికులపై నున్నది కదా యని నట నాటక రచయితలు, మితిమీరి ప్రేక్షకుల యభిరుచులను, జాతీయ సంప్రదాయములను గౌరవింపక, కేవలము విప్లవకారులుగ పరిణమించినచో ప్రజలు నట నాటకములపై నిరాదరమును జూపుదురు. ప్రజాభిమానము గోలుపోయిన నాఁడు నాటక ప్రదర్శనములు మూల పడును. అందుచే నాటక రచయితలు గూడ నుండరు అయితే యిక నాటకములు సామాజికుల చిత్త సంస్కారమునకు, నభిరుచులను జక్క దిద్దుటకు విద్య నీతి విజ్ఞానములను ప్రబోధించుటకు నెట్లు సాగునని పూర్వ పక్షము వచ్చును. ఇందుచే ప్రజాభిమానము గోలుపోకుండ ప్రజలకు చిత్త సంస్కారమును జేయ వలసి యున్నది నాటక ప్రదర్శనము. అనఁగా క్రమక్రమముగా, బహు సుకుమారముగ సామాజికుల చిత్త వృత్తులపై నూతనాభి రుచులను సంస్కారములను నాటకములు దీసికొని రావలయునే కాని రాజ్యాంగ విషయము లందువలె బలవంతముగను, నాకస్మికము గను మార్పులు తీసికొని రాఁగూడదు. దీనినే కాంతా సమ్మితత్వ మందు రాలంకారికులు. ఇందుచేతనే ప్రజాభిమానములను, నభిరుచులను, జాతీయ సంప్రదాయములను గౌరవింప వలసిన బాధ్యత నాటక కర్తల కెంతేయు నున్నదని గ్రహింప వలయును. కాన ప్రజాభి రుచులు, సంప్రదాయములు, నభిమానములు గౌరవింపఁ బడినంత కాలము నాటక ప్రదర్శనము లాదరింపఁ బడకుండఁ జాలవు. ఇది పరమ రహస్యము. ఇందు చేతనే కవులకు నాటకములందు పాటలు వ్రాయుట కిష్టము లేకపోయినను, పాటలను ప్రవేశ పెట్టుట ఇట్లనియే కదా యాంధ్ర నాటక పితా మహుడైన ధర్మవరము రామకృష్ణమా చార్యుల వారు దన చిత్రనళీయ పీఠికలో వ్రాయుట. షేక్స్పియరు కవి తన యాంగ్ల నాటకములలో యుద్ధములు చేయుట మొదలైన వానిని రంగ స్థలం మీద ప్రదర్శింపఁ జేయుట కిష్టము లేని వాడయ్యుఁ గూడ వానిని నాటకము లందు ప్రవేశ పెట్టుట. కాన ప్రజాభి రుచులను గూడ గౌరవించ వలసిన బాధ్యత నట నాటక కర్తల కున్నదని ముఖ్యముగా గమనింప వలయును. ఇంత గొప్ప ప్రాధాన్యము సామాజికుల కుండఁగా నాటక రంగాభ్యుదయము నందు, "నాటక ప్రదర్శనము రక్తి కట్టి ప్రజాదరణను బొందుట (1) నాటక రచన మీద (2) నటుల యొక్క కౌశలం మీద (3) రంగస్థలం మీద ఆధారపడి ఉంటుంది" అని భావించి, సామాజికుల యభిరుచుల స్థానమును లోపింపఁ జేసి, దాని స్థానమున 'రంగస్థల' మను దాని నొకటి తెచ్చి పెట్టి సమర్థింపఁ జూచుటచే నిట్టి సంక్షోభమునకుఁ గారణ మైనది. రంగ స్థలమునకు మితి మీరిన లేనిపోని ప్రాధాన్యమును, ప్రాముఖ్యము నొసఁగి, దాని మీదనే నాటక రచనమును, నటాభి నయమును నాధార పఱచి, రంగ స్థలానుకూలముగ కవులు నాటకములు వ్రాయ వలెననియు, రంగ స్థల ప్రాశస్త్యము మీదనే నటుల యభినయ విశేషములు రక్తికట్టుననియు, రంగస్థల ప్రాశస్త్యము మీదనే నాటక ప్రాశస్త్య ముండుననియు, రంగ స్థలము లేకపోయిన నాటకములే లేవనియు కొందరు గొప్ప గొప్ప వ్యాఖ్యానములు చేయుచున్నారు. రంగస్థలమునకింత ప్రాధాన్య మిచ్చిన పెద్దలు రంగ స్థల ప్రాశస్త్యమనఁగా నెట్టిదో, దాని వలన నిర్వహింపబడెడి విశేష మేమియో, రంగ స్థల ప్రాశస్త్యమునకు నాటక రచన ప్రాశస్త్యమునకు నెట్టి సంబంధ మెట్లు సిద్ధించు చున్నవో యెవరు నింత వరకు స్పష్టముగ వివరించినట్లు లేదు.

రంగస్థలమనఁగానే పద్యము. Stage, theatre అను పర్యాయపదములు గలది కదా. ఇందులో నాటకములు ప్రదర్శింపఁ బడుటకు వీలైన తెరలు, ప్రక్కతెరలు, మొదలైనవి యుండును. ఈ రంగస్థల పరికరములు ప్రతిదేశమునందును కాల మందును గూడా తయారగుచుండు సాధనసంపత్తినిబట్టి మారుచుండును. ఈ కాలములో రంగస్థలమున మైక్రోఫోను, లవుడ్‌స్పీకరు,ఫోకసింగు లైట్లు, డిమ్మర్సు, టేపురికార్డులు మొదలైనవి వాడఁబడుచున్నవి. ఇవన్నియు నాటక పదర్శనమును స్వాభావికముగా నుండునట్లు చేయుటకై యలంబింపఁబడిన సినీమా టెక్నిక్ మాత్రమే. ఇవియన్నియు నుండినను గూడ "అయితే నాటక నిర్వహణలో ఎంతసమర్థత చూపినా, ప్రేక్షకజనాదరణం అమితంగా లభించడము లేదు కారణంఏమిటి? మనకు చక్కగా నిర్దుష్టముగా నున్నవని తోచిన నాటకాలే బహుజనాదర పాత్రము కాకపోవచ్చు." అని శ్రీవాత్సవ+పైనఁదెలిపిన 'పునరుజ్జీవనము' నువ్యాసమున నాట్యకళయను పత్రికలో వాపోవుచున్నారు. కానసమస్థాధునిక

పరికరాలున్న నేటి రంగస్థలమందలి నాటక ప్రదర్శనమే నేటి ప్రేక్షక జనాదరణమును పొందలేకపోయిన దనగా, రంగస్థలముతో నాటక ప్రదర్శనమునకును విశేషించి నాటక రచనమునకు నెట్టి ముఖ్యసంబంధమున్నదో విచారింపదగును. Turning stage మొదలైన యితర పరికరాలు గూడనుండినఁగాని నాటక ప్రదర్శనము విజయవంతముగా నుండజాలదని వీరియభిప్రాయమై యుండునోవు. కాని దానిలోఁగూడ నెట్టి సత్యమున్నదోగూడ విచారింతము ఈ నూతన పరికరముల వలన నాటక ప్రదర్శనాను కూలత, విశేష సౌకర్యము సిద్ధించునే కాని, నాటక ప్రదర్శనమును రక్తికట్టింపజాలవు. ప్రదర్శనమును రసవంతముగాను విజయవంతగాముగను చేసి, రక్తికట్టించు శక్తి ముఖ్యముగ చతుర్విధాభినయ మందుండునే రంగస్థలాధునిక పరికరములపై ముఖ్యముగా నాధారాపడియుండదు. ఇట్లని యాధునిక పరికరములను పరిత్యజింపుమని నేను కోరను. కాని, వాని కంత ప్రాధాన్యమక్కఱ లేదనియే నాభావము. ఏలన. ఆధునిక రంగ పరికరములులేని కొంచెము పూర్వకాలమున మైలవరము కంపెనీ మోతేవారి నాటక సమాజము, తెనాలి రామవిలాస సభ, రాజ మహేంద్రవరములో గున్నేశ్వరరావు కంపెనీలలో నాటక ప్రదర్శనము బహు రమణీయములుగా నుండెడివనియు ఆకాలమే ఆంధ్ర నాటక ప్రదర్శన స్వర్ణయుగమనియు నిర్ణయింపబడుట కాకాలమున నాధునిక నాటక రంగస్థల పరికరములు లేవు కదా. ఆధునిక పరికరములు లేని యాకాలపు నాటకముల నాధునిక పరికరములు గల నేటి కాల నాటక ప్రదర్శనము లేల మించజాలక పోయినవి? మించలేక పోవుట యట్లుంచి, యామాత్రము ప్రజాదరణమునుగూడ పొందలేక పోవుటయే కాక, మీదు మిక్కిలి ప్రజాదరమును గోలుపోయి నాటకకళ దెబ్బతిను స్థితికేల రావలయును. నేటి కాలపు రంగస్థల పరికరములాంగ్లదేశమున 'గారిక్కు' కాలములో లేకపోయినను, షేక్స్పియరు నాటకములకు గారిక్కుతన అభినయ విశేషమున ప్రాణము పోసినాడను ఖ్యాతియేల దక్కినది. ఆధునిక నాటక రంగ పరికరములు విశేషముగ లేని కాలమున గూడ నాంగ్లదేశమున షేక్స్పియరు మొదలైన ప్రఖ్యాత కవులెట్లు నిరుపమానమైన నాటకములను వ్రాయఁగల్గి, యాంగ్లభాష జీవించి యుండునంతకాలము శాశ్వతముగా నుండగల నాటకము లెట్లు బయలుదేర గలిగినవి. బందరులో రాయలుథియేటరు, నేషనలు థియేటరు, ఇండియన్ డ్రామెటిక్ కంపెనీ మొదలైనవి 1910_1925 మధ్యకాలములో చింపిరితెరల మధ్య బుట్టయ్యపేట నాటకహాలులో ప్రతాపరుద్రీయము, రసపుత్ర విజయము, హరిశ్చంద్ర, చిత్రనళీయము, రామ రాజ్య పతనము పాండవ నాటకములు మొదలైన చారిత్రక, పౌరాణిక, సాంఘిక నాటక రాజములు ఈవని లక్ష్మణస్వామి, మంజులూరి కృష్ణారావు, డివి సుబ్బరావు, పింగళి సోదరత్రయము మొదలైన వారిచే నిరుపమానముగా, రసవంతముగ ప్రదర్శిదపఁబడి రక్తికట్టి, విజయవంతములై, యట్టి నాటకములటుతర్వాతఁ జూడగల్గిన యాశకూడ లేకపోయినవే. అట్టినాటక ప్రదర్శనప్రాశస్త్యమంతయు రంగస్థల పరికరముల చేతను, నాటక స్టేజీ డైరక్టర్ల వలనను సిద్ధించినదా? కాన నాటక ప్రదర్శన ప్రాశస్త్యము గాని, నాటక రచనా ప్రాశస్త్యము గాని నాటక రంగస్థల పరికరముల మీద నాధార పడి యున్నదని భావించుట కేవలము భ్రమయే కాని వేరుకాదు. రంగస్థలమునకు లేనిపోని మితిమీరిన ప్రాధాన్యమును, ప్రాముఖ్యమునొసంగి, నాటక కళాభివృద్ధికి ముఖ్యములైన విషయములను గుర్తింపలేక, నాటకకళకే దెబ్బతెచ్చి పెట్టుచున్న కారణములను గమనింపలేకపోవుట శోచనీయము దూరపు కొండలు నునుపను నట్లు, మన నాటక సంప్రదాయములను, అభిరుచులను, మననాటకానుభవములను, మన నాటక చరిత్రను, మన నాటక లక్షణములను విస్మరించి, పరిత్యజించి, తెలియక విదేశీయ నాటకపద్ధతులను కేవల మంధానుకరణము చేసి, వారి భావములే ప్రమాణములుగా భావించి, యాచరణలో పెట్టదలచు కొనినపుడు మన నాటక రంగము దెబ్బతినక యేమగును? నాటక రచనలో, నాటక ప్రదర్శన విధానములో, నాటకాభినయములో సర్వవిధముల విదేశీయుల ననుకరింపఁజూచుచున్నాము. అవి మనజాతి సంప్రదాయములకు సరిపోవునా లేవా, మన యభిరుచున కనుగుణముగా నుండునా లేవా? మన సమాజికు లభినందింపగలరా, లేరా. యనువిచారమే మనకు కలుగుట లేదు. విదేశీయులు నాటక కళలో ముందంజ వేసిరి. కాన మనము వారి ననుకరించినచో వారితో సమానము కాగలమని యేధోరణి కాని, మిగిలిన విషయములను గుర్తించినట్లు లేదు. ఇది పులినిజూచి నక్క వాతలు పెట్టుకొని నట్లున్నది. ఇందుచే మన నాటక కళమూలముననకే మోసమువచ్చినది. ఈ సందర్భమున లలిత కళా విమర్శకులును, విశేష విద్యావంతులును, నవీన నాటకరచయితలును ప్రాడ్వివాకులైన డాక్టరు పి. వి. రాజమన్నారు గారు అరుణోదయ సంగీత నాటకమండలి ద్వాదశవార్షికోత్సవ సందర్భమున 1957 సం॥ ఏప్రిల్ 27, 28, తేదీలనాటి యుపన్యాసములో నేమని ప్రబోధించినారో గమనిపింపుడు. "ఆంధ్రుల జీవితం ప్రతిబింబించేవి. యీ పాటలు నాటలు. ఇవి నశించిపోకుండా ఉండటానికి ప్రయత్నం చెయ్యాలి. చైనాలో ప్రజారాజ్యం స్థాపించిన తర్వాత ప్రభుత్వంవారు జానపద సంగీత నాట్యాల

నెక్కువగా ఆదరించి ప్రోత్సాహిస్తున్నారు. సోవియట్ రష్యా మొదలైన దేశాల్లో కూడా అలాగే సంగీతం నాట్యం సాహిత్యంతో సన్నిహిత సంబంధం కలది నాటక కళ. నాటకాలంటే తెలుగు వారికి చెప్పరాని అభిలాష. ఆవిషయం బెజవాడలో ఎక్కువగా చెప్పితే తల్లిపుట్టింటి సంగతి మేనమామ దగ్గర చెప్పినట్లుంటుంది. నాటక కళలోనే దేశసంస్కృతి ఎక్కువగా వ్యక్తమవుతుంది. అందుచేత మన సంస్కృతికి దూరం కాకూడదు. మన నాటక కళా పరిణామం అన్యదేశ విజ్ఞాన సంపత్కాన్ని బహిష్కరించ నవసరములేదు కాని, కేవలం మనకు సహజం కాని జీవితాంశాలను యథాతథంగామన నాటకాల్లోకి తెచ్చిపెట్టుకొంటే, పులినిచూచి నక్క వాతలు పెట్టుకున్నట్లు హాస్యాస్పద మవుతుంది. ఇది నామనవితో కూడిన హెచ్చరిక." (పుట. 18)

ఔత్సాహిక నాటక సంఘాలు ప్రదర్శించు నాటకాలనేకము పాశ్చాత్య భాషా సంప్రదాయానుగుణముగా నున్నవని శ్రీ వాత్సవ పైనఁబేర్కొనిన వ్యాసముననే యిట్లు తెలిపినారు. "అయితే మన రంగస్థలం మీద అమెచ్యూర్ సంఘాలు ప్రదర్శిస్తున్న అనేక నాటకాలు ఇతర భాషల నుండి, ముఖ్యంగా ఆంగ్లం నుండి, హిందీ సినిమా కథలనుండి అనువాదాలూ అనుకరణలూ అనే విమర్శ ఉన్నది. నిజానికి కొన్ని సాంఘిక నాటకాలలో సన్నివేశాలూ, సంఘటనలూ సంభాషణలూ మన సంఘానికి, మన సమాజ పరిస్థితులకూ విరుద్ధంగా వుంటున్నాయి. ఒకవేళ యీ నాటకాలు మన రంగస్థలం మీద ప్రదర్శించినపుడు తాత్కాలికంగా కితకితలు పెట్టినట్టు నవ్వించినా కవ్వించిన అవి మన జీవితాన్ని ప్రతిబింబించ లేక పోతున్నాయి. అల్లాగే కొన్ని చిత్రవిచిత్ర సంభాషణల వల్లా, కొన్ని కృత్రిమ పాత్రలవల్లా, కొన్ని ఆకస్మిక సంఘటనలవల్లా ప్రేక్షకజనాన్ని తత్సమయంలో విభ్రాంతుల్నిచేసి రక్తి కట్టినట్టని పించుకొనిన నాటకాలున్నవి. అవి కూడా మన జీవితానికీ, వాస్తవ పరిస్థితులకీ దూరంగా వుండి, సాంఘిక దుస్తులు ధరించిన జానపద గాథలు లాగా పొడగట్టున్నవి. మరొక తెగకుచెందిన నాటకాలు రాజకీయ సమస్యలూ సాంఘిక సమస్యలూ తీసికొని కొన్ని వర్గాల వారిని దూషించి, మరి కొన్ని వర్గాలవారిని భూషించి ఉద్రేక పఱచే వర్గ వినాదాలతో ఉపన్యాస ధోరణిలో నడచి సభాసదుల హర్ష ధ్వానాలందు కొంటున్నవి. కాని నిజానికి నాటక శిల్పంలో ఉత్తమ స్థాయినందుకోలేక పోతున్నాయి. అందుచేత రచనలో ఈ లోపాలు గ్రహించి మంచిచెడ్డలు వివేచనచేసి చెప్పే సభాసదులు కావాలి. సభాసదుల అభిరుచులు సక్రమమార్గాన పట్టేటట్టు సద్విమర్శలు రావాలి" అని. దీనివలన నేటికాల నాటకాలలో విదేశీయ సంప్రదాయములే యెక్కువయై స్వజాతీయ సంప్రదాయములు లోపించు చున్నవనుట స్పష్టము. ఇందువలన నేటి కాల నాటకములను సామాజికు లభినందింప లేకపోవుటచే నాటకకళ తగిన ప్రోత్సాహము చెందలేదనుటలో నాశ్చర్యము లేదు. దీనికిందోడు నటులలో నభినయ విధానమును గూర్చి 'సీమీ' దృక్పథమనియు, 'స్టానిస్లవిస్కీ' దృక్పథమనియు, 'హెర్ట్రోల్ట్' దృక్పథమనియు, విదేశీయ సంప్రదాయములందే యాదరాభిమానములు చూపి, భరతుడు, అభినవ గుప్తుడు, విశ్వనాథుడు విద్యానాథుడు మొదలైన ప్రాచీన నాట్యశాస్త్రవేత్తల దృక్పథములనుగాని, ఈవెని లక్షణస్వామి, హరిప్రసాదరావు, బళ్లారి రాఘవ, ముంజులూరి కృష్ణారావుగారు మొదలైన యాంధ్ర నటవతంసులయభినయ విశేషములుగాని యాదర్శపాత్రము కాకపోవుటచేత నాంధ్రనాటకములపై మన కాదరాభిమానములు తగ్గినాటకకళక్షీణదశకు రావలసిన కారణమైనది. కాన నాటకకళ యాంధ్రులలో నభివృద్ధి . పొందవలెననిన, ఆంధ్రుల సంప్రదాయాభిరుచుల నాదరించునదై యుండవలె కాని తద్భిన్నముగా నెన్నడు నుండరాదు. అందుచేతనే యాంధ్ర నాటకరంగారంభదశ విజాతీయ నాటక ప్రభావమువలనే కలిగినను, నాటక రచనయు, ప్రదర్శనములు గూడ భారతీయ నాటక సంప్రదాయాను గుణముగ సాగుటవల ననే, యాంధ్ర నాటకకళ కొంత ముందునకు సాగగల్గినది, నటులలోగల వ్యక్తిగతలోపములచే నాంధ్ర నాటక రంగము క్షీణించినది కాని వేరు కారణములచే కాదు. ఆంధ్ర నాటక ప్రదర్శనవిధానములో గొన్ని లోపముల కారణమున నది సంపూర్ణాభివృద్ధిఁగాంచ లేకపోయినది. ఆలోపములనే సర్దుకొనఁగలిగినచో నాంధ్రనాటకకళ నేటి కాదర్శ ప్రాయమై యితర జాతులవారికిఁగూడ మార్గదర్శకమై యుండెడిదనుటలో సందేహం లేదు. మన నాటకకళ తమిళ నాటక కళనుమించి యుండ లేదా? అట్లే సక్రమముగానాంధ్ర నాటక కళయభివృద్ధి పొంది యుండినచో పాశ్చాత్య నాటక కళను కూడ మించి పోయెడిదనుటలో సందేహము లేదు. ఆంధ్ర నాటక కళోదయమైన కొలది కాలముననే ఈవని లక్ష్మణస్వామి. హరిప్రసాదరావు, బళ్ళారిరాఘవగార్లవంటి నటులు బయలుదేరిరనగా నింక విశేషమేమి కావలయు. నాటకము ప్రేక్షకులకు తేలికగను, స్పష్టముగను తెలిసియభినందింపఁ గలందులకే నాటకకథ ప్రఖ్యాతమైనది కావలయునని మనయాలంకారికులును శాసించిరి, కాని యది మన నాటకకళా పరిషత్తువారికి నచ్చకపోవుటచే పౌరాణిక చారిత్రక విషయములు వాస్తవికత్వమునకు దూరములని భావించి, వానిని తిరస్కరించి, కథ కేవలము సాంఘికముగా నుండవలెనని

శాసించిరి. దాని ఫలితమేయిది. నాటక కథయే ప్రేక్షకుల కాకర్ష ణీయము కాకపోయినది. ఈ దూరదృష్టి మన కళాభిజ్ఞులకు లేక పోయినది నాటక కళాపరిషత్తు వార్షికోపన్యాసములలో నధ్యక్షోప న్యాసము లొసంగిన కొందఱు పండితులీవిషయమై జ్యోతిషమును వ్యంగ్యముగాఁజెప్పి సలహానిచ్చిరి. కాని వారి సదుపదేశము వీరికి దురుపదేశముగాఁ దోచినది. అందుచే నది గ్రహింపఁబడక పోయినది. ఇప్పటికైనను నాటక కళపై ప్రజల యాదరాభిమాన ములు తగ్గుటకిది యొక హేతువని పరిషత్తువారు గ్రహించినట్లు లేదు. నాటక కళపై గౌరవము దగ్గుటకు జమీందారులకు పోషకు లకు కంట్రాక్టర్లకు నటుల నికృష్ట ప్రవర్తనమే కారణమైనట్లుగ, ప్రజలకు గూడ నేటి నాటకముపై నిరాదరణగలుగుటకు నేఁటి నాటకముల కథావస్తువేయని గ్రహింపవలసియున్నది.

(2) నాటకకళా పతనమునకు మఱియొక ముఖ్య కారణము స్వభావవాదమునతిగా పెంచెకొనుట. ఇది నాటకకళకే వేఱుపురు గుగా పరిణమించినది నాటకకళ స్వభావసిద్ధముగను స్వతంత్ర ముగ నుండవలెనని యెంచి యందలి కవిత్వము, సంగీతమును పరిత్యజింపఁబడినవి. నాటకమునందలి పాత్రములు సంగీతముతో పద్యములను చదువుట యసంభావ్యమని తలఁచి వానిని దిగనాడి వచనములతో మాత్రమే పాత్రలు సంభాషించు నటులఁజేయఁబడి నది. దీనికిఁదోడు గ్రాంధిక భాష కృత్రిమ భాషయనియు, వ్యవ హారిక భాష జీవవంతమైన దనియు వాదించి ముఖ్య పాత్రములకుఁ గూడ పచ్చి వ్యావహారిక భాషయే వాడఁబడినది. ఆంధ్ర నాటక ప్రారంభదశలో నీచ పాత్రలకుఁగూడ గ్రాంధిక భాషయే యుప యోగింపబఁడి యసహజముగా గోచరించెడిది దానికి ప్రతీకారముగఁ గాఁబోలు ప్రస్తుత కాలమున నాయక పాత్రమునకుఁగూడ పచ్చి వ్యావ హారిక భాష వాడఁబడుచున్నది. ఇందుచే నాయక పాత్రమునకుఁగల యుదాత్తత నాశనమై, నీచ పాత్రయు నాయకపాత్రయు నొక్కటే దశయందున్నట్లు గోచరించు చున్నది. ఇది మాత్రము కృత్రిమ మై యసహజముగా నుండదా? నీచ నాయక పాత్రలిద్దరు గ్రాంధిక భాషలోనే మాట్లాడుట యెట్లు సహజముగాఁగనఁబడునో, వారిద్ద రును గూడ పచ్చి వ్యావహారిక భాషలో మాట్లాడుటకూడ నసహజ ముగనే గోచరింపక మానదు. నీచ నాయక పాత్రముల భేదము భావములలోను, ప్రవర్తనలోను స్పష్టమగునటుల, భాషలోఁగూడ స్పష్టమగుచుండవలెను. చతుర్విధాభినయములలో వాచికాభినయ మునకుఁ జెందినది భాష కదా! భావమును బట్టి భాషలోనుదాత్తా నుదాత్తస్వరిత భేదాదులను ప్రతిపాదించుట మాత్రమేకాక, నీచ ప్రధాన పాత్రములకుఁగల భేదము వ్యావహారిక గ్రాంధిక భాషా ప్రయోగ భేదముచేఁగూడ స్పష్ట పఱుప వలసియున్నది. ఇట్టి భేదము లేక ప్రధాన పాత్రలకు పచ్చి వ్యావహారిక భాష యొక్కటే వాడఁబడుటచే నాటక ప్రదర్శనమున గాంభీర్యము చచ్చిపోయి చప్పచప్పగా నుండినది. సాధారణముగ నీచ పాత్రకంటె నాయక పాత్రముదాత్త భావములను వ్యక్తీకరించునని మనము భావింప వచ్చును. నీచ భావములు వ్యావహారిక భాషలో వ్యక్తీకరింపఁ బడుట యెట్లుచితముగా నుండునో, యుత్తమభావములు గంభీర ముగా నుండునుగాన నవి గ్రాంధిక భాషలో వ్యక్తీకరింపఁబడి నపుడుచితముగా నుండునే కాని వ్యావహారిక భాష పేలవముగా నుండక తప్పదు. ఇందుచేతనే పాత్రోచిత భాషా భేదము సిద్ధింపఁ గలదు.

ఇకనాటకమున, స్వాభావిక వాదమును పురస్కరించుకొని, పద్యములే యుండరాదని కొందఱును, పద్యముండినను వానిని పద్యములవలె సంగీతముతోఁగాక వచనమువలెఁ జదువవలెనని కొందఱును, మఱికొందఱు పద్యములను వచనమువలెఁ గాక కొంచెము సంగీతముతో శ్రావ్యముగ పాడవచ్చుననియు ననేక విధముల నటులు, పండితులు, విమర్శకులు తలంచుచున్నారు. స్వభావ వాదము మాటయెట్లున్నను నాటకరంగ స్థలముమీఁద పద్యములను విశేష సంగీతముతో రాగాలాపనము చేసి పాటకచేరి చేయుటమాత్రము తిరస్కరింపఁదగినదే. ఏలయన, నటుడు రాగాలాపము పైనుండు శ్రద్ధచే నభినయమున శ్రద్ధచూపలేక పోవును. అందుచే నభినయమున లోపమువచ్చును. మఱియు ప్రేక్షకులు నాటక కథ నభినయ పూర్వకముగఁ గాంచుటకుఁ గుతూ హల పడుదురే కాని సంగీతము వినుటకుకాదు. ఇందుచే విశేష సంగీతము నాటకాభినయమున కడ్డుతగులు ననుట నిర్వివాదాంశము. కాన నాటకమున పద్యములను శ్రావ్యముగఁ జదువవలయునే కాని పద్యము చివర రాగాలాపన చేయరాదు. ఇట్టిపద్ధతిని నాటక రంగ స్థలమున శ్రీ నాగరాజారావు, పింగళిలక్ష్మీకాంతం, మాధవపెద్ది వెంకట్రామయ్య మొదలగు కొలదిమంది నటులు మాత్రమే జయప్రదముగ నిర్వహించి గౌరవప్రతిష్ఠలను సంపాదించుకొనిరి. ఇట్టి యసిధారా నియమ వ్రతమును పాటింపలేని నటులు నాటక రంగస్థలమునఁ దమరాగాలాపనను ప్రదర్శించి యభినయమును ధ్వంసము చేయుటచేతనే విసుగుచెంది, నాటకమున నసలుపద్యము లేయుండరాదను నిర్ణయము చేయవలసిన స్థితికి వచ్చినది. కాని యదిసరసమైన పద్ధతికాదు, నియమమును పాటింపలేకపోవుట నటుల దోషము కాని, నాటక కళ దోషము కాదుకదా. అందుచే

నాటకమున పద్యములనుగాని, పద్యపఠనకుఁగావలసినంత శ్రావ్య గానముగాని, లోపింపఁ జేయుట నాటకకళలోని కొన్నియంగము లను లోపింపజేయుటయే యగును.

నాటకకళ ప్రత్యేకమైన యొక లలితకళకాదు. ఇది యన్ని లలితకళల కూడికవలన వర్థిల్లిన సమాహారకళ, లేక మిశ్రకళ. ఇందు కవిత్వము, నభినయము, సంగీతము చిత్రలేకనమును కలసి ప్రవర్తిల్లును. ఇందుచేతనే దీనిలో నితర లలిత కళల కంటె నెక్కువ మనోహరత్వమును, రామణీయకమును వంతృప్తియు సిద్ధించు చున్నవి. ఎన్ని విద్యలనైన నుపయోగించుకొనఁ గలిగినది కళ కాన వివిధవిద్యల కూడికవలన వర్ధిల్లిననాటకకళనుండి స్వభావవాదమును పురస్కరించుకొని కవిత్వమును, సంగీతమును ప్రత్యేకపఱచి, యభినయము మాత్రము స్వతంత్రముగ, ప్రత్యేకముగా రాణింప వలెనని, నందు కవిత్వ సంగీతముల వలన గలుగు శోభా మనోహరత్వములను పోగొట్టుకొనుటకు సిద్ధపడవలెను. దానసంపూర్ణ కళాసిద్ధి కలుగదు. ఏలన, సంగీత మాపాత మధురమైన లలితకళ. సాహిత్య మాలోచ నామృతమైన లలితకళ. ఇట్టిసాహిత్యము గల దృశ్యకావ్యము నాటకము. నాటకమందలి పాత్రలాలోచనామృత మైన సాహిత్య భావముల, నాపాత్ర మధురమైన సంగీత పూర్వక వాచకాభినయ మూలమున ప్రదర్శించి సమగ్రమైన కళను సాక్షాత్కరింపఁ జేయుదురు. ఇది నాటక కళాప్రాశస్త్యము.

నాటకమున పద్యముల స్థానమును గూర్చి పానుగంటి లక్ష్మీనరసింహరావు గారు దమ సాక్షీవ్యాసములలో నెట్లు వ్రాసిరో కొంచెము పరామర్శింపఁదగిన విషయము. "పాటల వలనే యపు రూపవృత్తములు నాటకముల నుండదగదని తేలుచున్నది ... మత్తేభ, శార్దూల, చంపకోత్పలమాలావృత్తములు గూడ నాట కములనుండ గూడదు. వీనికిఁగూడఁదాళపు సంకెల, విశేషము లేనప్పటికిని, లేకపోలేదు. నాటకమునఁబాటలు పాడుట యెట్ల సహజమో, పద్యములు పాడుట కూడ నట్లే యసహజము ఆ పద్యము సామాన్య వృత్తములయిన సరే! వింత వృత్తములైన సరే! అన్నివృత్తములు నాటకమునుండి బహిష్కరింప దగినవే. . అటులైన నొక్కవచనము తప్ప నాటకమున మఱేమియు నుపయో గింపఁగూడదా? ప్రకృతవైఖరి ననుసరించి వ్రాసిన యెడల నంతే! అటులైనచోఁబూర్వనాటక కర్తలందఱు ప్రకృతి జ్ఞానాభావులేనా?.. దృష్టిగోచరములు గాని, హృదయావస్థల బొమ్మలను బాహ్య ప్రకృతితోనుండు రంగులతోడనే వేయవలసియున్నది. కాన నిట్టి సమయమున నుపమాలంకార మావశ్యకముగ వచ్చును......... ప్రశస్తవర్ణనముతోడి యీ మంచి కల్పనము వచనమునఁబెట్టిన యెడల సొగసుగనుండదనియు. నిమిడికగ నుండదనియు, బద్య రూపమున నున్నజనులజిహ్వాగ్రముల దఱచుగ నుండదనియుఁ బూర్వ సంస్కృత కవులలో నుత్తమోత్తములగు వారెంచి తాళ సందర్భ సహితములగు వృత్తముల నన్నింటిని నిరాకరించి కేవల వచనమువలెఁగొంచెము హెచ్చుతగ్గుగనడుచు నార్యావృత్తము నను ష్టుపు వృత్తము తఱచుగా నుపయోగపఱచినట్లు కనఁబడుచున్నది... ప్రశస్తమైన యభిప్రాయమున్న యెడల దాని నుపమార్థాంతర న్యాసాలంకారముతో మేళవించి, దానిని ధారణాయోగ్యముగఁ జేయుటకై నడకయందు వచనము కంటె విశేష భేదములేని వృత్తములలోఁబూర్వోత్తమకవులు దానిని ముడ్చుకొనిరి. వచనమే ప్రకృతిననుసరించి ప్రధానమైన నాటకమున నంగీకారమున విధిలేక కొన్ని జాతుల పద్యములనుత్తమకవులు స్వీకరింపవలసివచ్చినది... అత్యంత వచనమును బోలియున్న పద్యము కావలయును ... ఇంగ్లాండు దేశకవులు నాటకరచనయందు Blank Verse అను పద్యము నుపయోగింతురు... ఇదికూడ తఱచు సంభాషణములోఁ దెలియకుండ వారుపయోగించుకొందురు. ఇది వచనమని వచనము కాదు. పద్యమని పద్యముకాదు. చక్కని యుభయ మధ్యస్థ రచనా చమత్కారముగల్గి నాటకమునకు బరిపూర్ణముగ దగియున్నది... ఇంగ్లీషువారికి Blank Verse ఉన్నది. సంస్కృత భాషలో "ఆర్యావృత్తము, అనుష్టుపు వృత్తములున్నవి." వీనికిఁబ్రతి బింబమైనది మన యాంధ్రభాషలో నేమియున్నదని యాలోచింపఁగ "తేటగీతి" కనఁబడుచున్నది. దీనికిఁదాళసంబంధము మిక్కిలి తక్కువకలదు...... ఇది పద్యము కాదు. వచన మంతకంటె గాదు... దీని కంటె ఛందస్సును వచనమును బోలిన పద్యము లేదు. అందుచే నిదియే సర్వ విధముల నాటక రచన కత్యంత మర్హమైయున్నది... సీసము, నాటవెలదిని గూడ నుపయోగపరచ వచ్చును. వీనిని జదువవలసినప్పుడాయా రసభేదోచిత కంఠరవ పరిపాకముల జదువ వలయును. గానధోరణిని బాడ గూడదు. నాటకములో నన్నియుఁదేటగీతములేయైనచో విసుగుగనుండునని కొందఱందురు. ఇది కేవలమూఢాభిప్రాయము. మననాటకములలో నచ్చటచ్చటనున్న గీతపద్యములే విసుగుగల్గించునెడల నారంభము మొదలంతమువఱకు నొక్కటే Blank Verse పద్యముగల యింగ్లీషునాటకము లంతకంటె విసుగుగల్గింపవలసినవి కావా?

ఈ వాదమంతయు నాటకమునందు పద్యములుండ కూడదను తన మతమును సమర్థించుకొనుటకై తెచ్చిపెట్టుకొనిన కృత్రిమ కల్పనాపద్ధతియే. కాని యిందలి విషయములన్నియు నసంబద్ధములు, ననౌచిత్యములు నసంగతములును గూడ. ఏలన ముఖ్యముగా లక్ష్మీ నరసింహారావుగారికి కవిత్వభావములకు ఛందస్సునకుఁగల సంబంధ మెట్టిదో బోధ పడలేదు. రసవంతములైన భావములకు ఛందస్సునకు నవినాభావసంబంధమున్నదని వాల్మీకి క్రౌంచమిధునేతి వృత్తము నుండి స్పష్టపడుటయేకాక, పాశ్చాత్య పండితులుగూడ నుత్కృష్ట భావములకు ఛందమునకు సన్నిహిత సంబంధమున్నదని యంగీకరించిరి. "Poetry is the art cf producing pleasure by the just expression of imaginative thought and feeling in metrical language".—Courthope. విభావితాభిప్రాయములను రసములను గణబద్ధమైన భాషలో ప్రకటించి, వాని మూలమున డెందమలరింపఁజేయుకళ కవిత్వమగును. 'Poetry is musical thought' శ్రావ్యమగు భావము కవిత్వమగుచున్నది. అని Carlyle తెల్పినాడు. ఇఁక 'Poetry is the rhythmical creation of beauty' లయాన్వితమైన పదజాలముచే సౌందర్య స్వరూపమును సృజించుట కవితయగును. అని Poe అను పండితుడు వివరించినాడు. మరియు "Poetry is metrical composition. It is the art of uniting pleasure with truth by calling forth imagination to the help of reason"—Johnson. కవిత్వము చందోబద్ధమగు రచన. బుద్ధియు భావనయు సాధనములుగా నానంద సత్యముల యైక్యమును జూపు కళ. తర్వాత ఛందో కవిత్వములకుగల సంబంధమును గూర్చి Leigh Hunt యిట్లు తెల్పినాడు. "The opinion that metre is not necessary is a prosaical mistake. Fitness or unfitness for song (metrical excitement) makes all the difference between a poetical and prosaical subject. The reason why verse is necessary to the form of poetry is that the perfection of the poetical spirit demands it—that the circle of its enthusiasm, beauty and power is incomplete without it". ఛందస్సనవసరమని భావించుట యొక నీరసదుర్వాదము. ఛందోర్హతానర్హతలే రసవద్వస్తువునకు నీరసవస్తువునకుఁగల ప్రధాన భేదము. కవితా బాహ్యరూపము ఛందోమయముగ నేల యుండవలయుననిన, దాని యంతస్సారము స్వసిద్ధికై యారూపమునే యపేక్షించును. కనుక భావావేశము, రసము, నోజస్సు మొదలైన కవితాగుణ సముదాయము ఛందస్సులేక సమగ్రము కానేరదు. పై యాంగ్ల విమర్శకుల ప్రమాణ వాక్యములను బట్టి కవిత్వమనఁగా నేమియో, దానికి ఛందస్సునకెట్టి సహజ సంబంధముగలదో స్పష్టమగుచున్నది కదా. ఇఁక నాటకము దృశ్యకావ్యముగదా. 'కావ్యేషు నాటకంరమ్య'మ్మనియు, 'నాటకాంతం సాహిత్య'మ్మను ప్రమాణ వాక్యములను బట్టి నాటకములలో నుత్తమ కవితముండునని భావింపఁదగును. ఇట్లుండగా నరసింహారావుగారు ప్రశస్తమైన యభిప్రాయమున్న యెడల దానినుపమార్థాంతరన్యాసాలంకారములతో మేళవించి, దానిని ధారణా యోగ్యముగఁ జేయుటకై, నడకయందు వచనముకంటె విశేష భేదములేని వృత్తములలోఁ బూర్వోత్తమకవులు దానినిముద్చుకొనిరి' అని వ్రాయుటలో నౌచిత్యమేమియున్నది? మరియు మత్తేభశార్దూలాది వృత్తములలోఁ గూడ తాళపు సంకెల లేక పోలేదు. కాన నవినాటకమున పరిత్యజింపవలెనట. లక్ష్మీ నరసింహారావుగారికి లయతాళములకుఁగల భేదము తెలిసినట్లు దోఁచదు. 'ఇంగ్లాండు దేశకవులు నాటక రచనయందు 'Blank Verse' అను పద్యముపయోగింతురు. ఇది వచనమని వచనము కాదు పద్యమని పద్యము కాదు. చక్కని యుభయ మధ్యస్థరచనా చమత్కారముగల్గి నాటకమునకుఁ బరిపూర్ణముగదగియున్నది." అని నరసింహారావుగారు వ్రాసిరి. Blank Verse లో నొక్క యంత్యప్రాస మాదిరి Rhym మాత్రము లేదు. మిగిలిన గణములకూర్పున్నది. ఆంగ్లభాషలో పద్యములను వచనమువలె చదువు నాచారము గాఢముగానున్నది. ఆ భాషలో పాటలను (Songs) మాత్రమే మన పద్యములవలె పాడుదురు. మన కీర్తనలవలె తాళలయ ప్రస్తారముతో మద్దెలమ్రోతలో పాడు సంప్రదాయము ఆంగ్లమునన్నట్లు తోచదు. వారు నృత్యము చేయునపుడుగూడ కర్ణాట నృత్య సంగీతమువలె మద్దెలదరువులతో విశేషము పని యుండదు. బహుసుకుమారముగా నుండును. ఇది వారి సంప్రదాయము. ఇందుచే వారి Blank Verse మాలికగానెన్ని పంక్తులు నడచినను వచనమువలె నుచ్చరింప వచ్చును దీనిలో నూత (Accent) మాత్రముండును. ఇది ప్రతి శబ్దములోగూడ నుండును. ఈ Blank Verse కేవలము నాటకములకే కాక పురాణ కవిత (epic Poetry) లోఁగూడ వాడఁబడినది. మిల్టను కవి Milton's Paradise Lost Blank Verse లోనే వ్రాసినాడు కదా. ఆంగ్లభాషలోనే పద్యమైనను రాగాలాపనతో జదువు సంప్రదాయము లేకపోవుడచేతను, కేవలము వచనమువలె చదువునాచారముంఉటచేతను పద్యమాలికగా Blank Verse ను వ్రాయఁ

కలిగిరి. తెలుగునగాని, సంస్కృతమునఁగాని పద్యమాలికగా నాటకము వ్రాయు నాచారమందుచేతనే లేదు. ఈ భాషలలో పద్యములను వచనములవలె చదువు సంప్రదాయము లేదు. భాషా సంప్రదాయమును గుర్తింపక తేటగీతినిగాని, యార్యానుష్టుపులను గాని మాలికగా నాంగ్ల భాషననుకరించుచూ వ్రాసినచో నెట్లుండునో చూడవలసియున్నది. వావిలాల వాసుదేవ శాస్త్రిగారు దమ జ్యూలియస్ సీజరు నాటకాంధ్రీకరణమును తేటగీతి మాలికలో రచించిరి కదా. అది యెంత ప్రజామోదమును బొందినది? దాని నెవరైనను నాంగ్ల భాషా సంప్రదాయానుగుణముగ వచనమువలె చదివి ప్రదర్శించి రక్తి కట్టింపఁగల్గిరా? కందుకూరి వీరేశ లింగముగారు దమ వినీసువర్తక చరిత్రమును (Merchant of Venice) అను నాంగ్ల నాటకాంధ్రీకరణమును ద్విపదమాలికలో వ్రాసిరి యాంగ్ల సంప్రదాయానుకూలముగ. అది ప్రజానురంజకమైనదా వారి యభిజ్ఞాన శాకుంతలాంధ్రీకరణమువలె. ఎందుచేత కాలేదు? వినీసువర్తక చరిత్రమున కథా చమత్కారముగాని, రసవత్సన్నివేశములుగాని, హృద్యమైన కవితాభావములుగాని తక్కువ కాదు కదా. తత్కర్తయగు షేక్స్పియర్ కాళిదాసునకు తీసిపోడు గదా. ఆంధ్రీకరణకర్త రెంటికి నొకరే కదా. ఈ భేదమెందులకు వచ్చినది. యనగా రచనా విధానము సంప్రదాయవిరుద్ధముగానున్నది. వెనీసువర్తక చరిత్ర ద్విపదమాలికలలోఁ గూర్పఁబడినది. అట్లుగాక భారతీయ నాటక సంప్రదాయానుగుణముగనది చతష్పాద వృత్తాది పద్యములతోడను వచనముతోడనుగూర్పఁపడినచో శాకుంతలాంధ్రీకరణమువలె నాదరింపఁ బడెడిది ప్రజలచే ద్విపదలో ప్రాసలు పరిత్యజించి మంజరీద్విపదగా రచించ నెట్లుండునో Blank Verse యట్లుండును. అంతయే భేదము. Blank Verse వలె సంస్కృతమున నార్యానుష్టుపు ఛందములు వచనముగాని పద్యముగాని మధ్యస్థ రచనమట్టి తెలుగులో ఆటవెలది పద్యమట్టిదియట. దీనికి జన్మసిద్ధమైన యొక్కనడకలేదట. రామాయణమును సంస్కృతమున వాల్మీకి మహర్షి వ్రాసి లవకుశులచే పాడించెనని కదాయనుశ్రుతమైన గాథ. ఆ వృత్తము పాడుట కనర్హమైనదని కదా లక్ష్మీ నరసింహారావుగారి వాదము. ఇది యెంత వరకు సమంజసముగా నున్నది. ఆర్యానుష్టుపు ఛందములుగల శ్లోకములను మనవారు వచనమువలె చదివిరని పూర్వమెవుడైన సంప్రదాయము కలదా. ఉత్తమ కవుల వ్రాతలనుబట్టి వారికట్లు కనఁబడినదట. నాటకమున పద్యములుండరాదను దృష్టితోఁ జూచిరికాన వారికట్లు కనఁబడినది, కాని యందఱకట్లు కనఁబడదు. ఉత్తమ సంస్కృత కవులు దమ నాటకములలో నార్యానుష్టుపేతరవృత్తములను విశేషముగా వాడిరే. అందలకు వారే దృష్టినాపాదించిరో. ఇఁక, "తేటగీతికి జన్మసిద్ధమైన యొక్క నడక లేదట. దీనికి మనము దానిలోఁ బ్రయోగించెడుగణములను బట్టి గమన భేదములనీయగలమట పాత్రమునకుఁగల మన స్థితి భేదములఁబట్టి యీ గమన భేదములుండవలయునట...... అది కాక దీనిఁగేవలము వచనమువలెనే నడచునట్లు మనము గణముల కూర్పులచేఁ జేయవచ్చునట. అట్లు చేయుట తగునట. నాటకములోని గీత పద్యములను గీతములవలెఁ జదువఁబోయిననవి నడవకుండునట్లు వ్రాయవలెనట. అవి వచనములని చదువుకొనినప్పుడే యవి నడువవలయునట......ఇట్టివే యాటవెలది సీసపద్యములు గూడనట......వీనిని జదువవలసి వచ్చినపు డాయారస భేదోచిత కంఠరవ పరిపాకములఁ జదువవలయునట గాన ధోరణిని బాడగూడదట." పద్యద్వేషులై యింత యవస్థ పడకపోయిన నిఁక వచనమునసే వ్రాయవచ్చును కదా. వచనముననుత్తమ భావములను వ్యక్తీకరింప వచ్చునే. సంస్కృత భాషలోఁగల కాదంబరీ దశకుమార చరిత్రము లిట్టి వచన కావ్యములే కదా. గద్యపద్యము కాని గబ్బిళమువంటి వృత్తమునేల యాశ్రయింప వలెను. దీనికింత డొంక తిరుగుడు వాదమేల. ఇందు సారస్యమేమున్నది. నాటకములలో పద్యములుండరాదని తాను నిశ్చయించుకొని, సంస్కృత నాటక కర్తలను కాదను ధైర్యము లేక చేసెడి ద్రవిడ ప్రాణాయామవాదమేకాని దీనిలో బలమేమున్నది? ఇఁక తేటగీతి పద్యము వచనమువంటిదట ఆంధ్ర భారతాది గ్రంధములందలి తేట గీతి పద్యములు వచనములవలెనే యున్నవా. పాపము సీసములు గూడ నట్లేనట. శ్రీనాథుని సీసపద్యములకుఁగూడ నాగతియే పట్టించిరి. ఇది యపూర్వ వాదమే. ఇవి రాగముతోఁబాడగూడదట. లక్ష్మీ నరసింహారావుగారు రచించిన పాదుకాపట్టాభిషేక రాధాకృష్ణాది నాటకములలోని తేట గీత పద్యములను వారు వచములవలెనే వ్రాసినను, వానిని శ్రీ కపిలవాయి రామనాథ శాస్త్రి నాటక రంగస్థలమున మనోహర రాగములతోఁ బాడుటవలననే యా నాటకముల కామాత్రము ప్రజారంజకత్వ గౌరవములు గలిగియాదరింపఁబడినవని లోకము గ్రహించినను రావుగారు మాత్రమంగీకరించెడి వారు గారేమో! వీరి వచన తేట గీతికంటె నభ్యుదయ కవుల వచన కవిత్వము సహస్ర విధములమేలు.

నాటకమున పద్యములుండ రాదనియు, నొకవేళ యుండినను వానిని వచనవములెనే చదువ వలయునుగాని, రాగముతోఁ బాడరాదని భావించుచు నరసింహారావుగారి మతమునకుఁ జెందిన శ్రీపాద

కామేశ్వరరావు, భమిడిపాటి కామేశ్వరరావుగార్లును నిట్టివిచిత్ర వాదమును మాత్రము చేయలేదు. ఆదియొక మేలు. భారత భాగవత రామాయణాది పురాణములనుజెప్పు పౌరాణికులందలి వచనములను గూడ పద్యములవలె సంగీతముతో చదువుచుండగ, వీరు పద్యము లనుగూడ వచనములవలె చదువవలెనని యనుశాసించుదురు. ఇక వీరి దృష్టిలో పద్యవచనములకు భేదమే యుండరాదుగాఁబోలు. వీరి రసజ్ఞతయు, రసికతయు నిట్లుండగా నెవరేమి చేయఁగలరు. లోకో భిన్నరుచిః గదా. సంగీతమును నేర్చిన నటుల చపల స్వభావముచేత కదా నాటకమున సంగీతముండరాదనియు, దానికి దోహదముచేయు పద్యములు పాటలునుండరాదని యిట్టివాదమునకు దారితీసినది. నాటకప్రదర్శనమున కెంతమాత్రము సంగీతము కావలయునో విచారించి, తదనుగుణముగ ప్రయోగించు నిగ్రహము లేకపోవుట చేతనే కదా నిట్టివిపరీత వాదములకు దారితీసినది. 1924వ సం. లో భరతముని బృందమను పేరితో నాటకకళాశాలను బెజవాడలో స్థాపించి యందునటులు శిక్షణపొందినవారు గూడ నది దాటి వచ్చినవెంటనే తమ సంగీత చాపల్యమును నాటకరంగ స్థలముపైఁ జూపకపోలేదట. దాని కెవరేమిచేయఁగలరు. సంగీత పరిజ్ఞానమున్న నటులకంటె, సంగీతజ్ఞాన శూన్యులే నాటకరంగ స్థలము నెక్కువరక్తి కట్టింపఁగలరు. నాటకప్రదర్శనమునకుఁ గావలసిన సంగీత పరిజ్ఞానము బహుస్వల్పము మాత్రమే. అది శ్రావ్యముగా నర్థవంతముగా పద్యమును చదవగల్గుట మాత్రమే. అంతకంటె నధికముగాని, తక్కువగాని సహించరాదు. నాటకమున పద్యములను పరిత్యజించినచో నందురమణీయార్థ ప్రతిపాదకత్వము లోపించి, కావ్యత్వమే భ్రంశమగును. పద్యహీనమైన నాటక ప్రదర్శనమున సంగీతమునకు పరిపూర్ణ బహిష్కారము కలుగుటచే, హృదయ రంజకత్వమును విడనాడి యది చప్పగ, నీరసముగ నుండుటచే, ప్రేక్షకుల నాకర్షింపలేదు. కాన కవిత్వ సంగీతములు రెండును నభినయమునకు సాయపడి నాటకకళను సమగ్రముగఁ జేయవలెను. ఆంధ్ర సారస్వతము సంస్కృత సాహిత్య సాంప్రదాయములో నన్నయనాటినుండి పుట్టిపెరిగినది వంద సం ల నుండి పాశ్చాత్య సాహిత్య ప్రభావము తెలుగుపై నెరపుచున్నది, కాన స్థిరపడిన సంప్రదాయానుగుణముగా నాంగ్లసాహిత్య ప్రభావమును తెలుగున కలుపుకొనవలెఁ గాని, నూతన సంప్రదాయము నుల బలవంతముగా ప్రవేశపెట్టినచో వికటించి రసాభాసమగును.

నాటక భేదముల ననుసరించి గానము వానిలో ప్రధానా ప్రధానస్థానముల నాక్రమించుచున్నది. 'ఆపెరా' అనునాటకజాతిలో పద్యరూపములనే సంభాషణలుండి జంత్రగాత్రములతో పాడబడును. ఇందు భావగీతములును, నృత్యమును ముఖ్యాంగములుగనుండును. దీనిలో గానము ప్రధానస్థాన మాక్రమించును. ఉదా: గీతగోవింద మిట్టిది. ఇది గేయమయ రూపకము: 'మెలోడ్రామా'లో మామూలు నాటకమందలి వాచకముతోఁబాటు పాటలు, మట్లు జంత్రసంగీతమును జేరును. ఇది నాటకమునకును ఆపెరాకును మధ్యస్థరచనగా నుండును. కాన దీనిలోఁగూడ సంగీతముండును గాని, ఆపెరాలో నుండునంత విశేషముగా నుండదు. ధర్మవరం రామకృష్ణమాచార్యుల వారి గద్యపద్య గీతాత్మకములగు నాటకములీ మెలోడ్రామా జాతిలోఁ జేరును. ఇక నాటకములో సంగీత మప్రధానమై స్వల్పముగా నుండును, కాని పూర్తిగా లోపింపదు. ఈ సందర్భమున ముఖ్యముగ గమనించ వలసిన విషయమొకటి యున్నది. నాటకమున నటులు పద్యములను శ్రావ్యముగఁ జదువునపుడు వారి కంఠధ్వనిని మించునట్టి హార్మోనీ మ్రోతను పరిత్యజింప వలెను. దాని స్థానమున ఫిడేలునే జంత్రవాద్యముగ వాడవలెను. హార్మోనియముతోఁబాటు తపలానుగూడ పరిహరించి దాని స్థానమున మద్దెలను ప్రవేశపెట్టవలెను. ఆంధ్ర నాటకారంభదశలో ధార్వాడా, పార్శీ నాటకకంపెనీల ననుకరించుచు ప్రవేశపెట్టుకొనిన దుష్టపరికరము లివి. వీనిమ్రోత దుస్సహమైనది. వీనిస్థానమున శాస్త్రీయ కర్ణాట సంగీత వాద్యవిశేషములను వాడుకొని రెండు రంగముల మధ్య కాలమున లలిత మనోహరమైన వాద్య సంగీతమును ప్రవేశపెట్టిన నెంతయో హృద్యముగానుండి సామాజికుల నాకర్షించును. ఆంధ్ర నాటకరంగమున చేయవలసిన ముఖ్య సంస్కరణమిది.

(3) స్వభావవాదమును దెగపెంచుకొనిచేసిన సంస్కరణములలో నాటకరంగమున స్త్రీల పాత్రములను స్త్రీ లేధరింపవలెననుట. నీతి వాదమును పురస్కరించుకొని స్త్రీల నైతిక ప్రవర్తనమున కిది తగదని కొందరు నిషేధించిరి. కాని ప్రస్తుత కాలమున నెవరి నైతిక ప్రవర్తనకు వారే బాధ్యులు కావలసిన స్థితి వచ్చినపుడీ నిషేధము వారి నరికట్టలేదు. స్త్రీల దుష్ప్రవర్తనకు నాటకరంగ ప్రవేశము మాత్రమే దోహదముకాఁజాలదు. అగుచో వారు కళా ప్రవీణులై పురుషులతో సమానముగ ధైర్య సాహసములతో నభినయింపగల్గినచో నాటక కళోద్ధరణమగును గదా యని సంతృప్తి చెందవచ్చును కాని యట్టిదేదియు లేక వినోదము కొఱకు స్త్రీలను రంగస్థలముపైకి నెక్కించుట మాత్రము కళకు నిరుపయోగమే మానవులలోనే జాతిలోనైన లలితకళా సిద్ధి జన్మ విశేషము చేతనే ఫలించును, కాని కేవలము సాధనచే సాధ్యమగునది కాదు.

సాధనయభివృద్ధి చేసికొనుట కుపయోగపడును. అది నూటికి కొటికి నొకరికి మాత్రమే సఫలమగును. మిగిలినవారికది బుల బాటమును మాత్రమే తీర్చగలదు. గాత్రసంగీము నేర్చిన వారిలో నెంతమంది డి. కె. పట్టమ్మాళ్వలె పాడగలరు? వయలెన్ వాద్య సంగీతము నేర్చినవారిలో నెంతమంది మైసూరు చౌడయ్య వలె ఫిడేలు వేయగలరు. భరత నాట్య మభ్యసించిన వారిలో కుమారి కమలవలె యెంతమంది యభినయింపగలరు? నటులలో ఎంత మంది బళ్లారిరాఘవాచారి, ఈవన లక్ష్మణస్వామి గార్లవలె నటించ గలరు. అయితే మిగిలిన వారి సంగతి యేమీటనగా. వారందరాయ శాస్త్రములందు కళలందు నభినివేషము, నభిరుచి యభిమానము, ప్రవేశముగలవారిని మాత్రమే చెప్పవలయును. నేటి కాలమున నౌత్సాహిక నాటక సమాజములెన్ని యున్నవి. అందలి నటులు వేలకు పైగా నున్నారని కదా. 1958 సం. డిశెంబరునాటి నాట్య కళా పత్రికా సంపాదకీయమగు 'పునరుజ్జీవ నోద్యమ' మను వ్యాసములో "విశాలాంధ్ర అంతటా కొన్నివందల నాటక సమాజములు, కొన్ని వేలమంది నటులూ ఈ ఔత్సాహిక నాటకరంగంలో పాత్రవహిస్తున్నారని" వ్రాయఁబడినది. ఆ నటులందరు నాట్య కళాసిద్ధి పొందిన వారని చెప్పఁజాలము కదా. వీరిలోనే స్వల్ప సంఖ్యాకులు మాత్రమే కళాసిద్ధినిపొందినవారై మిగిలిన వారందఱు నాటకాభిమానులనియే చెప్పవలయును. మఱియు నాటకకళాసిద్ధి నటుల యధికసంఖ్యఁమీదఁగాని నాటక సమాజముల యధికసంఖ్యఁ సంఖ్యమీదగాని యాధారాపడి యుండదు. వారియొక్క విశిష్టత్వము మీదను శక్తిమీద నాదారపడియుండును. "నిక్కమైన మంచినీల మొకటి చాలు, తళుకుబెళుకురాళ్లు తట్టెడేల" అని కదా పెద్దల వాక్యము. నటులు వేలకొలదిగనున్నను ప్రత్యేకవ్యక్తిత్వము గల ప్రశస్తనటులు కొలదిమంది మాత్రమే యుండి వారి విశిష్టాభినయమువలన నాటక ప్రదర్శనమున కంతయు పేరువచ్చును. వారిపేరు ప్రఖ్యాతులు నలుగడల వ్యాపించగ నితరులు వారి ననుకరింపఁజూతురు. వారు నాట్య కళా గురువుల వంటి వారగుదురు. వారి యభినయ విశేషములను గాంచుటకు ప్రత్యేకముగ పనికట్టు కొని ప్రేక్షకులే కాక సామాన్యనటులుగూడ వారి నాటకప్రదర్శనములకుఁబోవుటకు కుతూహలపడుదురు, ఇది సహజమే కాని దోషముకాదు. ఆ ప్రదర్శనములలో ప్రసిద్ధినటుల వ్యక్తిత్వము ప్రకటితమగుటయే కాక. తదితర నటులుగూడ సముచితముగ నటించిననే కాక యాప్రసిద్ధ నటుల యభినయ విశేషములు రాణింపవు కాని కంట్రాక్టు నాటకములలో మాత్రము ముఖ్యపాత్రధారులు క్రొత్త వారగుటచే మిగిలినవారితో కలసికట్టుగ నభినయింప లేక పోవుట చేతను, నాసటశ్రేష్ఠులు సమిష్టి నాటక రక్తియందు కంటె తమ కర్తవ్యము నెరవేర్చుకొనుట యందె శ్రద్ధనహించుట చేతనా నాటకములు జయప్రదములు కాకపోయినను వ్యక్తినటుల యభినయ విశేషములు మెప్పుపొందెడివి. ఇది యా వ్యక్తినటుల దోషము కాదు కదా కంట్రాక్టరుల దోషము. ఇంత మాత్రముచే నటుల వ్యక్తిత్వము ప్రకటితమగు ప్రదర్శనము దోషమని భావింపరాదు. మంచి కలసికట్టు తనమున్నను నాటక ప్రదర్శనమున నభినయ విశేషములతో ప్రధాన పాత్రధారుఁగు ప్రసిద్ధనటుల వ్యక్తిత్వము ప్రకటితముగానిచో నాటకము రాణింప జాలదు. నటులవ్యక్తిత్వము మరుగుపడగలదా? ప్రతిభ ప్రకాశింపక తప్పదు. కానప్రస్తుత కాలమున నౌత్సాహిక నాటకములలో నటుల వక్తిత్వ ప్రదర్శనము లేదనియు, కలసికట్టుపనియే గోచరించుననియు గర్వపడుటలో నర్థములేదు. రెండునుముఖ్యముగా కావలసినవే.

కాని సర్కసులో కోఁతి బైస్కిలును త్రొక్కు వినోదమును చూచుటకై ప్రేక్షకులు పోవునట్లుగ పరపురుషులతోఁ గలసి స్త్రీ నాటకరంగమున ప్రవర్తించు వినోదమునుజూచుటకై గుంపులు కూడి జనులుపోవుట నాటకకళోద్ధరణము కాఁజాలదు. స్త్రీచేసిన ప్రతిచేష్టయు స్త్రీపాత్ర కుచితమైన యభినయమేయని యానటి భావించినచో నానాటకము భగ్నమైనటులే తలంచవలె. అట్టిస్వభావ స్త్రీనటులకంటె స్త్రీపాత్ర ధారణకు పురుషనటులే సహస్ర విధముల మేలు. పురుషులు స్త్రీవేషమును ధరించినపుడు కొజ్జాలవలెఁ గనిపించుదురని కొందఱునవీనులు తలంచుదురు. కాని యది యదార్థముకాదు. స్త్రీస్వభావసిద్ధముగా నుండునటుల కొందఱు ప్రతిభావంతులైన పురుషనటులు నటింపఁగల్గుట మనము చూచుచున్నాము. వారు స్త్రీవేషమును ధరించి నాటకరంగముపైకివచ్చి యభినయించు నపుడా వేషధారి పురుషుడని చెప్పినను నమ్మని స్త్రీలెందరో యుండెడివారు. అనగా వారి స్త్రీపాత్రాభినయము స్త్రీలను గూడ మెప్పించెడిది, వారి స్త్రీవేషమునుగాంచి స్త్రీలుగూడ స్త్రీస్వభావమున కుచితమైన కొన్ని వేష భాషలను హావభావ విలాసములను నేర్చుకొనెడివారనిన నతిశయోక్తికాదు. అటువంటివారు క్రిందటి తరమున కూచిపూడి భాగవతులలో వెంపటి వెంకటనారాయణయు, నాటకరంగమున ముప్పిడి జగ్గరాజును. ఈతరము వారిలోశ్రీస్థానం నరసింహారావుగారి విషయము తెలుగనివారుండరు కదా. వీరల స్త్రీవేషములను జూచియు స్త్రీవేషములనుస్త్రీలే ధరింపవలయుననెడి స్వభావవాదమునేల నింకను జేయుదురో తెలియరాదు. స్త్రీ స్వభావమును గూడ మించునట్లుండునే వీరి స్త్రీవేషాభినయములు. ఒక విధముగ పురుషుడు స్త్రీవేషము నభినయించి సామాజికులమెప్పును

పొందుట దుర్ఘట కార్యమేయగును. వేషభాషలతోఁబాటు స్త్రీలకు సహజమైన సుకుమార కంఠస్వరమును గూడ నారోపించుకొనుట పురుషులకు కష్టమేయగును. అట్టి కష్టకార్యమును సాధించుటయే యొక ప్రతిభయగును. అదయే యథార్థమైన నటన యని పించుకొనును. అందుకనే వెనుకటి తరములో సమర్థులగు వారైన కీ. శే కాశినాథుని నాగేశ్వరరావు, కోపల్లి హనుమంతరావు, టంగుటూరి ప్రకాశం గార్లు గూడ నీదుర్ఘట కావ్యమును సాధించుటలోఁ దమ యుత్సాహమును, కళాపిపాసను జూపెడివారు.

వివిధరసమయ సన్నివేశములలో నున్న పురుషపాత్రము న నయింపుటలోనే సంతృప్తికరముగలేదని కొందఱి ప్రఖ్యాత పురుషనటులను గూడ మనము విమర్శించు చున్నాము కదా. ఇంక రసవైవిధ్యముతో నొప్పు వివిధ సన్నివేశములలో స్త్రీలు ధైర్యసాహసములతో రంగస్థమున నటించుటయెంత కష్టమో యూహింపఁదగినది కానియిట్టికష్టకార్యమును కొమ్మూరిపద్మావతి, గుళ్లపల్లి విశ్వేశ్వరమ్మ మొదలైనవారు సాధించిరనుట నాటక కళాభ్యున్నతికి శుభసూచికమేకాని. తర్వాతనట్టివారు తగినంత మంది నాటకరంగమునకు దొరకుటలేదు కేవలము సాంఘిక నాటక ప్రదర్శనములలోఁ గూడ స్త్రీవేష ధారణకు స్త్రీలుదొరుకుట లేదని, 'నాట్యకళ' పత్రికలోనే వ్రాయుచున్నారు. అందుచే స్త్రీ పాత్రముతో నవసరము లేకుండునటుల ప్రస్తుత సాంఘికనాటకములను వ్రాయుచున్నారు కొందరు కవులు. స్త్రీపాత్రములేని నాటకము ప్రజారంజకముగాదనెడి యభిప్రాయము పూర్వమే యుండి, ముద్రారాక్షసాది నాటకములు నిరాదరణతోఁ జూడఁబడగ నింక ప్రస్తుతకాలమున స్త్రీలను నాటక రంగమున జూడవలెననెడి భావముగల నవీన ప్రేక్షకులు స్త్రీపాత్రహీనమైన నాటకము నెట్లాదరించగలరు. ఇందుచేఁగూడ నాంధ్రనాటక కళ క్షీణించుటకుఁ గారణమయ్యెనని తలపవలసి వచ్చుచున్నది.

కళాశాలలోని స్త్రీవిద్యార్థులను నాటకమున స్త్రీవేషదారులుగా ప్రోత్సహించవలెనని కొందఱు సలహ నిచ్చుచున్నారు. ఇది స్త్రీల యిచ్ఛపైనను వారి తండ్రుల యాజ్ఞలమీద నాధారపడవలసియున్నది. విశ్వవిద్యాలయములలో నాటక కళను గూడ విద్యా ప్రణాళికగా నంగీకరించి, దానికి గూడ పట్టప్రదానము చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. అదియే సిద్ధించినచో వారి కోరికలు నెరవేరవచ్చును. కాని ఆ శుభకాలము వరకు వేచియుండ వలసినదే.

అసలు కళలే కృత్రిమములు. వానిలో స్వభావ సిద్ధముగా నుండుట యనునది యేమి? ప్రతి కళయు కొంత సూచించి, మిగిలినది మన భావనకు వదలివేయును. కాని కళల ప్రయోజనము ప్రతి సూక్ష్మాతి సూక్ష్మవిషయమును మనసున కంటించు నటులఁ జేయుటకాదు. అవి యెప్పుడును కళలలో సాధ్యము కాకపోవుటయే కాక, యనవసరము గూడ. అంత స్వభావసిద్ధముగా నుండవలయునని యాశించినచో, రాజు వేషమునకు ప్రత్యక్షముగా రాజునే తీసుకొని రావలయును. యుద్ధముచేయుటకు వాడికత్తులను కటారులనుపయోగించి హత్యలఁజేయవలసి యుండును వీనివలనఁగలుగు రసాభాసలు వేరుగ చెప్పనవసరము లేకదుదా. కాన కళలలో స్వభావవాదమును తెగపెంచుకొనుట విరసముగా పరిణమించును. అందుచేతనే 'యుద్ధస్యకథారమ్యా' అనినారే కాని యుద్ధము రమ్యమనలేదు. స్థానం నరసింహారావు, ముప్పిడి జగ్గరాజుగార్లతో సమానముగ గాని. లేక వారిని మించునట్లుగ గాని స్త్రీలు నాటక రంగమున స్త్రీపాత్రములను నిర్వహించినచో, నది ప్రశంసాపాత్రమై నాటక కళోద్ధరణము జరిగినట్లగును. పాశ్చాత్య దేశములలో నట్లు జరిగినది. కాని మనదేశంలో నింక నాస్థితి రాలేదు. మనమన్నివిధములైన ప్రయోగములను (experiments) చేసి చూచితిమి. వానివలన అనుకొనిన ఫలితములు సాధింపఁగలిగినచో నవి యవలంబింపదగినవే. కాని తగినఫలితములు సిద్ధింపనపుడు వానిని పరిహరించుటలో దోషమేమి

4) మఱియొక ముఖ్యవిషయము నాటక కళాభివృద్ధికి ప్రతిబంధకముగా నున్నది కొన్ని నాటకములు ప్రయోగార్హములుగా లేవనియు, ప్రయోగార్హమైన నాటకమును వ్రాయగల్గుట నటులకును ప్రయోగానుభవము గలవారికే బాగుగ తెలియుననియు, కాన నటులు గాని వారు వ్రాసిన నాటకము ప్రయోగార్హములు గావని యొక వదంతి ప్రబలముగా నున్నది. ఈ విషయము సంపూర్ణముగ సత్యమైనది కాకపోవుటచే, కొంతవఱకంగీకరించినను, దానివలన గూడఁగొన్ని ప్రతిబంధకములు లేకపోలేదు. కాన నావాదమును సంస్కరించుటమేలు కొంత మార్పు చేసి. నాటకము ప్రయోగార్హముగానుండవలె ననుటలో నభిప్రాయ భేదము లేదు. కానిదానికేయే పద్ధతులవలంబింప వలయునో మాత్ర మెవరును స్పష్టముగా వివరించలేదు. కేవలము నటులచే రచింపఁబడిన నాటకములు ప్రయోగార్హములుగా నుండినను, నవి కావ్య గౌరవమును సంపాదించుకొనలేవు. నాటకములు దృశ్య కావ్యములని మఱచి పోగూడదు. కావ్య గౌరవము నిలుచునట్లుగా నాటకములను రచింపఁగల్గు వారు పండిత కవులు మాత్రమే. కవులు నటులు కావచ్చు కాని, నటులు కవులగుట దుర్లభము. ఏలన దానికి విశేష విద్యా పాటవముగూడ

కవులయును. కవి నటుఁడై నాటకమును రచించు చోమందిచే. ఇట్టివారు షేక్స్పియరు మాత్రమే కాక, తెలుగున బలిజేపల్లి లక్ష్మీకాంతం గారి వంటివారు గూడ కలరు. కాని సంస్కృత కవి యగు కాళిదాసు నటుడని యెక్కడను వదంతి లేదు అయినను అతని నాటకములు ప్రయోగార్హములు గావని యెవరైన ననఁ గలరా? అట్లే భాసుడు, హర్షుడు మొదలైన సంస్కృత నాటక కర్తలు. అగుచో నానాంధ్రీకరణ నాటకము లెంతమంది ప్రస్తుత మాడు చున్నారు? ఒక కాలమున విశేషముగా నాదరింపఁబడి యనేక మార్లు ప్రదర్శింపఁ బడిన నాటకములు నేడు ప్రదర్శనార్హములు గావని యనుట గూడ నుచితముగ లేదు కాలము మారుట చేత రుచులు మారవచ్చును కాని. ప్రయోగార్హత మారదు కదా. కాన వాని ప్రదర్శించి నాటక కళ నేల నిలువ బెట్టరాదు? అవి ప్రాత నాటకము లందురా? నాటకములు ప్రాతవైనను ప్రేక్షకులు తరతరమునకు మారుచుందురు. మఱియు నానాటకములు త్రికాలాబాధితములైన విశ్వ జనీనములు. ప్రేక్షకులు వివిధాభి రుచులు గలవారు. కాన వారి రుచులను గూడ గౌరవింప వలసిన బాధ్యత నాటక సమాజముల వారికిఁ గలదు గత కాలములోఁ గూడ నాటకములు పౌరాణికములు, చారిత్రికములు, సాంఘికములు శృంగార రస ప్రధానములు, వీరరస ప్రధానములు, భక్తి ప్రధానములు, విషాదాంతములు మొదలైన వివిధాభి రుచులను సంతృప్తి పఱచునవి ప్రదర్శింపఁ బడెడివి. ప్రతి కాలములోఁ గూడ ప్రజలు వివిధాభి రుచులు గల్గి యుందురు. కాన, కేవలము సాంఘిక వచన నాటకములు సులభముగ ప్రదర్శింప వచ్చునని వానిని మాత్రమాడినచో నాటక కళ యభివృద్ధి చెందదు. నవీన నాటకములు ప్రదర్శనార్హములు గావను భయమున్నచో నటులు చక్కని సలహాల నిచ్చి కవులచే ప్రదర్శనార్హతయు, కావ్య గౌరవము గూడ గల్గునట్లు వ్రాయించ వచ్చును కాని, కవులను నిష్కారణముగ నిందించుట భావ్యము కాదు. ఈ పద్ధతి వివిధ దేశములలో గూడ నవలంబింప బడునదే కాని నూత్నమైనది కాదు.

ఆంధ్ర నాటక రంగ ప్రారంభ దశలో నటుల స్థితి గతులు నేఁటి కాలమువలెఁ గాక, బహు ప్రమాదకరముగా నుండెడివి ఆ కాలమున నటులకు విద్యా వివాహములు నష్టమై, సంఘమున నేమాత్రము గౌరవములేక, పరువు మర్యాదలు లోపించి వారు హీనముగఁ జూడఁ బడెడివారు. నటవిట గాయకుల పాంక్తేయులుగా పరిగణింప బడెడివారు. వారు ధనమును రహస్యముగా నెక్కడనుండియో సేకరించి, తలి దండ్రులకుఁ దెలియకుండ నాటక సమాజములలోఁ జేరి, స్వార్థ త్యాగము చేసి, నాటక కళా పిపాసను తీర్చు కొనుటకై జీత బత్తెము లేక నాటక కళ నారాధించెడి వారు మఱియు నాటక సమాజ యజమానుని యందు భక్తి శ్రద్ధలు, వినయ విధేయతలును గలిగి, సమాజపు కట్టుబాట్లకు, నియమములకును బద్ధులై యుండి నటాగ్రేసరులనుండి నభినయము నభ్యసించెడివారే కాని యిప్పటి వారివలె నిర్లక్ష్యమును, స్వాతంత్ర్యము నెప్పుడును జూపెడు వారు కారు. వారు కళారాధకులమని యిప్పటి వారివలె గర్వపడెడు వారు కారు తల్లి తండ్రులును బంధువులును కోపపడుదు రనియు, సంఘములో గౌరవము తక్కువగునను భయముతోఁ గూడ వారప్పుడు దమ నామములను కర పత్రములలో ప్రచురించెడి వారు కారు. ఇట్టి నిరుత్సాహ పరిస్థితుల లోనే కొందరు నాటకకళా తపస్వులు ఈవెన లక్ష్మణ స్వామి, ముంజులూరి కృష్ణారావు వంటి వారు బయలు దేరినారు. వారు విశేష విద్యావంతులు గూడ కారు. చాలమంది ప్లీడరు గుమాస్తాలు, కోర్టు, ఆఫీసు గుమాస్తాలు మాత్రమేయై యుండిరి. ఉదా :— హరిప్రసాదరావు మొదలైన వారు. కాని వీరు విశేష విద్యావంతుల కంటె నెక్కువ రస పిపాసయు, రస గ్రహణ శక్తియు, నౌచిత్య వివేకమును గల్గి యుండిరి. అనేకులు విశేష విద్యా విహీనులై, నిరుద్యోగులై, యాస్తి పాస్తులనుగూడ ధారవోసి నాటకకళ నారాధించిరి. ఈ స్థితి నటులకేకాక, నాటక కళా పోషకులకుఁగూడ తప్పలేదు. కళా సరస్వతి, లక్ష్మీదేవినిఁ జేరనీయదు కాఁబోలు. గున్నేశ్వరరావు, మైలవరం రాజాగారు, మోతే నారాయణరావు జమీందారులకే యాస్థితి తప్పలేదు. బళ్లారి రాఘవాచారి, గోవిందరాజుల సుబ్బారావుగార్లవంటి వారు నూటికి కోటికి నొకరు మాత్రమే.

నటుల యార్థిక స్థితితోఁబాటు సాంఘిక పరిస్థితి గున్నేశ్వర రావుగారి నాటక కంపెనీతోఁ గొంచెము మెరుగైనది నటులకుఁ జీతము లేర్పరుచుటచే వారికుత్సాహము గల్గుటయు, వారు నాటక కళారాధకులను గౌరవాదరములు సంఘమున క్రమముగా బయలు దేరినవి. ప్రజలలో నాటక కళాభినందన శక్తియు బయలు దేరినది. అంతకుఁ బూర్వము నాటక ప్రదర్శనము వినోదమునకు మాత్రమే గాఁగ, నప్పటి నుండియు కళగా నభినందింప బడి, యభినయ మొక ప్రతిభను వ్యక్తీకరించు కళగా విద్యావంతులచే నామోదింపఁ బడినది. ఆ స్థితి మైలవరము, మోతేవారి నాటక సమాజ ప్రదర్శనముల వలన పరమావధికి వచ్చినది. ఇంతటితో ఆంధ్ర నాటక కళా సరస్వతికి, దృష్టి దోషము తగిలినది. సంగీత మాధుర్యము

వలన నేమి, చెమికీ దుస్తుల వలన నేమి, రంగు రంగుల తెరల వలన నైన నేమి, నటుల యభినయ విశేషముల నైన నేమి జన సామాన్యమున నాటక కళాభిరుచిని గల్గించి యభివృద్ధి చెందినది. ఆబాల గోపాలము దీని మహాత్మ్యమును గుర్తించి గౌరవించినారు. ఉద్యోగస్థులు, విద్యావంతులు, అధికారులు నటుల నభినందించి గౌరవింపసాగిరి.

ఇప్పుడు నటుఁడనగా కళాకారుడు విద్యా సంస్కారములు, సంస్కృతిగల విద్యా వంతుడుగా పరిగణింప బడుచున్నాడు. వానికి సంఘమున మంచి గౌరవ పరపత్తులు బయలుదేరినవి. సినిమాటాకీ వ్యాపారములకు నటుడు సహాయకారుఁడై కళాపోషణము చేసినాడు. ఇందుచే నటీ నటులకు సాంఘికార్థిక స్థోమత హెచ్చినది. అన్ని లలితల కంటె నాటక కళకు ప్రోత్సాహ మెక్కువైనది. నట వృత్తి గౌరవోద్యోగముగఁ పరిగణింపఁ బడుటయే కాక, లాభదాయక మైన వృత్తిగాఁ గూడ పరిణమించినది. నటులకు సంఘము బిరుద ప్రదానమును, నార్థిక బహుమానములు గూడ నొసర్చి గౌరవించి నది. స్వరాజ్యము వచ్చిన తర్వాత రాజ్య పరిపాలకులు గూడ నదేవిధముగ గౌరవించి నాటక కళను ప్రత్యేకముగ ప్రోత్సహించు టకై గొప్ప సంస్థనుగూడ స్థాపించి, ప్రతి సంవత్సరమును గొంత ధనమును కేటాయించు చున్నది. నటులకు రేడియోల మూలకముగ గూడ గొప్ప గౌరవ లాభములు చేకూరుచున్నవి. కాన నట వృత్తి యింకే వృత్తికి తీసిపోవుట లేదిప్పుడు. దీని వలన నట వృత్తికి నాటక కళకు నెట్టి విజయము కల్గినదో స్పష్టమగుచున్నది.

ఇట్టి యత్యున్నత స్థితిని పొందిన నాటక కళ నేడు క్షీణించి పోవుచున్నదనఁగా. దానిలోని లోపములను నాత్మశుద్ధితో గ్రహించి తప్పులను దిద్దుకొనవలెనహంభావమును చంపుకొని లేకపోయినచో ప్రయోజనము లేదు. నాటక కళాపతనమునకు సినిమా కళకారణ మని కొందఱు భావించుచున్నారు. నాటకశాలలన్నియు సినిమా శాలలగుటయే దీనికి ముఖ్య కారణము. సినిమా సస్థ వ్యాపార కళ. నాటకకళ లలిత కళ. సినిమా కళ పామరులకు, వినోదపరు లకు మాత్రమే పనికి వచ్చును. నాటక కళ రసపిపాసువులకు, కళాభినందనపరులకు విగీశత వేద్యానందమును గూర్చుటకు మాత్రమే వినియోగించును. ఇది స్వల్పసంఖ్యాకులను మాత్రమే యాకర్షించును సినిమాకళ విశేష జనసామాన్యమునందఱిని నాక ర్షించును. సినిమాకళ లక్ష్మీ ప్రసాదముతోఁగూడినది. నాటకకళ సరస్వతీ ప్రసాదము వలన గలుగునది. కాన సినిమాకళతోఁ నాటకకళకు పోటీ లేదు. సినిమా నటులను పామరులగు జన సామాన్యము మాత్రమే మెచ్చుకొనఁగలరు. నాటకకళను పండి తులు మాత్రమే యభినందింపఁగలరు. నాటకనటులు నవనవోన్మే షశాలురు. సినిమా నటులు యాంత్రికపు బొమ్మలు. వారు దర్శ కులకుదాసులు. నాటకనటులు స్వతంత్ర ప్రతిభాశాలురు. సినిమా కళ చౌకబారుకళ. నాటకమమూల్యమైన కళ సినిమా కళ యాంత్రిక మూలమున స్వాభావికతను ప్రదర్శింపజూచుచే దాని లక్ష్యము. ఇంక నాటకకళ నటుల ప్రతిభమూలమున నాదర్శమును వ్యక్తీ కరించుటయే దాని పరమ లక్ష్యము నాటకకళ యదాత్తమైనది. సినిమా కళ క్షుద్రమైనది. నాటకకళ నియమసహితమైనది. సినిమా కళ నియమరహితమైనది సినిమాశాలలు లక్ష్మీదేవ్యాలయములు. నాటకశాలలు సరస్వతీ దేవ్యాలయములు. కాన సినిమా కళకును, నాటక కళకును పోలిక కాని పోటీ కాని యేమి? సినిమా కళ ప్రజా స్వామ్యమువంటిది. నాటకకళ సార్వభౌమత్వము వంటిది. కాన సినిమా కళ పోటీ వలన నాటకకళ దెబ్బతిని నదనుట భ్రాంతి.

నాటక కళ క్షీణించుటకు ముఖ్య కారణములలో మొదటిది నటు దుష్ప్రవర్తనము. రెండవది నాటక కళను దుర్వినియోగము చేయుట. ప్రారంభమున నటులు స్వార్థత్యాగులై, నిరహంభావులై, నాటక కళా సరస్వతి నారాధించినారు. వారు నాటకశాంగము లను భక్తి శ్రద్ధలతో గౌరవించినారు. కాన స్వల్పలోపములున్నను వారికి నాటక కళ సమగ్ర రూపము గోచరించినది. అందుచే వారు ధన్యులై ప్రేక్షకులను ధన్యులను చేసినారు కాని వారు క్రమముగా స్వార్థపరులై, యహంకారప్రమత్తులై, నాటక కళా సరస్వతిని ధిక్కరించి యాత్మగౌరవమును పరిత్యజించి, తమ యాదర్శము లను నాటక కళాదర్శములను గూడ గోలుపోయినారు. నాటక కళను దుర్వినియోగపఱచి బజారు కళగా చేసి, పామరులగు జన సామాన్యము యొక్క యభిరుచులను గౌరవించి, యుద్[illegible]భిరుచు లను జారవిడచినారు, ఇందుచే ఆంధ్ర నాటక కళా సరస్వతి, విసిగి వేసారి, కోపగించుకొని యాంధ్రుల పరిత్యజించినది. ఇంత మాత్రముచేత నవపత్యము చేసి ప్రాణము మీదికిఁ దెచ్చికొనిన రోగివలె దిగులుపడి విలపించనక్కర లేదు. ఆంధ్రుల నాటక కళానుభవము విశాలమై వైవిధ్యముతోఁ గూడికొనినది. మన మనేక విధములైన నూతన ప్రయోగములను చేసి చూచినాము నాటకకళయందు. కొన్ని సత్ఫలితములిచ్చినవి. మరి కొన్ని దుష్ఫ లితముల నొసంగినవి. కాన మన నాటక కళానుభవములలో మంచిచెడ్డలను పరిశీలించి మంచిని మాత్రము గ్రహించి చెడును పరిత్యజించినచో మన నాటక కళ తిరిగి నుచ్చ దశకు రాఁగలదు. నాటక కళా పరిషద్వార్షికోత్సవములలో నధ్యక్షులు ప్రతి సంవత్స

రము మంచి యుపదేశములనే చేసి యుండిరి. రాఁబోవు నుపద్రవములను సూచించుచు జోతిష్యమును చెప్పుచునే యుండిరి కాని మనకు నచ్చని వానిని పరిత్యజించి నచ్చిన వానిని మాత్రమే యంగీకరించి యాచరించుటచేనీయుపద్రవము వచ్చినది. 'హితం మనోహారిచ దుర్లభంవచః' అని కదా మన పెద్దలు చెప్పినది. కాని మనోహరమైన దానిని గ్రహించినాము హితమైన దానిని వదిలినాము ఆంధ్ర నాటకకళా పరిషత్ రజితోత్సవ సంచికలోఁ గూడఁదమకు నచ్చిననటులైన యధ్యక్షుల యుపన్యాసములనే ముద్రింపించిరి కాని కవి పండితాధ్యక్షుల యుపన్యాసములను మాత్రము చేర్చలేదు రెండును గూడఁ జేర్చియుండినచో బాగోగులు బాగుగ తెలిసియుండెడివి

మన నాటక కళా ప్రయోగములలో ననేక దోషములను గూడఁజేసినాము. మన యభినయకళలో పాత్రములు 'నిష్క్రమించు చున్నాడు' అను పాఠమును గూడ నప్పజెప్పునట్టి దోషములను గూడ నొకప్పుడు చేసి, రాజపాత్ర ధారికొఱకు గొనిరాఁబడిన చెముకి దుస్తులను సేవక పాత్రధారి గ్రహించి, వానిని ధరించి త్వరగా రంగమీఁదికిఁబోవ, రాజపాత్ర ధారి సామాన్య దుస్తులను ధరించి రంగముపైకి వచ్చి యాసేవకుని కొరకొర చూచి యభినయించిన ముచ్చటలు గూడ ననుభవించినాము వానితోఁబాటు సాత్వికాభినయమున నిరుపమానముగనటించి 'నభూతోన భవిష్యతి' యనుపేరు ప్రతిష్ఠలను సంపాదించిపెట్టిన ఈవెన లక్ష్మణస్వామి. బళ్లారి రఘువాచార్యులవంటి నటులను గూడ సంపాదించుకొనినాము. కాన మనము నిరుత్సాహము చెందవలసిన పనిలేదు కాని గర్వముచెందక గుణపాఠము నేర్చుకొని. మంచిచెడులను పర్యాలోచనచేసిగతించిన మననాటక కళలోఁగల మంచిని, నితరులనాటకకళలలోఁగల మంచిని గూడ పరిశీలించి మన సంప్రదాయములకు, దేశీయాచారములకు, సాంఘికాభిరుచులకు భిన్నముగ నుండకుండునట్లు, విశేషముగ ఖర్చులు నష్టములు లేకుండునట్లుగను, ప్రయోజనము లాభముగ నుండునట్లుగను జాగ్రత్తగ విచారించి మన నాటకకళను పునః పరిశీలనతో ప్రారంభించినచో జయప్రదముగనే యుండ[illegible]దు. నాటక ప్రదర్శనమునకుశాలలు లేవని దిగులుచెందనక్కరలేదు మొదటి యౌత్సాహిక నాటక సమాజములు దమ ప్రదర్శనములను గావించిన రీతిగయే పూరిపాకలలోనో యేస్వచ్ఛమైన తెలుపు, నలుపు, నెరుపు మొదలైన రంగుతెరల తోడనో స్వల్పధరలతో, సీఘొకసింగులు, సెట్టులు మొదలైన వానిని గూడ పరిత్యజించి, తక్కువ ధరలకు లభించు దుస్తులతో, చారిత్రక, పౌరాణిక, సాంఘికాది వివిధ నాటకములను సంగీత, వచన, మిశ్రనాటకములనన్నింటిని గూడ మరల వివేక దృష్టితో ప్రదర్శించి ప్రజల వివిధాభిరుచులను సంతృప్తి పరచుచు, జనసామాన్యమును ప్రీతి పరచుటకై యభినయాదర్శములను వారి నీచాభిరుచులపాలు చేయక, మున్నత కళా దర్శాభిరుచులతో, నాటకకళా విమర్శకుల సలహాలను గ్రహించుచు నాటక కళా రాధన చేయుచో తిరిగి యాంధ్రనాటక కళ గౌరవస్థానము నాక్రమించుకొనగలదు.

సినిమా కళ వలన నాటక కళ దెబ్బతినునని భయపడనక్కరలేదు. దానితో నాటక కళకు పోటీలేదు నిర్భర గంభీరమైన నాటక కళానందమునకుఁగాక కేవలము పామరాభిరుచికల జనసామాన్యము సినిమా కళనే యాశ్రయించి తమ వినోదమును దీర్చుకొందురు కాక. వారు నాటక కళ నాదరింపక పోవుటయే మేలు. వారిని సంతృప్తిపఱచుటకై కదా పూర్వము నాటక కళాదర్శముల వారి యభిరుచులకుందింపి యగౌరవము పాలుచేసితిమి. ఉదాత్తాశయములతో రసజ్ఞులను, కళాభిజ్ఞులను పండితవిమర్శకులను మాత్రము సంతృప్తి పెట్టి వారినేయానందింపఁజేసి. పూర్వము విజయనగరములో ఆనంద గజపతి మహారాజులుంగారు చేసిన విధముగ నున్నతాదర్శములతో నాటకకళా సరస్వతిని నారాధించినచో. నాటక కళకు తగిన గౌరవము గల్గి యితర దేశములందు గూడ పేరు గాంచి వర్ధిల్ల గలదు. ఇట్టి ప్రయత్నమునకు రాజ్య పరిపాలకులు చేయుసహాయము సప్రయోజనమగును. ఉన్నతాదర్శములతో నాటక ప్రదర్శనములు సాగునాడు. జన సామాన్యము క్రమక్రమముగా యథార్థమైన నాటకకళ యనగనేమోగ్రహింపఁగల్గి, చక్కని నాటక కళాభిరుచి నలవరచుకొని క్రమశిక్షణలో పెరుగఁగలరు ఇందులకుగా నటులు ముఖ్యముగా దమ యభినయ విశేషములలో క్రమశిక్షణ పొందుటతోఁబాటు, లలితకళలనఁగానేమో వాని యాదర్శప్రయోజనము లేవో, వానిలో నాటక కళకుఁగల స్థానమేదో, యితర లలిత కళలకు నాటకముతో గలసంబంధ మెట్టిదో యితర దేశములలో, భాషలలో ప్రాచీనకాలము నుండి నాటకకళ యెట్లుపుట్టి పెరిగి, యభివృద్ధి చెందినదో మొదలైన విషయములతోఁ గూడి నాటక కళచరిత్రతోఁగూడ పరిచయమును సంపాదించుకొని వివేకముతోడను ప్రపంచ జ్ఞానముతోడను మెలగవలసిన యవసరముండును. పాత్రాభినయమునకీ క్రిందరీతిగ మార్కులనుబట్టి ప్రాధాన్యమీయఁదగును:

(1) సాత్వికాభినయమునకు 40 మార్కులు; (2) వాచికాభినయమునకు 25 మార్కులు (3) ఆహార్యమునకు 20 మార్కులు (4) ఆంగికాభినయమునకు 15 మార్కులును మొత్తము 100 మార్కులు తర్వాత నాటక సమాజము మొత్తముమీద ప్రదర్శనములో (1) రంగపరికరముల కూర్పుకు 25 మార్కులు (2) పరస్పర సహకారముతో నభినయించుటకు 25 మార్కులు (3) చిల్లర పాత్రలకు 25 మార్కులు (4) త్వరితముగ ప్రదర్శనము సాగించుటకు 25 మార్కులు, మొత్తము 100 మార్కును నొసఁగ వలయును.

నా టిక :

# "గట్టున పెట్టిన ఒట్టు"

శ్రీ ద్వివేదుల సోమనాథ శాస్త్రి

## పాత్రలు:

చంద్రం

| | | |
|---|---|---|
| కమల | — | చంద్రం భార్య |
| లక్ష్మమ్మ | — | చంద్రం తల్లి |
| కనకమ్మ | — | పొరుగింటి ఆమె |

గోపాలం, రామేశం మొ॥ స్నేహితులు

[ఒక మధ్యతరగతి కుటుంబీకుని యిల్లు- తెల తెల వారుతూండగా పిల్లలులేచి ఏడుస్తూంటారు. ఆ గొడవకి ఇంట్లో వారందరూ లేచి పోతారు.]

చంద్రం : (నిద్రలేస్తూ చిరాకుతో) మొదలెట్టేరూ? అబ్బబ్బ! లేచీ లేవకుండానే ప్రారంభిస్తారు! వీళ్ళ ఏడుపులే, మేలు కొలుపులు. మనకి! ఇస్! ఒక్క నిముషం నిశ్శబ్దంగా వుండరు కదా!

కమల : బావుంది ఎందుకలా చికాకు పడతారు! పిల్లలున్న ఇల్లు ఎలా వుంటుంది? పెళ్ళాం కావాలి గాని పిల్లలు మాత్రం ఒద్దు పాపం! అవ్వా కావాలి బువ్వా కావాలి అంటే ఎలా? (అని నవ్వుతుంది)

చంద్రం : అయిందేదో అయింది గాని, ఇవాళనుండి జాగ్రతగా వుండాలి? మరీ పిల్లలతో భరించ లేము బాబూ! ఉన్నవాళ్లు చాలు!

కమల : (నవ్వుతూ) ఇదేం కొత్తా! ఏదో సామెత చెప్పినట్టు....

చంద్రం : అరె! ఎందుకా ఎగతాళి! నేనంటున్నది అర్థం చేసు కోవేం?

కమల : నేనేం ఎగతాళి చేశాను? మీరన్నది కొత్తా? ఇంకా ఏం అర్థం చేసుకోవాలి? ఆచరణలో పెట్టలేక పోయాక రోజూ ఎందుకనుకుంటూ వుండడం? నాకిష్టం లేనట్టు మాటాడతా రేమండి?

చంద్రం : రోజూ వేరు ఇవాళ వేరు కమలా! నిజం చెబుతున్నా. మనం నిగ్రహించుకోవాలి?

కమల : సరేలెండి! జరిగిందేదో జరిగిపోయినది, యిక యీమాట మీదనే వుంటానని_నా జోలికి రానని ఒట్టేయండి!

చంద్రం : ఇదుగో సరా!...

(పిల్లలు మళ్ళీ ఏడుస్తూండగా చంద్రం తల్లి లక్ష్మి

(ప్రవేశించి—)

లక్ష్మి : (విసుగ్గా) అమ్మమ్మా?... ఏడిచేరంటే వదలరు తల్లీ! నీకూ...నీ...పిల్లలకి – ఒక దండం!... నువ్వే ఊరుకో బెట్టుగో—

(పిల్లల ఏడుపు ఎక్కువ అవుతుంది)

కమల : (కోపంతో) ఎరీ! వెధవలు! ఏంవర్రా! ప్రొద్దున్నే...ఏం ముంచుకొచ్చింది?...ఎందుకలా ఏడుస్తారు? (అని కొడు తుంది..చప్పుడు)

లక్ష్మి : (అడ్డువస్తూ) ఆఁ ఆ! నీకేం మతుందా లేదా?...అలా పిల్లలిని బాదుకుంటారే! ఏదో అల్లరి చేశారని!

కమల : (రోషంతో) అదుగో! మళ్ళీ మీరు ఎందుకొస్తారు! పిల్లలేడిస్తే ఆడించేవాళ్ళు లేరు గాని అందరూ నన్నే అనడానికి వస్తారు! ఊరుకోబెట్టలేరు గాని, ఎందుకని అడిగి కొడితే చెయ్యి వెయ్యనివ్వరు! వాళ్ళు ఆడుకుంటూ, నవ్వుతూంటేనే, చేరదీసి, ఆడిస్తారు : గాని ఏడుస్తూంటే, నామీద వదిలేస్తారు! అప్పుడక్కర్లేదు మనవలు! నే నేదోలా సముదాయించుకుంటాను మధ్య మీరు రాకండి!

లక్ష్మి : చాల్లే... నాకలా కొట్టి, నోరు మూయడం చేతకాదు! వాళ్ళ వొంటిమీద దెబ్బ పడితే నేనొప్పుగోను!... మహా! ఊరుకో బెట్టేవులే!...

( నాయనమ్మా! అని పిల్లలు ఏడుస్తూ దగ్గరికి రాగా )... రండి బాబూ!... నే చెబుతే.. వినరు.. అమ్మ పెట్టేవి రెండూ కావాలి మీకు...

(అని అంటుండగా పొరుగింటి కనకమ్మగారు వస్తుంది).

కనకమ్మ : ఏంవిటి లక్ష్మమ్మా! తెల్లవారగానే ఆ గోల!

లక్ష్మి : చూడండి– కనకమ్మగారూ!, చంటి పిల్లలు– ఏదో ఏడు స్తూంటే– ఎలాకొట్టొడుతూందో! అలా అన్నానని! నేనెప్పుడూ వాళ్ల ఆడుతున్నప్పుడే చేరదీస్తానని, ఏడుస్తు న్నప్పుడు తీయనని నానా మాటలు అంటూంది! అయినా పెద్దదిక్కు వున్నాను కాబట్టి అలా అంటూంది గాని... లేకపోతే– తెలిసి వచ్చును.

కనకమ్మ : బాగానే వుంది! తప్పు కదటమ్మా కమలా? పిల్లలని లాలించి ఊరుకోబెట్టు కోవాలి గాని, కొడితే మొండికెత్తి పోరూ?

కమల : అనడానికేముంది పిన్నిగారూ? తనవరకూ వస్తేనే గాని తెలీదు.

చంద్రం : ఇస్! ఇంక ఆగండి! అందికే నేనన్నాను! యిక మనకి ముగ్గురు పిల్లలూ చాలు! వెళ్ళి నేనో, ఇదో, ఆపరేషను చేయించు కుంటాం అంటే వింటేనా?

లక్ష్మి : చాల్లేరా! చంద్రం! ఎవరయినా వింటే నవ్విపోతారు? ఏమండీ కనకమ్మగారూ! మీరే చెప్పండి! ఏం మహా ఎక్కువయి పోయారని? కుచేల సంతానం అయినట్టు అలాగంటాడు! చక్కా పిల్లా పాప వుంటేనే యింటికి ఆనందం. దీపం లేని యిల్లూ, పిల్లలు లేని కొంపా ఒక్కటే– మా తండ్రి గారికి పదహారుగురు సంతానం! ఏంవిటి? తక్కువ వచ్చింది? హాయిగా! చేతికీ, కాలికీ పిల్లందరూ అంది కూతుళ్లూ, కోడళ్లూ మనుమలు, ముని మలుమలనీ, ఎత్తి హాయిగా వెళ్ళిపోయారు!

కనకమ్మ : కాదటమ్మా మరి! మనవాళ్లు పూరికే అలాటివన్నీ చెయ్యలేక వూరుకున్నారా? అదేం మన చేతుల్లో వుందా?

చంద్రం : అమ్మా! ఆరోజులు వేరు– యీ రోజుల్లో పరిస్థితులు వేరు. ఒక్క మనిషికే చాలని ఈ జీతం రాళ్ళతో పిల్లలెక్కువవుతున్న కొద్దీ ఎలా గడుస్తుంది? వాళ్ళని పెంచడం ఎలాగ? విద్యా బుద్ధులు చెప్పించగలమా?... యింక ఆడపిల్ల లున్నారంటే యీ రోజుల్లో వేలకు వేలు కట్నాలు పోస్తేనే గాని పెళ్ళిళ్ళు జరగడం లేదే! యివన్నీ ఎలా జరుగుతాయి? మనకేం ఆస్థిపాస్తులున్నయా? మడులూ మాన్యాలూ వున్నాయా? లేదూ గొప్ప ఉద్యోగ మయినా ఎడిచిందా?... ఏది చూసుకుని–పిల్లలిని కని– ప్రపంచం మీద అందరికీ వున్నారు మనకీ వున్నారని– నలుగురుతో నారాయణా అన్నట్టు వదిలెస్తాం? వాళ్ళు బాగుపడి, వాళ్ళ కాళ్ళమీద వాళ్లు నిలబడేట్టు చెయ్యాలా? పనికిరాని పది మంది పిల్లలకంటే, పేరు తెచ్చేవాడు ఒక్కడయితే చాలదా?

లక్ష్మి : ఏమిటో నాయనా? ఏమయినా అనేసరికి ఓ గ్రంథం వల్లిస్తావు!

కనకమ్మ : ఆలోచించకుండా ఏ పనీ చెయ్యకూడదు నాయనా... లోకంమీద ఎన్నోరకాలుగా వింటున్నాం–అనకూడదుగాని– ఆ మధ్య మా దగ్గిర బంధువే ఒకాయన–యిలాగే నలుగురు పిల్లల తర్వాత ఆపరేషను చేయించుకున్నాడట! మరి కొన్నాళ్ల పోయాక వాడి భార్య నెల తప్పిందట! ఖర్మ! యింక అడక్కు! నాయనా? అతడు ఆ యిల్లాలు మీద

అనుమానంతో—విడాకులిచ్చేస్తానంటూ నానా హంగామా చేశేదట. ఆఖరికి అందరూ డాక్టరు దగ్గిరికి తీసుకువెళ్లి మళ్లీ పరీక్ష చేయిస్తే— ఆ ఆపరేషను బాగా జరగలేదని చెప్పేరట. అప్పుడెలాగో పూరుకున్నాడు — విన్నావా? ఇలా లేనిపోని అనుమానాలు పుట్టుగొస్తాయి...నిక్షేపంలాటి సంసారంలో చికాకులు వస్తాయి నారు పోసిన వాడు నీరు పొయ్యడా ఏమిటి? దేముడు చేసిన దానికి వ్యతిరేకంగా చేస్తామంటే మంచిదా నాయనా?

క్ష్మి : అదలా వుంచు కనకమ్మా! ఎవరో యిలాగే ముగ్గురు పిల్లల మీద, ఆపరేషను చేయించు కున్నారట! తర్వాత ఏడాది పట్టుమని తిరక్కుండానే శాపం పెట్టినట్టు ఆ ముగ్గురూ చచ్చి పూరుకున్నారట! చూశావా! వాళ్లకి మరి జీవితాంతం పిల్లలు పుట్టరు కదా? అందుకే కీడెంచి మేలెంచ మన్నారు! ఇలాంటి వన్నీ వింటూ కూడా మనం ఎందుకు లేనిపోనివి తెచ్చుకోడం అంటాను! ఏదో కలో, గంజో మనతోనే తాగుతారు. చెట్టు కాయ చెట్టుకి బరువా! అయినా అలాటి కూడని పనులు చేస్తే దేవుడూరుకుంటాడా?

ద్రం : అంతా వుత్తి పిచ్చి! అమ్మా! మనవాళ్లు ప్రతి విషయాన్ని, మతానికీ, దేముడికీ, సాంప్రదాయలకీ, ముడిపెట్టి, యీ స్థితికి వస్తున్నారు! శుభం కోర్రా! అంటే అపశకునం ఎందుకు పలుకు తారు?— ఉన్న పిల్లలినే రోగాలూ రొచ్చులూ రాకండా జాగ్రత్తగా, సుచిగా సుభ్రంగా, ఆరోగ్యంగా అందరూ ఓహో! అన్నట్టు పెంచుకో కూడదా? వాళ్లు ఏమయిపోతారో అనుకొనే కన్నా వాళ్లు బ్రతికి బావుంటారనే అనుకోకూడదా?—దురదృష్ట వశాత్తూ ఎక్కడో అలా జరిగితే — పుట్టిన పిల్లలందరూ పోయి గర్భశోకాన్ని అనుభవిస్తున్న వాళ్లెందరు లేరు?... ఏంవిటి నమ్మకం? జరిగేది ఎలాగూ జరక్కమానదు! అభ్యుదయం కోరేవారు అలాటివి ఆలోచించుకో కూడదు! ఈ కుటుంబ నియంత్రణ వల్ల, దంపతులకీ, పిల్లలికి, అటు దేశానికీ, అన్ని విధాలా నష్టాల కన్న లాభాలే ఎక్కువ.

క్ష్మి : ఏమిటో నాయనా?...ఇన్ని వర్ణించేవు! రోజులు మారిపోయాయి. మంచి చెబితే మీకు నచ్చుతుందా? బుద్ధిః ఖర్మాను సారిణీ అన్నారు! మీ యిష్టం, మేం ఏంచెప్పినా మీరు బాగు పడాలనే చెబుతాం గాని కిట్టకనా!

కనకమ్మ : ఏంమిటో అంతా మాయ లక్ష్మమ్మా! ఆ భగవంతుడు కూడా పిల్లలొద్దు మొర్రో! అన్న వాళ్లకి యిస్తాడు, కావాలి కావాలి అని పిల్లల కోసం—వ్రతాలూ, నోములూ, ఉపవాసాలూచేసి గుళ్లూగోపురాలూ తిరిగి—మందులూ మాకులూ తిని, కలవరించి పోతున్న వాళ్లకి యివ్వడు ..సరే కాని— లక్ష్మమ్మా...కాస్త నిప్పు పెడుదూ—ప్రొద్దెక్కి పోతూంది వెళ్లాలి!

( విరామం )

( నలుగురయిదుగురు నవ్వుతున్నట్టు—నవ్వులు )

ఒకడు : (నవ్వుతూ సగంలో)... అదుగో... చంద్రం...కూడా వచ్చేశాడు!...రావోయ్ రా...నీ మాటే అనుకుంటున్నాం.

చంద్రం : ఏమిటోయ్...ఏమిటంత కులాసాగా వున్నారు! పనీ పాటూ లేదా ఏంమిటి?

ఒకడు : ఏదీ...యిప్పుడేగా వచ్చేం!...రాగానే యిదిగో మన గోపాలం...ఏదో అంటే నవ్వుతున్నాం...ఏదో—నిన్ను అడుగు తాడట!

చంద్రం : ఏమిట్రా గోపాలం? ఏమిటి విషయం?

గోపాలం : ఏంవీ లేదురా? వాళ్లతో ఏమిటి పోనిస్తూ ఏదో ఒకటి అంటూ ఉంటేనే గాని ఉండలేరు.

చంద్రం : ఏమీ ఉండకపోతే ఎందుకంటారు?

ఒకడు : మరేం లేదోయ్! చంద్రం! సిగ్గుపడుతున్నాడు మనవాడు! నువ్వూ నీ భార్యా ఏ కుళాయి నీళ్లు త్రాగుతున్నారో చెప్పు! పాపం! గోపాలం— గోపాలం భార్యాకూడా ఆ నీళ్లు త్రాగుతారు! అప్పుడయినా పిల్లలు పుడతారేమో! (నవ్వు!)

చంద్రం : ఎందుకలా వాడని చిన్నబుచ్చుతారు? పిల్లలు వుండడం, ఒక క్వాలిఫికేషనా? లేకపోడం, తక్కువా? నన్నడిగితే నిజంగా వాడే అదృష్టవంతుడు!

ఒకడు : నీకేం నువ్వలాగే అంటావు! పిల్లల్లేని వాళ్ల నడుగు వాళ్ల బాధ!

చంద్రం : అబ్బ! బ్బ! ఎక్కడికొచ్చినా యీ పిల్లల గోలేమిట్రా యింక చాలు ఊరుకోండి బాబూ!

ఒకడు : మరేంఅనుకున్నావు? మనదేశంలో ప్రస్తుత సమస్యఅదే!

చంద్రం : అందికే మనదేశంలో గోపాలం లాటివాళ్లే అవసరం, వుండాలి— అంచేత వాడిని అభినందించడానికి బదులు, అలా

అనొద్దని అంటున్నా... ఏంవోయ్‌గోపాలం నీఅభిప్రాయం ఏవిటి?

గోపాలం : నేనేం అనను, అన్ని అభిప్రాయాలూ, మీవే: అన్ని మీరే అంటున్నారు... కానీండి విని ఆనందిస్తాను।

చంద్రం : అలావుండాలి! నేను గోపాలాన్ని వెనకేసుకొస్తాను: అయినా ఎన్నాళ్లయింది వాడికి పెళ్లయి?.. అదృష్టవంతుడు కాబట్టి, భగవంతుడు... అవకాశాన్ని వాడి కిచ్చేడు...ఏం అనుభవించినా.. యిప్పుడే కదా?... ఆ కాస్త భాగ్యం కలిగేక_ మరి అంతే... కొంతకాలం పాటు... అలా వుంటనే మంచిది., ఒక్కసారి కలిగేరంటే యింక ఆపడం మన తరం గాదు! (అందరూ నవ్వు)

ఒకడు : అబ్బ: ఏమిటోయ్ చంద్రం యివాళ దంచెస్తున్నాడు? రేపు కుటుంబ నియంత్రణం మీద బహిరంగోపన్యాసం ఏర్పాటు చేయాలి!

ఒకడు : ఎందుకోయ్ శ్రీరంగనీతులు.. అంత డబ్బాకొడుతున్నాడు వాడి నడుగు ఉత్పత్తి ఎంతో?

చంద్రం : దిగితేనేగాని లోతు తేలీదు! అనుభవిస్తున్నాను కాబట్టి చెబుతున్నాను. తప్పుచేసినవాడు, చెయ్యమని యితరులను ప్రోత్సహించి సమర్థించుకొనే కన్న, తన తప్పును, తప్పని చెప్పితేనే మంచిదని నావుద్దేశ్యం. అయితే బొత్తిగా పిల్లలు వుండకూడదని కాదు నావాదన... వుండాలి! దానికొక మితి అంటూ వుండాలి ! లేక పోతే యీ రోజుల్లో ఏ దృష్టితో చూసినా నష్టమే! స్తోమతలేక వాళ్లని పెంచలేక పోడం, వాళ్లు ఎందుకూ పనికిరాకండా వూరుమీదపడడం_, డబ్బు చాలక దరిద్రంతో పాటుపడడం_ యింక అధిక సంతానం వలన ఆ తల్లి ఆరోగ్యము పాడయి రోగాల పాలవడం_ ఏనాడయినా, హాయిగా దంపతులిద్దరూ కలిసి సినీమాకు గాని, మరెక్కడికయినా గాని, వెళ్లగలరా? వాళ్ల సేవతోనే తెల్లారి పోతుంది! చెప్పండి జీవితంలో యిదేనా సాధించ వలసింది?

ఒకడు : హియర్! హియర్; అక్షరాల నిజం;

మరొకడు : నువ్వు అలాగన్నావు గాని...అడుగో ఆరామేశాన్ని అడుగు ఏమంటాడో? ఏవండీ అపర కుచేలుడు గారూ మీరే మంటారు?

గోపాలం : అతని కేమిటోయ్; ఎనమండుగురు మగపిల్లలు; ఒక్కొక్కడికి, కనీసం రెండేసి వేలు వేసుగున్నా కిట్టి పోతుంది;

(అందరూ నవ్వు)

రామేశం : ఆఁ మొదట మదుపుపెట్టొద్దూ:... నాకన్నా ఎవళ్లయినా నయమే బాబూ: . . నేను వీధి గుమ్మంలో నిలబడి ఓసేవ్: అని పిలిస్తే ఆవిడ వంటింట్లోంచి ఓయ్: అని పలికితేచాలు. నెలతప్పిందన్నమాటే:...

(అందరూ నవ్వులు)

చంద్రం : మరయితే ఆపరేషను చేయించుకో కూడదు? ఎందు కంత గాథ?

రామేశం : నాకూ ఆ ఆలోచన లేక పోలేదు కాని నేనాడ పిల్ల కోసం ఎంత యిది అవుతున్నానో అంతా అవుతూంది., ఎప్పటి కప్పుడే. యీసారి.. ఆడపిల్లపుడితే చేయించుకుందా మనుకోడం తీరా మగ పిల్లడే కలగడం_అంచేత తిరిగి మరోఛాన్సు కోసం చూడడం అయిపోతుంది: ఏం చెయ్య మంటావు?

ఒకడు : ఆడపిల్లలెందుకండీ: వున్నవాళ్లందరూ పడుతున్న బాధలు చూడలేదా: మొగపిల్లలయితే ఒక్క చదువుకి మదుపుతో సరి యీరోజుల్లో ఆడపిల్లలకయితే_చదువులూ చెప్పించాలి: కట్నాలూ యిచ్చుగోవాలి: దానికితోడు సంగీతం_అల్లికలూ కుట్లూ నగలూ నాణ్యాలూ, అందం, అన్ని వుంటేనే గాని చెల్లదు. అంతచేసినా అల్లుడి దగ్గర అనువే:. . . ఎందుకా క్షోభ . . అడపిల్లో అని ఎందుకు కోరుకోవడం, అదృష్ట వంతులు కాబట్టి ఆ యోగ్యత పట్టలేదు.

ఒకడు : పోనీ మన గోపాలానికి ఒకడిని పెంపకం యివ్వ కూడదూ?

రామేశం : చెట్టుకి కాయలు బరువా? అయినా వాడిని అలా జల్సాగా బ్రతకనివ్వండి!

ఒకడు : ఏఁవిటి రామేశం! పిల్లలు లేని వాళ్ళు సుఖపడి పోతు న్నట్టు వాదిస్తారు మీరిద్దరూ?

చంద్రం : పిల్లలు లేకపోతే ఆనందం అని కాదురా తమ్ముడూ? దానికి పరిమితి అంటూ వుండాలి అని.. పిల్లలకి, మధ్య ఎడం వుండాలి! తక్కువ మంది వుండాలి! అదీ మా వుద్దేశ్యం. అయినా కొంత కాలం పాటు భార్యా భర్తలు ఆనందంగా వుండాలంటే, మోజు తీరాలంటే బర్త్

కంట్రోలు అవసరమనే అంటాను— అంతేగాని. మన శంకరంలా ముందాలోచన లేకుండా వుండకూడదు.

గోపాలం : అన్నట్టు శంకరం కనబడ్డేం—

ఒకడు : మూడు రోజులు సెలవు పెట్టేడోయ్!

గోపాలం : ఏం, ఋంట్లో—వాడి పెళ్లాం క్యాజువల్ లీవ్ కాబోలు!

చంద్రం : వాడికా అవస్థ లేదు! అఇదేళ్ళయి కాపురం చేస్తున్నారు. చూస్తున్నాం. ఆ మహా యిల్లాలు ఎప్పుడూ ఏదో ఒక నెల లోనే వుంటుంది. అందికే అన్నాను. ఆ మూడు రోజులూ వంట బాధ తప్పించు కుందికి, మనవాడు ముందే జాగ్రత పడుతున్నాడు.

(అందరూ నవ్వు)

రామేశం : అందరం వెటకారం చేసే వాళ్ళమే గాని... ఆ క్రొత్తగా పెళ్ళయిన రోజుల్లో ఆ వ్యవధి యివ్వడం—ఆ నిగ్రహం వుండొద్దూ! అనుభవం అయేక అందరూ చెబు తారు పెద్ద కబుర్లు! .. దానికేం. అనుకున్నవి ఆచరణలో పెట్టే సాధనాలు ఆలోచించాలి గాని.

గోపాలం : ఎందుకలా యిదవుతారు! నేను కొన్ని పద్ధతులు చెబుతా, అలా చెయ్యండి మీ అభీష్టం నెరవేరుతుంది— చూడండి! మీకు బర్త్ కంట్రోల్ సాధ్యం కాకపోతే—

మన చంద్రం— బెర్త్ కంట్రోల్ చేస్తాడు. అంటే బెర్త్ అంటే పడకని కంట్రోల్ చేస్తాడు.

మరి మన రామేశం.. గారి భార్యా ఏం చేయాలి అంటే భర్త కంట్రోలు అంటే భర్తని కంట్రోలు చెయ్యాలి... అన్నమాట! ఎలావుంది?

(అందరూ నవ్వులు)

ఒకడు : ఇస్! ఊరుకొండిరా హెడ్ క్లర్క్ వస్తున్నాడు.

(నిశ్శబ్దం... విరామం)

(చంద్రం యింటి దగ్గర)

చంద్రం భార్యా కమల : ఏంవిటండోయ్ అంత హుషారుగా వస్తున్నారు! ఓహో! అన్నట్టు జీతాలందేయి కామోసు!

చంద్రం : కమలా! కొత్త సినిమా వచ్చిందట వెళదామా?

కమల : అదొక్కటే తక్కువయింది! ఎన్ని సరదాలుంటే మాత్రం ఏం లాభం యీ పిల్లలిని వెంట బెట్టుగు వెళితే చూడనిస్తారా? యింక మిగతా వాళ్ళకి కూడా చికాకు! దారి పొడుగునా ఎత్తుగోమంటారు. యింక సినిమా హాల్లో— ఉచ్చలూ, అవీ, ఏవి కనబడినా కావాలంటారు. గడి గడికీ మంచి నీళ్ళు కావాలంటారు! ఏడుపులూ! పూర్తిగా ఆట అయ్యేవరకూ కూర్చోనిస్తారా? కుమ్మి వదుల్తారు, బట్ట లన్నీ పాడు చేస్తారు. యింక అలాటి సరదాలు మానుకో వలసిందే! మీరు పెళ్ళి రద్దుమా!

చంద్రం : అలా అనకు ఎప్పుడూ వెళ్ళుతున్నాం గనకనా? పిల్ల లిని అమ్మ దగ్గిర వదలి వెళదాం.

కమల : మీకు తెలీదండీ! ఆవిడ వప్పుకోదు! ఆవిడ ఎక్కడికి వెళ్ళినా మనమే భరించాలి! మనం వెళ్ళినా మనతోనే వుండాలి! మళ్ళ మనవలు మాత్రం కావాలి! యీ పెద్దవాళ్లు అందరూ యింతే... తీరా ఉంచుకున్నారూ అంటే. యింటికి వచ్చేక విసుక్కుంటారు! ఏదో పెద్ద వుపకారం చేసినట్టూ తాము లేనిదే జరగనట్టూ మాటాడతారు. నాకు చికాకు! అయినా అడిగి చూడండి! ఏమంటాకో!

చంద్రం ; అమ్మా! అమ్మా!

లక్ష్మి : ఏంరా నాయనా?

చంద్రం : పిల్లలిని కొంచం చూడమ్మా! మేం యిద్దరం సినిమాకి వెళ్ళి వస్తాం.

లక్ష్మి : వాళ్ళు నా దగ్గర వుండర్రా బాబూ! తల్లిని వదిలి! మీరు వెళ్లాక బ్రతకనివ్వరు! సరే వెళ్ళండి! చూద్దాం!

( పిల్లలు వచ్చి )

"అమ్మా! ఎక్కడికే వెళతారుట! మేమూ వస్తామే! తీసుకు వెళ్లే అల్లరి చెయ్యమే! ఎత్తుగో మనమే..."

ఊ...ఊ...నేనూ వస్తా

( అని అందరూ మారాం చేస్తారు )

లక్ష్మి : చూశావురా చంద్రం! నేనంటే కిట్టక, యిష్టం లేక అన్నానంటుంది... అప్పుడే ఎలా మొదలెట్టేరో!

కమల : ఇహ వెళ్లినట్టే—

చంద్ర : బాబూ! మీరూ నాయనమ్మ దగ్గర వుండండి...మీకేం కావాలో చెప్పండి అన్నీ కొని తెస్తాం...ఏం...వుంటారు కదూ.

పిల్లలు : మాకేంవీ వొద్దు... మేమూ వస్తాం... ( ఏడుస్తూనే వుంటారు)

లక్ష్మమ్మ : యిలారండర్రా! మనం హాయిగా కథలు చెప్పు

కుందాం...కంగాళీ పెట్టకండి మీ నాన్న కొడతాడు!

కమల : పిల్లలిని ఏడిపించి వెళ్ళకపోతేనేం...నేరాను...మీరు వెళ్లండి.

చంద్రం : కొంచం సేపు ఏడిచి వాళ్లే వూరుకుంటారు వద్దూ... అయినా అమ్మ కొంగు పట్టుగు వెళ్లడం... అలవాటు చేయకూడదు...పద.

( నిష్క్రమణ...విరామం )

కమల : అబ్బ! చాలా రాత్రి అయిపోయింది! వేగిరం పదండి! పిల్లలేం అల్లరి పెడుతున్నారో!

చంద్రం : అసలు నువ్వుండ లేవు కదా! యిదిగో వచ్చేసేం... (తలుపు కొడుతూ) అమ్మా! అమ్మా!

లక్ష్మి : వచ్చా వచ్చా (తలుపి తీసిన చప్పుడు)

చంద్రం : పిల్లలు పడుక్కున్నట్టే వుంది... కంగాళీ పెట్ట లేదు కదా? వెళ్లేక?

లక్ష్మి : ఏదీ ఒక్క అయిదు నిముషాలయిందేమో పడుక్కుని; యింత వరకూ నా ప్రాణం పీక్కు తిన్నారు! యిక మీద మీతోనే వెంట బెట్టుకు పొండి...నా వల్ల కాదు! అదేం... సంతానమో! (అని విసుగుతో అంది)

కమల : చూశారా! అలా విసుక్కుంటారనే నే రానంటాను! నా మొహానికి సినీమాలూ షికార్లూ ఏంవిటి లేక పోతేను! ఏవీ లేకండా అలా యింట్లోనే పడివుండాలి! వెనకా ముందూ ఎవరూ లేని ఆ సుజాతే నయం...నలుగురు పిల్లలున్నా...అంచక్కా సినీమాలకని—షికార్లకనీ వెళు తుంది! అదృష్టం వుండొద్దూ...పెద్ద దిక్కుని, అత్తగారని వుండగానే సరా?

లక్ష్మి : చూశావురా చంద్రం! పోనీ అని దగ్గిర వుంచుకున్నందుకా యీ మాటలు! అంత్య నిష్ఠూరం కన్న ఆది నిష్ఠూరం మేలు!

చంద్రం : పోనీద్దరూ! పడుకున్నారు కదా! యింక వూరుకొండి!

(విరామం)

కమల : ఇందాక బజారులో కొన్న మల్లెదండ ఏదండీ?

చంద్రం : ఇదుగో—సినీమాలో పెట్టుగో లేదేం?

కమల : నలిగి పోతాయండీ. .

చంద్రం : అలాగా; యిప్పుడు నలగవా?...చూడు కమలా... ఇలా రా...

కమల : అదుగో మళ్లీ—నిన్న ఉదయాన్నే లేచి వేసిన ఒట్టు మరచి పోయారా?

చంద్రం ; ఇంత వరకూ సంసారం యీది యీది గట్టున చేరు కున్నాం కదా—యిక ఆ ఒట్టు గట్టున పెడదాం...దానికేం గాని—నువ్వు యివాళ నిజంగా ఎలా వున్నావో తెలుసా? ఏదీ నేనా పువ్వులు ముడిలో వుంచుతా యిలా...రా...

కమల : ఛా వూరుకుందురూ—మీరు మరీని—

( ఇద్దరూ నవ్వులు )

---

# గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

చిత్తూరుజిల్లా వాయల్పాడు తాలూకాలోని గుర్రంకొండ, అరిగెల వారిపల్లి, సెట్టివారిపల్లి, బోడుడి గోరిపల్లి గ్రామాలకు 1961 సెప్టెంబరు నెలలో విద్యుచ్ఛక్తి సౌకర్యాలను లభింపజేశారు.

• కృష్ణాజిల్లాలో గన్నవరం తాలూకాలోని బర్లపూడిగ్రామానికి ఈనెల (సెప్టెంబరు)లో విద్యుత్‌సౌకర్యాలను విస్తరింపజేశారు.

విశాఖపట్నం జిల్లాలోని సూచికొండ, గనపర్తి గ్రామాలకూ, శ్రీకాకుళం జిల్లాలోని తంపటపల్లి భాసుర, బుక్కూరు గ్రామాలకు కూడా ఇదే నెలలో విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు,

వరంగల్ జిల్లా మహబూబాబాద్ తాలూకాలోని కొంపల్లి గ్రామానికీ, మహబూబ్‌నగరం జిల్లా కల్వకుర్తి తాలూకాలోని కడ్తల్ గ్రామానికి సైతం ఈ మాసంలో విద్యుత్ సరఫరా జరిగింది.

# ప్రగతి

శ్రీ పల్లా సత్యనారాయణ

ప్రణాళిక ప్రణాళిక
పంచవర్ష ప్రణాళిక॥

మన జీవన పరిమాణం
ఘన ముగ ఫలియించుటకు
నవ భారతి నిర్మాణం
నవ సంస్థాపన కొరకు
మన ప్రగతికి
మన జగతికి
భుక్తి కొరకు
ముక్తి కొరకు॥

జీవనదుల కద్భుతముగ
చెలియలి కట్టలు బిగించి
బహుళార్థక జల విద్యుత్
ప్రయోజనములను బెంచి,
వ్యవసాయం సహకారకి
వంకరముగ గదలించి
సస్యశ్యామల కోమల
స్వర్ణభారతిని మలచే॥

చేయి చేయి కలిపి ప
ల్లీయులు మును సాగాలోయ్
విద్యా;వైద్యం, పరపతు
లుద్యోతక మవ్వాలోయ్
చిన్న పరిశ్రమల అ
భ్యున్నతి పెంపొందాలోయ్
గ్రామ వికాసానికి అవి
రామ కృషి సలిపి అభి
రామముగా అందగించు॥

సాంకేతిక దృక్పథాలు
సాధించిన ఫలితాలను
మన మందర మేకమై
అనుభవించి బ్రతుకాలోయ్
రాక పోకలకు మేలగు
రాదారుల రచియించి
దేశైక్యము కొరకై ను
ద్దేశించిన పంచశరత్॥

ఘన సౌవర్ణాదికములు
ఖనులు ఖనిజములసీనగ
ఫల పుష్పదళోజ్వలములు
వను ఫలాదుల నీయగ
మన "వస్తుసంపద'' తా
మర తంపరలగుచు మహా
కార్మిక రంగమున విప్ల
వోర్మిక లుజ్వలత జిలుకు॥

రక్తికొరకు జీవన సం
తృప్తికొరకు శక్తికొరకు
క్రాంతికొరకు భారతవి
శ్రాంతికొరకు శాంతికొరకు

ప్రణాళిక ప్రణాళిక
పంచవర్ష ప్రణాళిక

# ప్రాచీన ఆంధ్ర గ్రంథాలయాలు

శ్రీ వెలగా వెంకటప్పయ్య

ఉజ్వలమైన భారతదేశ చరిత్రలో ఆంధ్రదేశం యితిహాసానికి ఎంతో ప్రాముఖ్యత వుంది. వేదకాలం నుంచీ ఆంధ్రులు అన్ని శాఖలలో తమ ప్రత్యేకతను నిలుపుకొంటూ, ప్రాచీణ్యాన్ని చాటుచూ వచ్చారు. సాహిత్యం, తత్త్వ శాస్త్రం, కళలు మొదలయిన విద్యలకు ఆంధ్రులకు విశిష్టత వుంది.

హాలునిగాధా సప్తశతి, గుణాఢ్యుని బృహత్కథ, సోమదేవుని కథా సరిత్సాగరం, వాత్సాయనుని కామ సూత్రములు, కుమారిలుని వార్తికములు, నాగార్జుని తత్త్వశాస్త్రం యిత్యాది లెన్నో ఆంధ్రుల జిజ్ఞాసకు మేధా సంపదకు, సృజనాత్మక శక్తికి ప్రత్యక్ష నిదర్శనాలు. ఆంధ్రుల సాంస్కృతీ విజయపరంపరలు భారత దేశంలోనే గాక దిగదిగంతాల వ్యాపించటానికి దోహదాలు.

ఒక జాతి ఔన్నత్యం పొందటానికి విజ్ఞాన రాసియైన గ్రంథాలయం ఒక ప్రధాన సాధనం ఇప్పటికి రెండువేల సంవత్సరాలనాడే ఆంధ్ర దేశంలో గ్రంథాలయాలకు ప్రాముఖ్యత యిచ్చియున్నారు గనుక నేడు మనం సాంస్కృతికంగా వున్నత స్థానాన్ని ఆక్రమించి యున్నాము గ్రంధాలయాల నాదరించిన ప్రతి దేశము సమస్త విషయములందు ఉత్కృష్టస్థితిని పొందినది. రమారమి 6000 సంవత్సరాల నుండీ ప్రపంచమందంతట గ్రంథాలయాలు గలవని ప్రఖ్యాత విమర్శకులు సురవరం ప్రతాపరెడ్డి గారొకచోట తెలిపియున్నారు. గ్రీసు, రోమక దేశాల తత్త్వ శాస్త్రం, సాహిత్యం, కళలు నేటి ప్రపంచానికే మార్గ దర్శకం కావటానికి నాడు వాఙ్మయాన్ని ప్రోది చేసిన గ్రంథాలయాల ప్రభావం మిక్కుటంగా వుండక తప్పదు.

ఆవిధంగానే మనదేశంలోనూ వాఙ్మయ ప్రభావం సాంస్కృతిమీద సోకిన దనుటలో ఆశ్చర్యము లేదు. వీటికి చేయూత నిచ్చిన గ్రంథాలయాల పాత్రను మరవలేము. అయితే ప్రాచీన కాలంలో గ్రంథాలయాల స్వరూపం ఏమిటి? అనేదే ప్రస్తుత అంశం,

భారతదేశములో లిపి పుట్టుక జరిగి దాదాపు పదివేల సంవత్సరాలయి యుంటుందని భాషా పరిశోధకుల యూహ. అయిదువేల సంవత్సరములనాటి సింధు నదీలోయ నాగరికతనాటికే లిపి వ్యాప్తిలో నున్నట్లు చరిత్ర శతథా చెబుతోంది. క్రీస్తు శక ఆరంభంలో తెలుగులిపి వుద్భవించి ఆరు, ఏడు శతాబ్దాల నాటికే కొంతవరకు కుదురుకొన్నది. నన్నయ కాలము నాటికి పరిపూర్ణ స్థితికి వచ్చినది

ఈ కాలంలో లిపికారులు రాళ్ళ మీదను, రాగి రేకుల మీదను బూర్జర పత్రాల మీదను తాటియాకుల మీదను మట్టి బిళ్ళల మీదను వ్రాస్తూ వుండేవారు.

సంస్కృతములో మట్టినిగాని, లోహముగాని, బిళ్లలుగా తయారు చేయుటను లేదా మలచుటకు 'పుస్త' యందురని, దీని నుండి 'పుస్తకమ' ను రూపము వచ్చినదని తెలియుచున్నది. ఈ శిలా శాసనాలను గాని, రాగి రేకులను గాని, మట్టి బిళ్ళలను గాని, తాళ పత్రాలు గాని నేడు ప్రసిద్ధ గ్రంథాలయాలలో ప్రాచీన వ్రాతకు ప్రతినిధులుగా మనం చూడవచ్చు.

లిపిని జైన, బౌద్ధ ప్రచారకులు, తత్త్వ వేత్తలు సద్వినియోగ పరచుకున్నారు. వారి సాహిత్యం గ్రంథస్థం చేయటం వలన తమ సిద్ధాంతాల ప్రచారానికి భారతదేశంలోనే గాక యితర దేశాలలో సహితం ప్రచారం చేసికోడానికి మిక్కిలి తోడ్పడింది. ఈ మతాలకు పూర్వమే కొన్ని శాస్త్రాంశాలు గ్రంథస్థం చేయబడినవి. ఇవన్నీ ఆనాడు రాజుల ఆధీనంలోనో, మతాధికారుల వద్దనో భద్రపరుచ బడేవి. ఇవే మన ప్రాచీన గ్రంథాలయాలు. అయితే వీటిలోని గ్రంథాలు చదువుకొనే భాగ్యం సార్వజనులకు లేదు. రాజుల ప్రాపకం మతాచార్యుల వద్ద పలుకుబడి సంపా

దించిన వారికే యీ గ్రంథాలను స్పృశించే హక్కు వుండేది. ఈ గ్రంథాలయాలలో అనేక శాస్త్రాలకు సంబంధించిన విజ్ఞాన విలసిత గ్రంథాలు ఓక్కుటంగా వుండేవి. ఇలాంటి గ్రంథాలయాలు ఆంధ్ర దేశంలో లేకపోలేదు ఆ వివరాలు దిఙ్మాత్రంగా వివరిస్తాను.

చారిత్రక ఆధారాలు దొరికినంత వరకు తెలుగు దేశము నేలిన తొలి రాజ వంశీయులు శాతవాహనులు. వారి రాజ భాష ప్రాకృతము దాక్షిణాత్య బ్రాహ్మీ లిపిలో వ్రాయ బడుతుండేది. మగధ రాజ్యం విచ్ఛిన్న మయిన పిదప దానినుంచి చీలి రావటం చేత శాతవాహనులు తెలుగు ప్రభువు లైనప్పటికి ప్రాకృత భాష నుపయోగింపక తప్పలేదు. అదియునుగాక నాటి తెలుగు భాషకు లిపి ప్రాథమిక దశయందున్నది

రెండు వేల సంవత్సరాలుగా యావత్ ప్రపంచాన్ని తత్త్వ జిజ్ఞాసతో వుర్రూత లూగించిన నాగార్జునుడు శాతవాహన పరి పాలనా కాలంలోనివాడే అనాడే నాగార్జుని శిష్యులు సింహళ ద్వీపములోనూ, సుమత్రా, జావా, బోర్నియో మొదలయిన దీవుల లోనూ విశేషంగా బౌద్ధమత ప్రచారం చేశారు

శాతవాహనుల రాజధాని విజయపురికి సమీపముననున్న శ్రీపర్వతముపై నివాసముండెను. ఈ పర్వతమునే నేడు నాగా ర్జున కొండయని పిలుస్తున్నారు. ఈ పర్వతమున యజ్ఞశ్రీ శాత కర్ణి మహా చైత్యమును, మహా విహారమును నిర్మించి నాగార్జునకు బహుమానముగా యిచ్చెను. మహా విహారము ఐదు అంతస్థుల భవనము. 1500 గదులు గలిగి, వెలుతురు, నీటి సదుపాయము కలిగి యుండేది. వర్షాకాలమందు బౌద్ధ భిక్షువులకు వాసయోగ్య ముగా నుండెడిది. ఆనాడు భారతదేశ దర్శనార్థము వచ్చిన చైనా యాత్రికులు ఫాహియాన్, యువాన్ చాంగ్ యీ విహార మును చూచి విశేషముగా ప్రశంసించిరి.

అశేషశేముషీ దురంధరుడగు నాగార్జుని అపూర్వ గ్రంథ సంచయం యీ విహారమున నాలుగవ అంతస్థునందుండెడిది. ఆనాటి వరకు అనేక శాస్త్రములలో లభ్యమవుతున్న అనేక వుత్తమ గ్రంథములను నాగార్జునుడు సేకరించెను. 84,000 సంభా షణలుగల త్రిపిటకములు. భూగోళ, లోహ విజ్ఞానములయందు గ్రంథములు గలవు. అంతేగాక రసవాద, రసాయన, రత్న, వృక్ష, ఆరోగ్య, వైద్య శాస్త్రములయందు యెన్నియో వుద్గ్రంథ ములచట గలవని తెలియుచున్నది. పైగా యీ శాస్త్రములందు నాగార్జునకు పాండిత్యము గలదు. కనుక నాగార్జునుని పరిపూర్ణ మానవుడనుటలో సందేహము లేదు.

ఈ విధముగా క్రీ శ. రెండవ శతాబ్దమునందే అనేక శాఖలలో వివిధ గ్రంథాలు సేకరించిన నాగార్జునుడే ఆంధ్రదేశ మున తొలి గ్రంథాలయ వ్యవస్థాపకుడగుటలో సందేహం లేదు

క్రీ శ. మూడవ శతాబ్దములో యిటువంటి అపూర్వ గ్రంథా లయం నలందా విశ్వవిద్యాలయము ఆంధ్రేతర ప్రాంతమునందు మరొకటిగలదు. అచట రత్నోదధియను తొమ్మిదిఅంతస్థుల భవన మునందు అపారమయిన పుస్తక సంచయముగలదు. అంతేగాక రత్నసాగర, రత్నరంజిక అనుభవములందును గ్రంథా భాండా గారములు గలవు. 'రత్నదధి' యందున్న గ్రంథాలయం నాడు అసియా ఖండమున కెల్ల వుత్తమ శ్రేణికి చెందిన పెద్ద గ్రంథా లయముగా వర్ధిల్లినది.

శాతవాహనుల కాలమునందు అ మ రా వ తి పట్టణమున వున్న కళాశాలలలో బ్రాహ్మణ, బౌద్ధాదిధర్మశాస్త్రములు బోధింప బడు చుడెండివి. ఇచటగూడ గ్రంథ సంచయమున్నట్లు తెలియు చున్నది. ఈ కళాశాలకు చీనా, బర్మా, సింహళము మొదలయిన దేశములనుండి ధర్మ శాస్త్రాధ్యయమునకు శిష్యులు వచ్చెడి వారు. కనుక యిప్పటికి సుమారుగా రెండు వేల సంవత్సరాలుగా ఆంధ్ర దేశంలో గ్రంథాలయాలు వెలసినట్లు తెలుస్తుంది.

శాతవాహనుల పిదప శ్రీ పర్వతీయులు (ఇక్ష్వాకులు) తెలుగు నాడును పాలించారు. ఈ రాజ వంశీయులు మొదటగా హిందూ మతమును పోషించిననూ, మాఢవీపుత్ర వీర పురుష దత్తుని కాలములో బౌద్ధమతం విశేషంగా ఆదరింప బడినది. హీనయాన బౌద్ధులకు బుద్ధగయ లాగ, మహాయాన బౌద్ధులకు శ్రీ పర్వతము దివ్య క్షేత్రముగా నుండినది. ఈ అచలముపై చుళధర్మగిరి మీద వీరపురుషదత్తుడు చైత్య గృహముతో బాటు, చతుశ్శాలను నిర్మించెను. ఈతని కాలమున గూడ గ్రంథ సము చ్చయమునకు ఆదరణయున్నట్లు మనమూహింపవచ్చును. శ్రీ పర్వతీయుల పిదప బృహత్పలాయనులు, శాలంకాయనులు, ఆనంద గోత్రజులు, మాఠరులు, విష్ణు కుండినులు. కళింగాంగులు, పల్లవులు—మొదలగు చిన్న చిన్న రాజ వంశములవారు ఆంధ్ర దేశమును పాలించిరి. ఈ రాజులు ప్రాచీన గ్రంథాలయాలు పున రుద్ధరించినట్లుగాని, కనీసం వారి అభిరుచులకు తగిన గ్రంథావళిని

సేకరించునట్లుగాని చారిత్రిక ఆధారాలు కనుపించుట లేదు. చాళుక్య, చోళుల కాలంలో తెలుగు భాష పరిపూర్ణమయిన వర్ణ క్రమాన్ని ఏర్పరచుకొన్నది. తెలుగు సాహిత్యమాలకు మేలి ముత్యమయిన శ్రీ మదాంధ్ర మహాభారత రచనకు అవసరమగు పదబంధాన్ని తెలుగు భాష సంతరించుకొన్నది. రాజ రాజనరేంద్రుని ప్రోత్సాహమువలన మహాభారతమును తెలుగు చేయుటకు వాఙ్మయదురంధరుడు, విజ్ఞాన నిరతుడు నన్నయ భట్టు ప్రారంభించినాడు.

రాజరాజ నరేంద్రుని ఆస్థానములో "అపార శబ్ద శాస్త్ర పారగులైన వైయాకరణులును, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులును, మృదుమధుర రసభావ భాసుర నవార్థ వచనరచనా విశారదులయిన మహాకవులును, వివిధ తర్క విగాహిత సమస్త శాస్త్ర సాగర గరీయః ప్రతిభులైన తార్కికులకు నాదిగా గలుగు విద్వజ్జనంబులు" గలరు.

ఈ గద్యమును బట్టి ఆ కాలమున పలువురు పండిత ప్రకాండులు, వివిధ శాస్త్రములలో నిష్ణాతులు వుండిరని స్పష్టమగు చున్నది. తెలుగు భాషకే గాక, యితర ద్రావిడ భాషలకు, ప్రాకృత సంస్కృత భాషలో ఎప్పటినుంచో లిపి వుండుట చేత ఆనాటి వరకు లభ్యమవుతున్న అనేక గ్రంధములనీ పండితులు స్పృశించి సంతరించుకొని యుందురనుటలో సందేహము లేదు.

వీరితరువాతి రాజవంశములయిన కాకతీయులు, రెడ్డిరాజుల కాలములో తెలుగుభాష ముమ్మరంగా అభివృద్ధిచెందినది. తెలుగు పలుకుబడికి, దేశి సారస్వతానికి అత్యధిక ప్రాధాన్యత వచ్చినది ఈ కాలములో మతసామరస్యం, తక్కువ కావటం చేతనో, మహమ్మదీయ తిరుగుబాట్లు ఎక్కువ కావటంచేతనో ప్రజలు ప్రభువులు అనేక యిడుములకు గురి అయినారు. అయినప్పటికి విద్యా పోషణ లోనూ, కళారాధనలోనూ నాటి ప్రభువులకుసాటి రాగలవారు లేరు సాహిత్యమును విశేషముగా నాదరించిరి గనుక కాకతీయ, రెడ్డి రాజులు అనేక గ్రంధాలను సేకరించిరనుటలో ఆశ్చర్యం లేదు.

విజయనగరరాజుల కాలంలో సాహిత్య పోషణతోబాటు గ్రంథాలయ వికాసం గూడ జరిగినట్లు నాటి ప్రబంధముల వలన తెలియుచున్నది. సాహిత్య సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానమునలంకరించి అష్టదిగ్గజములలో శ్రేష్ఠ దయిన ఆంధ్ర కవితాపితామహుని మను చరిత్ర పీఠికలోని యీ పద్యమును గమనించండి—

"భరమైతోచుఁ గుటుంబ రక్షణకుఁగాఁ
బ్రాల్మాలి చింతన్ నిరం
తర తాళీదళ సంపుట ప్రకరకాంతా
రంబునం దర్థ పున్
దెరువాటుల్ దెగికొట్టితజ్ఞ
పరిషద్విజ్ఞాత చౌర్య క్రియా
విరసుండై కొఱఁతన్ బడున్గుకవి
పృధ్వీభృత్సమీ పక్షితిన్"

మరియు "పాండురంగ మహత్మ్యములో" తృతీయ ఆశ్వాసములో తెనాలి రామకృష్ణుడు నిగమశర్మ యింటిలోని గ్రంధసంచయాన్ని యీ విధంగా గద్యంలో వర్ణించాడు

"...పుస్తక భాండాగారంబు నిజభర్తృ హస్తాంత రంబున నాఖు కుక్షిణి శిధిల బంధన యాచక ప్రముఖోపద్రవంబుల వలనం బాఁచిప్రోచుచు, దిగళిత సన్నాహంబగు గేహంబు యధా పూర్వ నిర్వహణ మనోహరంబుగా నను సంధింపించి చదువు సంతసాగించి నడిపించుచు ..."

పైన ఉదహరించిన పద్య, గద్య, పెద్దన, రామకృష్ణ కవుల యింట గ్రంథాలయములు కలవని వ్యక్తమగుచున్నది. అంతేగాక నేడు గ్రంధ భాండాగారు లెదుర్కొంటున్న యీ దిగువ సమస్యలు ఆనాడూ వున్నవట. 1. పుస్తకాలకు అగ్ని ప్రమాదము, 2 ప్రాచీనతచేగాని, వాడుకచేగాని శిధిలమై పోవుట, 3. చోర భయము ఈ మూడవ సమస్యను నేటికి పరిష్కరించుట దుస్తరముగానున్నది. గ్రంధ చోరులేగాక విషయ చోరులున్నటులు పెద్దన పద్యము చెప్పుచున్నది. పెద్దన శ్లేషచేమకవియందు చోరుని లక్షణములు ఆరోపించి—ఆ నాటి పరిస్థితులను మనకు అవగతము చేసినాడు.

శ్రీ కృష్ణ దేవరాయల పిదప రామరాయలు, శ్రీ రంగ రాయలు, వెంకటపతి రాయలు మొదలగు రాజులు సారస్వతమును పోషించిరి. వీరి కాలమున వెలసిన కవులవద్ద గూడ గ్రంధ సంచయముండి యుండవచ్చును. విజయనగర రాజుల పిదప ఆంధ్ర సరస్వతి తంజావూరు పయనమయ్యెను.

తంజావూరు నేలిన తెలుగునాయక రాజులలో సాహిత్య పోషకులేగాక రాజకవులుగూడ గలరు. మృదు, మధుర మంజుల కవనంతో ఆ కాలంలో శృంగారదేవత నాట్యమాడింది. రఘునాథ

నాయకుడు, విజయరాఘవుడు మున్నగురాజకవులతో బాటు రంగాజమ్మ, చేమకూర వెంకటకవి, త్యాగరాజు యిత్యాది కవిప్రవరులా కాలమునకు అలంకారము.

ఆ కాలంలో (పదిహేడవ శతాబ్దము) తంజావూరు నగరమున సరస్వతిమహల్ లైబ్రరీ వెలసినది. నాటి తెలుగురాజులు అనేక వ్యయప్రయాసలకోర్చి పెక్కు వ్రాత ప్రతులను యీగ్రంథాలయంలో చేర్చి పోషించారు. అచట జరిగిన మరొక మహత్ కార్యమేమంటే నాయకరాజులు దేవనాగరి లిపిలో వున్న సంస్కృత గ్రంథాలను తెలుగు లిపిలో వ్రాయించారు తంజావూరు మహారాష్ట్రుల స్వాధీనమైన పిదపగూడ యీ గ్రంథాలయం విశేషంగా ఆదరింపబడినది 1823–30 సంవత్సరాలలో సర్ఫోజియను మహారాష్ట్రుడు బెనారెస్ వెళ్ళి అనేక సంస్కృత గ్రంథాలు సేకరించి యీ గ్రంథాలయానికి యిచ్చాడు. అనేక శాస్త్రాలలో యీ గ్రంథాలయమున అనేక ప్రామాణిక గ్రంథములుగలవు. దీనిలో 18.000 పైగా లిఖిత ప్రతులుగలవు. దేవనాగరి, నందినాగరి. తెలుగు, కన్నడము, గ్రంధి, మలయాళము, బెంగాలీ, పంజాబీ. ఒరియా– మొదలగు లిపులయందు యిచట గ్రంథములు గలవు దక్షిణదేశమున వున్న లిఖిత ప్రతులు లభించు గ్రంథాలయములలో సరస్వతి మహల్ లైబ్రరీ తలమానికమైనది. తెలుగు దేశపు సాహిత్య సంపదను ప్రోదిచేసి నాలుగు కాలాలపాటు నిలిపిన నాయిక రాజులు ధన్యులు.

నిజాం రాష్ట్రములో గూడ గ్రంథాలయసేవ యితోధికంగా జరుగకపోలేదు. మొదటి రామేశ్వరరాయలు (1821–1865) కాలంలో అనేక గ్రంథాలు సేకరింపబడినవి రెండవ రామేశ్వర రాయలు గొప్ప సాహిత్యప్రియుడు కావటంచేత జర్మనీ దేశము నుండిగూడ అనేక సంస్కృత గ్రంథాలుతెప్పించి గ్రంథాలయాన్ని ఎంతో అభివృద్ధిపరచాడు. ఈతని భాండాగారమున ముద్రితాముద్రిత గ్రంధాలు పదివేలుగలవు ఈ గ్రంథాలయము పలువురు కవి పండితులకు విశేషముగా నుపయోగపడినది.

ఇంతవరకు రాజులచేత. కవులచేత, మతాచార్యుల చేతగాని పాలింపబడుతున్న గ్రంథాలయాలలో కేవలం లిఖిత సామాగ్రి మాత్రం వుండేది. రాళ్ళు, రాగిరేకులు, తాళ పత్రాలు–యిత్యాదులే నాటి గ్రంధ సంపుటాలు

పదిహేడవ శతాబ్దంలో భారతదేశంలో ముద్రణ ప్రారంభం కావటంతో గ్రంథాలయాలు కొత్తచివుళ్ళు సంతరించుకొన్నవి. మత ప్రచారంకొసమే 1746 లో తెలుగులో పుస్తకాల ముద్రణ ప్రారంభించినప్పటికి, మానవ వికాసంపై దాని ప్రభావం ఎంతో కనబడింది క్రమంగా అనేకపుస్తకాలు దేశీయభాషలలో ప్రచురింపబడుటతో ప్రజలలో విజ్ఞాన బీజాలు మొలకలెత్తాయి. పందొమ్మిదవ శతాబ్దం నాటికి తెలుగుభాషలో అనేక విషయాలపై పుస్తకాలు శరపరంపరగా వెలువడినాయి.

ఆరోజులలో దేశపు రాజకీయ పరస్థితి సుస్థిరంగాలేదు. పరాయిపాలనతో దేశం అతలాకుతలమయింది జాతీయతకు వెన్నువిరిగినది. ప్రాంతీయభాషలకు ఆదరణ, పోషణ తగ్గినది. మెకాలే సలహాపై ఆంగ్లేయపాలన సుస్థిరం చేసుకొనే వుద్దేశంతో బెంటిగ్ ప్రభువు ఆంగ్లభాషను ప్రచారంచేశారు. తత్ ఫలితంగా దేశంలో అనేక పాఠశాలలు, కళాశాలలు వెలసినవి. ఆంగ్లభాష ఆధిక్యంపెరిగి భారతీయభాషల ప్రభావం తగ్గినది

ఆంగ్లేయులు మద్రాసునగరమున చిత్రవస్తు ప్రదర్శనశాలను ఏర్పరచి తాము వివిధ ప్రాంతాలనుంచి సేకరించిన విచిత్రవస్తువులను అచట పదిలపరచారు అప్పట్లో యీ ప్రదర్శనశాలకు ప్రధాన అధికారి కెప్టెన్ మిఛెల్. "ఆంగ్లవిద్యావ్యాసం దేశంలో వుధృతంగా పెరుగుతోందిగనుక ఒక ఆమాకి గ్రంథాలయాన్ని ( రిఫరెన్సు లైబ్రరీ) ఏర్పాటుచేసిన మిక్కిలి వుపయోగకారిగా వుంటుందనీ ప్రజలలో ప్రభుత్వమంటే విశ్వాసముంటుందనీ" కెప్టెక్ మిఛెల్ ప్రభుత్వానికి సూచించాడు.

ప్రభుత్వం అందుకు అంగీకరించి ఒక ఆమూకి గ్రంథాలయాన్ని ప్రదర్శనశాల ఆవరణలో ప్రారంభించింది. 1890 సంవత్సరంలో లార్డ్‌కన్నెమరా మద్రాస్ రాష్ట్రానికి గవర్నరుగారావటంతో యీ గ్రంథాలయం నూతన రూపు ధరించింది. 1896 సంవత్సరంలో దీనికి ప్రత్యేకంగా భవనం నిర్మించబడి సార్వజనీన గ్రంథాలయంగా మార్చబడినది లక్షలకొలది ధనం వ్యయంచేసి అమూల్యమయిన గ్రంథాలు దీనికోసం కొని ఎంతో వృద్ధి జేశారు దక్షిణ దేశంలో ఇది ప్రసిద్ధగ్రంథాలయం దీని పోషణకుగాను తెలుగువారి ధనం గూడ ఖర్చు పెట్టబడినది గనుక ఆంధ్ర రాష్ట్రం ప్రత్యేకంగా ఏర్పడిన పిదప యీ గ్రంథాలయములో సగభాగం ఆంధ్రులకు దక్కటం సమంజసం.

ఆంగ్లేయుల పాలనలో ప్రారంభించబడిన మరొక గ్రంథాలయం ప్రాచ్యలిఖిత పుస్తకభండాగారము, బ్రౌన్‌దొర ప్రోత్సాహము వలన యీ గ్రంథాలయం ఏర్పరుచబడినది. (అవిభక్త) మద్రాసు

ప్రభుత్వం యీ గ్రంధాలయానికి అనేక అమూల్య వ్రాతప్రతులను సేకరించి యితోధికంగా ప్రోత్సాహం యిస్తూవుంది.

పూర్తిగా తెలుగుగడ్డపై సార్వజనీన గ్రంధాలయం 1886 సంవత్సరంలో విశాఖపట్నంలో ఏర్పడింది. శ్రీమంతిన ఆది నారాయణ రావు గారను వినయ శీలుడగు వుపాధ్యాయు డొకడు సరస్వతీ గ్రధాలయం ప్రారంభించాడు ఆతర్వాత కొంతకాలానికి కడపజిల్లా పులివెందుల గ్రామంలో సరస్వతీ విలాస మందిరమను మరొక సార్వజనీన గ్రంథాలయం స్థాపించబడింది. ఆతర్వాత రాజ మహేంద్ర వరంలోని గౌతమీ గ్రంథాలయం, హైదరాబాదులోని శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం యిత్యాది గ్రంధాలయాలు స్థాపించబడి ఆంధ్రదేశంలో గ్రంథాలయ ఉద్యమం ఉవ్వెత్తుగా లేచినది

"వాయవెట్టులు స్వేచ్ఛమై ప్రజకుదొరుకు
నట్లె జ్ఞానంబు కూడను నబ్బవలయు
ఉదకమెల్లర కేరీతి నొదవు నట్లె
జ్ఞానముంగూడ సేవ్యంబు గాగవలయు
సూర్యచంద్రుల తేజంబు చూరలాడ
నెల్లవారికి లభ్యమై యొసగునట్లె
జ్ఞానముంగూడ సులభంబు గాగవలయు"

అనుసదుద్దేశములతో ఆంధ్రదేశమున బయలుదేరిన యీ ఉద్యమం వాడవాడలవ్యాపించి, ప్రజలను వివేకవంతం చేసి, ఉత్తేజపరచి స్వాతంత్ర్య సముపార్జనకు ఎంతగానో దోహదం యిచ్చింది

తత్త్వ జిజ్ఞాసతో దేశదేశాలను వుర్రూత లూగించిన నాగార్జునుని నుండి ప్రారంభమయిన గ్రంధాలయవికాసం నేడు ఆంధ్రదేశంలో సర్వతోముఖంగా వ్యాపిస్తోంది తానుబాగుపడి ప్రజలకు వెలుగుబాట చూపుతోంది విజ్ఞాన వికాస సంస్థలలోకి ప్రథమశ్రేణి నందుకొంటూంది. ఇందుకు ఆంధ్రులంతా గర్వించాలి.



మొదట కాళ్ళు పట్టి పిదప జుట్టును పట్ట
కొన్ని వేళలందు గొప్పె కాని
నరుడు చేయరాదు నమ్మక ద్రోహమ్ము
జననుతాంతరంగ! వినుర! రంగ!

కళా కృష్ణుల "కృష్ణ శతశతి" నుంచి



రాష్ట్ర ప్రభుత్వం నియమించిన అడ్‌హాక్ చర్మకార బోర్డుకు నవంబరు 1 వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం **చేశారు.**



ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య అక్టోబరు 23 వ తేదీన తిరుపతిలో పంచాయతీ రాజ్య సమ్మేళనాన్ని
ప్రారంభం చేసినప్పటి దృశ్యం.



నందిగామ పంచాయతీ సమితి అధ్వర్యాన 1961 సెప్టెంబరు 17, 18, 19 వ తేదీలలో బండిపాలెం గ్రామంలో గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం జరిగింది. ఆ సందర్భంలో శిక్షితులు పారిశుద్ధ్య కార్యక్రమం నిర్వహించారు. పై చిత్రంలో ఆ దృశ్యాన్ని చూడవచ్చు.



ప్రణాళికా శాఖా మంత్రి నవంబరు 1 వ తేదీన హైద్రాబాదు జిల్లాలో పర్గి ప్రీ ఎక్స్‌టెన్షన్ బ్లాకుకు ప్రారంభోత్సవం చేశారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం భూగర్భ పరిశోధనశాఖలో ఇటీవల 'గ్రవీమీటరు"ను నెలకొల్పారు ఈ మధ్య జరిగిన అణ్వస్త్ర ప్రయోగాల అంశాలను ఇది రికార్డు చేసింది.



థాయ్‌లాండ్ యువరాజు, యువరాణి గత నవంబరు 7 న గోలకొండ కోటను సందర్శించిన సందర్భంలో తీసిన చిత్రం.



నగరంలో "త్రివిధమైన" ఉత్సవాల సందర్భంగా 1961 నవంబరు 1 న ఏర్పాటు చేసిన ఒక సాంస్కృతిక ప్రదర్శన దృశ్యం.



లండన్ హోమ్ మేగజిన్ ప్రత్యేక శీర్షికల సంపాదకురాలు కుమారి ఎలిజబత్ బ్రాన్సన్, గత అక్టోబరు 28 న హైద్రాబాదులోని సాలార్‌జంగ్ మ్యూజియంను సందర్శించారు. మ్యూజియంలోని ఒక కళాఖండాన్ని చూసి ఆమె ముగ్ధురాలైన సన్నివేశాన్ని పై చిత్రంలో చూడవచ్చు.



లండన్ "డెయిలీ మిర్రర్" పారిశ్రామిక సంపాదకుడు శ్రీ రోలండ్ హస్మన్ హైద్రాబాదుకు విచ్చేసిన సందర్భంలో చేతి పరిశ్రమల వస్తువులను తిలకించారు. కళా వైదగ్ధ్యం వుట్టిపడే ఒక వస్తువును చూసి దాని పనితనాన్ని ఆయన ప్రస్తుతించారు.



లక్ష్మీనగర్ సహకార గృహ నిర్మాణ కాలనీ, సికింద్రాబాదు.



ముఖ్యమంత్రి శ్రీ సంజీవయ్య నవంబరు 30 వ తేదీన అనంతపురం జిల్లాలో పర్యటించిన సందర్భంలో తుంగభద్ర హైలెవల్ కెనాల్ పథకం క్రింద ఇంద్రావతి వద్ద పనిచేస్తున్న కార్మికులను కలుసుకొని వారి యోగ క్షేమాలను అడుగుతున్న దృశ్యం.



ప్రజాశికా సప్తాహం రెండవ రోజు కార్యక్రమాన్ని వ్యవసాయ శాఖవారు నిర్వహించారు.
ఆ సందర్భంలో వ్యవసాయ శాఖా మంత్రి బహుమతులు పంచిపెట్టినప్పటి చిత్రం.



కర్నూలు జిల్లా, గిద్దలూరు తాలూకా అనుములవీడు పంచాయతీ కార్యాలయంలో
అక్టోబరు 29 న విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం జరిగింది.

# ఈ ప్రణాళిక ద్వారా మీకు కలిగే ప్రయోజనాలు ఏమిటి?



తలసరి ఆదాయంలో
రూ. 55 పెరుగుదల



అందరికీ చాలినంత తిండి



ప్రతి వ్యక్తికీ అదనంగా
2 గజాల బట్ట



ఉచిత, నిర్బంధ
ప్రాథమిక విద్య



ఆధునిక వైద్య సౌకర్యాలు



అదనంగా 1 కోటి
40 లక్షల ఉద్యోగాలు



గ్రామసీమలకు స్వచ్ఛమైన
మంచినీటి సదుపాయం




ధైర్యసాహసాలతో కష్టించి పని
చేయడం ద్వారా
ప్రణాళికకు తోడ్పడండి, అప్పుడే

**ప్రతి ఒక్కరికీ**
**ఆనందదాయకమైన జీవితం**

మన్య విప్లవ మహావీరుడు

# అల్లూరి సీతారామరాజు చరిత్ర

(ప్రభుత్వ ప్రచురణ)

(రచయిత: యర్రమిల్లి నరసింహారావు)

## వెల: రూ. 2-75 న. పై.




ప్రతులకు:— సమాచార పౌరసంబంధముల శాఖ

ఆంధ్రప్రదేశ ప్రభుత్వం,

హైదరాబాదు-1

# సవరలు-నివాసం

## శ్రీ జి. వి. రామమూర్తి

ఇప్పుడు సవరలు ఎక్కువగా తూర్పు కనుమలలో ఉంటున్నారు. విశాఖపట్నమునకు 120 మైళ్లదూరములో ఉత్తర దిక్కున ఉన్న మందసా కొండలనుండి పడమటను గుణుపురము వరకున్నూ, దక్షిణమున పర్లాకిమిడి నుండి ఉత్తరదిశ వైపు యిరవై మైళ్లవరకు వీరు నివాసం ఏర్పరచుకు ఉన్నారు. ఈ ప్రదేశము సుమారు 60 మైళ్ల పొడుగు, 25 మైళ్ల వెడల్పుఉంటుంది. ఈ ప్రదేశమునకు ఉత్తర దిక్కున ఉన్నకొండలలో వీరివంటి వారయిన "ఖాండ్"లనే వేరొక కొండజాతివారు నివసిస్తున్నారు.

మందసావద్ద మహేంద్రగిరి అనే ఒకఎత్తైన కొండ ఉన్నది దీని ఎత్తు సుమారు(సముద్రమట్టమునకు) 5000అడుగులుఉంటుంది. ఈ మహేంద్రగిరి శిఖరము మనము ఎక్కిచూస్తే మన కంటికి కనబడే దృశ్యాలు చూడ ముచ్చటగా ఉంటాయి.

తూర్పున బంగాళాఖాతము నీలముగా కంటికి యింపుగా కనబడుతుంది. వాల్తేరు నుండి కలకత్తా పోయే రైలుమార్గము రెండు నల్లగీతల్లాగ ఒక పాతిక మైళ్ల పొడవున కనబడుతుంది. నౌపడా మొదలుకొని యిచ్ఛాపురం వరకున్నూ గల రైల్వేస్టేషన్లు చిన్న అగ్గి పెట్టెల లాగ కనబడతాయి.

ఈ మహేంద్రగిరివద్ద మూడు చిన్న నదులు ఒక చోటనే పుట్టినవి. ఈ మూడు నదులకూ "మహేంద్ర తనయ"అనే పేరు. ఒకటి తూర్పుగా ప్రవహించి బారువా వద్ద సముద్రములో కలుస్తున్నది, ఇంకొకటి పడమర దిక్కుగా ప్రవహించి"వంశధార' అనే మరొక పెద్దనదిలో గుణుపురం వద్ద కలుస్తున్నది. మూడవ నది దక్షిణంగా ప్రవహించి అదే పెద్దనదిలో పర్లాకిమిడికి పది మైళ్ల దూరములో కలుస్తున్నది. ఈ మూడు'మహేంద్రతనయలు" సవర దేశములో నుండే ప్రవహిస్తున్నవి.

పర్లాకిమిడి పట్నమునకు ఉత్తర దిక్కున ఎనిమిది మైళ్ల దూరమున 3000 అడుగుల ఎత్తుగల ఒకకొండ ఉన్నది. ఈ కొండను సవరలు "డియాబుర్" అంటారు. "డియా"అంటే నడుము అనిన్ని, "బుర్" అంటే కొండ అనిన్ని సవర భాషలో అర్థము. ఈ "డియాబుర్"ను మన వారు సంస్కృతీకరించి 'దేవగిరి' అన్నారు. ఈకొండనుండి ఉత్తర దిక్కుగా 50మైళ్ల వరకూ చిన్న చిన్న కొండలు వ్యాపించి ఉన్నాయి. వీటికి ఉత్తర దిక్కు చివరను "చిన్న కిమిడి" అనే ఒక చిన్న పట్నము ఉంది. ఇక్కడి కొండలు అంత ఎత్తుగా ఉండవు. దేవగిరికి చిన్నకిమిడి పట్నమునకు మధ్యను కొండలకు దిగువగా "పెద్దకిమిడి" అనే వేరొక చిన్న పట్నముంది. దేవగిరికి దక్షిణమున 8 మైళ్ళ దూరములోనే "పర్లాకిమిడి" అనే పట్నముంది. ఈ మూడు పట్నముల పేర్లలోను చివరను "కిమిడి" అనే పదాన్ని బట్టి యీ మూడు పట్నాలకు ఏదో సంబంధం ఉన్నదని మనకు తెలుస్తూనే, ఉన్నది. "కిమిడ్" అనగా ఏకైక అనిన్నీ, "డియా" అనగా నడుముగల అనిన్ని, "బుర్" అనగా కొండ అనిన్ని సవర భాషలో అర్థము. "బుర్" ఎత్తుగా గల పట్నము "పెద్దకిమిడియా" ఎత్తు తక్కువగా గల పట్నము "చిన్న కిమిడియా", "పర్లా" అనే గ్రామమున్నచోట ఉన్నది. "పర్లాకిమిడియా" కొన్నాళ్ళకు చివరనున్న "య"కారము లోపించి పెద్దకిమిడి, చిన్నకిమిడి, పర్లాకిమిడి అనే పేర్లు నిలిచినవి.

సవరలు నివసించే యీ అరణ్య ప్రదేశము చూడడానికి చాలా అందముగా ఉంటుంది. పచ్చని కొండ శిఖరాలు, కొండ వాలులలోనుండి లోయలలోనికి జారిపడే జలపాతాలు, అక్కడక్కడ చదునైన నేలలు, దట్టమైన చెట్లు, ఎత్తైన రాతి బండలు, గలగల మని ప్రవహించే సెలయేళ్లు చూడ ముచ్చటగా ఉండాయి.

చెట్లులేని కొండలమీద ఏటవాలుగా ఉన్నచోట్ల సవరలు పచ్చని చెట్టి మొక్కలను కాల్చి కందులు, జొన్నలు మొదలయిన మెట్ట పంటలను పండించుకుంటారు దీనినే పోడు వ్యవసాయ మంటారు. అన్ని కాలములలోను ప్రవహించే ఊటగెడ్డల నీటితో, వరి, చోడి, మొదలయిన పంటలనుకూడా వీరు పండిస్తారు. కొండవాలులలోని యీ చేలు పచ్చని డాబాపైని మరియొక పచ్చని డాబా ఉన్నట్టు కనబడతాయి. మామూలుగా పెరిగే మామిడి, చింత, వేప మొదలయిన చెట్లే కాకుండా యీ కొండలమీద ఏగిస, టేకు వంటి పెద్ద పెద్ద చెట్లుకూడాఉన్నవి. సవరలు నివసించే ఈ అరణ్య ప్రదేశమంతా నిత్యము పచ్చగానే ఉంటుంది. మొక్క మొలవని గొడ్డునేల అంటూ లేనేలేదు.

ఈ కొండల పైని అడవులలో వెళ్తూఉంటే ఏ తుప్పలలో నుండయినా ఒక చిఱుతపులి మన మీద పడవచ్చును ఏ తాచు పాము అయినా మన పాదాలమీదనుండి పాకి పోవచ్చును. చిన్న చిన్న జంతువులనే కాదు మనుష్యులనే మింగేటంత పెద్ద కొండ చిలువలమీదనుండి మనమే తెలియక నడచిపోవచ్చును. "గోళ్లతో చీల్చేస్తాను" అన్నట్టుగా మనమీదకు ఏ ఎలుగుబంటి అయినా రావచ్చును దుమ్మలగుండు వచ్చి మనలను వెక్కిరించి పోవచ్చును

ముద్దు వచ్చే చిన్న చిన్న చెవుల పిల్లులు గుంపులు గుంపులుగా మన ముందరనుండే పరుగెత్తుకు పోతూఉంటాయి మందలు మందలుగా లేళ్లూ దుప్పులూ మనలను చూసి భయపడి పరుగెత్తు కుంటూ పోతాయి. చెట్లమీద కోతులు మనకు యివ్వకుండా మనల్ని ఊరిస్తూ మంచి మంచి పండ్లను తింటూ ఉంటాయి మనిషి అంత ఎత్తున నల్లగా దెయ్యాల్లాగ చెట్లమీదనుండి తేనెపట్లు వేలాడుతూ ఉంటాయి. ఈ సవరదేశములోని వారిని ఒకసారి పలకరించి పోదా మన్నట్టు ఉత్తరదిశనుండి పెద్దపులులు అప్పుడప్పుడు వచ్చి మళ్ళీ పోతూఉంటాయి.

ఇటువంటి అడవులలో సవరలు చిన్న చిన్న పల్లెలు ఏర్ప రచుకుని నివసిస్తున్నారు కొండవాలులలో నీటివసతి నిత్యము ఉండేట్టు ఊటగెడ్డలకు దగ్గరగా చదునైన నేలలను చూసుకుని వీరు ఇళ్లు కట్టుకుంటారు, ఈ గ్రామాలు దట్టమైన అడవులలో చెట్ల మధ్య కనబడకుండా ఉంటాయి. గ్రామాలలోనికి వెళ్లడానికి కొత్త వారికి తోవకూడా తెలియక పోవచ్చును గ్రామాలలోని యిండ్ల వరుసలు ఎలా పడితే అలాగే ఉంటాయి. మరీ చిన్న గ్రామ మయితే ఒకే వీధికి యిటూ అటూ కొన్ని యిళ్లు మాత్రమే ఉంటాయి

సవరలు కట్టుకునే యిండ్లు చాలా చిన్నవి మహా ఉంటే 12 అడుగుల పొడవు. ఆరు అడుగుల వెడల్పు ఉంటుంది ఇంటి వెన్ను 8 అడుగుల ఎత్తున ఉంటుంది. వీధి గోడ. పెరటి గోడా ఆరు అడుగుల ఎత్తున ఉంటాయి. వెనుకా ముందునా ఉండే చూరు నాలుగు అడుగుల ఎత్తున ఉంటుంది వీధిగుమ్మం గోడకు కుడి పక్కన పెట్టుకుంటారు. పెరటి గుమ్మం అంటూ ఉంటే అది వీధి గుమ్మానికి ఎదురుగానే ఉంటుంది. వీధిలో అరుగు ఉంటుంది. ఆ అరుగు కింద కోళ్లు ఉండడానికి గూడు ఉంటుంది.

ఇంట్లో కుడివైపు గోడకు ఆనుకుని వీధిగుమ్మానికి ఎదు రుగా ఒక తిన్నె ఉంటుంది. దానిమీద నీళ్లకుండలను వీరు ఉంచు కుంటారు.

ఆ తిన్నె పక్కన వడ్లు మొదలైనవి దంచుకొనడానికి కర్రరోలును నేలలో పాతుతారు. దీనికి చేరువలోనే బాగా అలికిన గుంట ఉంటుంది దీంట్లో మిరపకాయలు మొదలయినవి దంచు కుంటారు. ఇంటి వెన్నుకు ఆధారంగా యింటి మధ్యను ఒకరాట ఉంటుంది. పెరటి గోడకు చేరువగా పొయ్యి పెట్టుకుంటారు ఈ పొయ్యిలోని నిప్పును సంవత్సరానికి ఒక్కసారే మారుస్తారు. ఫాల్గున పౌర్ణమి మరునాడు అంటే ఉగాదినాడు యీ పొయ్యిలోని పాత నిప్పును తీసేసి. మళ్లా పొయ్యను అలికి కొత్తనిప్పును వీరు వేస్తారు, ఆనిప్పు వచ్చే సంవత్సరాది వరకూ ఆరకుండా ఉండాలి. ఇంటిలో ఎడమ వైపున 4 అడుగుల ఎత్తున చిన్న అటక వంటిది ఒకటి ఉంటుంది. ఈ అటక కింద వండుకునే పొయ్యిని ఏర్పరచు కుంటారు. అటకమీద వడ్లు మొదలైనవి ఉంటాయి ఈ అటక కింద పొయ్యికి పైన మరోచిన్న అటక ఉంటుంది. దానిమీదను ఆ రోజుకు వండుకునే ధాన్యం ఉంచుకుంటారు. పొయ్యిమీద ఎసరు మరుగుతూ ఉంటే ఆధాన్యాన్ని అప్పటికప్పుడు దంచుకుని అన్నం వండుకుంటారు ఇంకో కుండతో ఆకు కూరల పులుసు గాని, ముక్కల పులుసును గాని వండుకుంటారు పొయ్యిమీది అటకలను పేడ మన్ను కలిపి బాగా అలుకుతారు గనుక పొయ్యి మంటకు అవి అంటుకోవు. ఇంతేకాదు పొయ్యిమంటకు యిల్లు అంటుకో కుండా అవి కాపాడుతాయి

ధాన్యం దంచుకొనడానికి రాతిబండలను వారు ఉపయోగి స్తారు, అంతకన్న రాతితో చేసినవి మరేవి సవరల యింట్లో

ఉండవు. వారువాడుకునే పాత్రలు అబకలు, గరిటెలు అన్నీకూడా ఆనప తుంబలతో చేసుకున్నవే ఆనప బుఱ్ఱలఅడుగున మన్నును దట్టముగామెత్తి వాటితో వంటకూడా చేసుకునేవారు. ఇప్పుడిప్పుడు పల్లపు ప్రదేశాలకు వచ్చి అక్కడనుండి వంట చేసుకొనడానికని కుండలు కొనుక్కొని తీసుక వెళుతున్నారు.

ఇంటి వెలుపలిగోడల పైభాగంమీద ముగ్గుల్లాగ ఏదో తెల్లగీతలు గీస్తారు ఇంట్లో గోడలమీద వారిమతమునకు సంబంధముగల పక్షులు, జంతువులు, మనుష్యులు, చెట్లు మొదలయిన వాటి చిత్రాలు ఉంటాయి.

సవరదేశమునకు ఉత్తరమున కోదులనే యింకొక తెగ అడవిజాతివారు ఉన్నారు. వీరు ఎక్కువగా గంజాం జిల్లాలోని బల్లిగూడా తాలూకాలో ఉన్నారు. వీరి ప్రాంతముకూడా సవర దేశమువలనే ఉంటుంది. వీరిపల్లెలుకూడా సవరపల్లెలులాగే ఉంటాయి. కాని వీరియిండ్లు సవరలయిండ్లకంటే కాస్త పెద్దవిగా ఉంటాయి. వీరి వేష భాషలుకూడ సవర వారి వేషభాషల వలెనే ఉంటాయి. వీరి భాషపేరు 'కూయి'

సవరదేశమునకు దక్షిణమున విశాఖ, తూర్పుగోదావరి, బస్తరు. తెలంగాణ అడవులలో కోయలు అనే మరొక కొండ జాతివారు ఉన్నారు. వీరిభాషకూడ 'కూయి' యే. వీరిభాషకు కోదు భాషకు కాస్త భేదంలేకపోలేదు. ఈ కోయవారిలో తెలుగుమాట్లాడే వారుకూడాఉన్నారు. వీరిభాషలో తెలుగుమాటలు చాలా ఉన్నాయి.

## వాతావరణము

సవరలు నివసించే దేశము సుమారు 1000 నుండి 4000 అడుగుల ఎత్తువరకు ఉండడము వలన పల్లపు ప్రదేశాలకన్నా చాలా చల్లగా ఉంటుంది. జూన్ నెల మధ్యలో వర్షాలు పడడం ప్రారంభిస్తాయి. నవంబరు వరకూ యీ వర్షాలు తరచుగా పడుతూనే ఉంటాయి. సంవత్సరం మొత్తంమీద ఎంత వర్షము పడుతున్నదో కొలవడానికి తగిన ఏర్పాట్లు లేకపోయినా మొత్తంమీద చాలా ఎక్కువే. ఎలా లేదన్నా 80 అంగుళాల వర్షం పడుతుందని కొంత మంది అంచనా వేశారు. నవంబరు మాసం అఖరులో శీత కాలం ప్రారంభమవుతుంది. ఫిబ్రవరి వరకూ చలిగానేఉంటుంది. ఈ మధ్య కాలంలో చలి విపరీతంగా వుంటుంది శీతాకాలంలో ఆకాశం మేఘాలు లేకుండా నిర్మలంగా ఉంటుంది. పగటిపూట ఎండవల్ల వెచ్చగాఉండి బాగుగా ఉంటుంది. మార్చినెల మధ్యలో ఎండాకాలం ప్రారంభమవుతుంది. అందువల్ల ఫిబ్రవరి, మార్చి మాసాలలో ఆ కొండలమీద వాతావరణం చాలా హాయిగా ఉంటుంది. ఆ కాలంలో ఆ కొండల మీద వెళ్ళి ఉంటే ఎంతో బాగుటుంది. మంచి ఎండా కాలంలోకూడా మనకు అక్కడ ఎండ అనిపించదు. నవంబరు నుండి మే వరకూ వర్షాలు ఉండవు. కనుక సవరలు వెన్నెల రాత్రులలో వేడుకలు వినోదాలు జరుపుకుంటారు.

## బట్టకట్టు-అలంకరణ

సుమారు రెండు వందల సంవత్సరాలకు పూర్వం సవరలు బట్ట కట్టుకుని ఎరుగరు. ఏవో చెట్టు పట్టలు, పెద్ద ఆకులు మాత్రం మొలకు చుట్టుకునేవారు. తర్వాత వీరికి పైడివారితో పరిచయం కలిగి ముతకబట్టలు కట్టుకొనడం వారివద్దనుండి నేర్చుకున్నారు. నాలుగు అడుగులు పొడుపు రెండు అడుగుల వెడల్పు గల ముతకబట్టను సవరస్త్రీలు మొలకు చుట్టుకుంటారు. తొమ్మిది అంగుళముల వెడల్పు, మూడు అడుగుల పొడవు ఉండే ముతక బట్టను మొలకు చుట్టుకుని గోచీగా పెట్టుకుంటారు మగవాళ్ళు. మరొక పెద్ద గుడ్డను, గాలికి, చలికి తట్టుకొనడానికని ఆడవాళ్లు, మొగవాళ్లుకూడా పైబట్టగా వేసుకుంటారు. కొంతమంది మగ వారు కొన్ని గుడ్డపీలికలను జుత్తు కనబడకుండా కోసుగా తలకు చుట్టుకుని, వాటిపైన కాస్త పెద్ద గుడ్డను, ఎర్రరంగువి గాని పసుపు పచ్చది గాని చుట్టుకుంటారు. మగవారు కట్టుకునే గోచీ గుడ్డ, ముందర వేలాడే అంచు సాధారణముగా ఎర్రగా ఉంటుంది. ఆ కొన దారాలతో కుచ్చుగా ఉంటుంది. సవరలలో కొంతమంది వెనుకకు వచ్చే కొనను గూడా వేలాడ వేస్తారు. కాని చాలా మంది వేలాడ వేయకుండా దోపుకుంటారు. ముసలివాళ్లు, బీద వాళ్ళు మాత్రం చిన్న గోచీ గుడ్డనే కట్టుకుంటారు ఆ గుడ్డ ముందునుండి వెనుకకు వచ్చి, నడ్డికి ఒక చుట్టు వస్తే వారికి చాలును అవసరమును బట్టి తాహతును బట్టి, హోదాను బట్టి వారి తలగుడ్డ మారుతుంది. బీదవాడైతే కనీసం 6 అంగుళముల వెడల్పు నాలుగు అడుగుల పొడవు గల ఏ బట్టనైనా తలచుట్టూ జుత్తును కప్పుతూ చుట్టుకుంటాడు తాహతు, హోదా ఉన్నవారు మరి కాస్త పెద్దదిగా ఉండే రంగు గుడ్డను చుట్టుకుంటారు. నాగరికుల పరిచయమున్నవారు కొంతమంది మన పూర్వుల తలపాగాల్లాగ పెద్ద తలపాగాలు చుట్టుకొనడానికి సరదా పడతారు. ఎక్కడికైనా వెళ్ళేటప్పుడు మాత్రం కప్పుకొనడానికని గాని పరచుకొనడానికనిగాని పైగుడ్డను కావుదలగా వీపు మీసుకు వెళ్తూ ఉంటారు

పండుగ దినములలో రంగు గుడ్డలు కట్టుకుని తలపాగాలలో పక్షుల యీకలను పెట్టుకుని అందంగా కనబడాలని అలంకరించు కుంటారు.

సవరదాని బట్టకట్టు తమాషాగా ఉంటుంది. రెండు అడుగుల వెడల్పు నాలుగు అడుగుల పొడవు మాత్రమే ఉండే గుడ్డను మొలకు చుట్టుకుంటుంది. తొడలు, పిర్రలు కనబడకుండా కప్పడానికే ఆగుడ్డ పనికి వస్తుంది. మొలకు పైభాగం, మోకాళ్ళకు దిగువ భాగం వారు కప్పుకోరు. మగవారు ఉపయోగించేటట్టే ఆడవారుకూడా పైగుడ్డ నొకదానిని వేసుకుంటారు. చంటి పిల్లల తల్లులయితే ఆ పైగుడ్డను చంకలలో నుండి తీసి, భుజంమీద ముడి వేసి బిడ్డకు ఉయ్యాలగా ఆ గుడ్డను తయారు చేసి అందులో పడుకోబెట్టి తీసుకుపోతారు రొమ్ముమీద ఆ గుడ్డ ఉండాలనే బాధ వారికి లేదు. ఈనాటికీ సవరస్త్రీల మన పట్నాలకు, పల్లెలకు వచ్చినా రొమ్మును కప్పుకొనడం లేదు. వారి గ్రామాలలో ఉన్నప్పుడు పైగుడ్డ ఉండనే ఉండదు. పండుగ దినాలలో మాత్రం కిందిగుడ్డా పైగుడ్డా మంచివి వేసుకుంటారు. తల బాగా దువ్వుకుని బాగా తయారవుతారు.

ఆడవారు తలకు గుడ్డ చుట్టుకోరు, కాని బాగా అలంకరించుకుంటారు. అవిసె, కాగు గింజల నూనెను రాసుకుని తల దువ్వుకుంటారు. ఎడమవైపున కొప్పు పెడతారు. కొప్పు జారి పోకుండా ఉండడానికని ఇత్తడి పిన్నును పెట్టు కుంటారు. ముందుండే ముంగురులు ముఖము మీద పడకుండా మీదకు దువ్వి నడినెత్తిన ఎత్తి కడతారు. నల్ల గుడ్డపేలికను గాని నల్లరంగు వేసిన నారను గాని, చెట్టుపట్టను గాని జుత్తు ముడి వేయడానికి ఉపయోగిస్తారు ఇత్తడి గొలుసులను, పువ్వులను తలకు ఆభరణాలుగా ప్రతి సవరస్త్రీ పెట్టుకుంటుంది తలకు చెరియొక పక్కా సన్నని యిత్తడి గొలుసులను పెటుకుంటుంది. అవి తోరణాల లాగా వేలాడుతూ ఉంటాయి ఇత్తడి పువ్వులకు మన స్త్రీలు ధరించే చేమంతి పువ్వులకు ఉన్నట్టే తీగమరలు ఉంటాయి వాటిని జుత్తులో దూర్చి తిప్పితే ఆ పువ్వులు పడిపోకుండా ఉంటాయి సవరదాని చెవికి తమ్మినుండి మీది వరకు అంచున 15, 20 కుట్లు ఉంటాయి. ప్రతి కుట్టుకు ఒక ఇత్తడి చుట్టు ఉంటుంది. చెవి తమ్మిని కుట్టించిన నాటి నుండి ఆ కుట్టును రోజురోజుకు పెద్దదిగా చేయాలని జీలుగు బిండలు పెట్టుకుని నీళ్లుపోసి తడుపుతూ ఉంటారు తడివల్ల జీలుగు బిండ రోజురోజుకూ ఉబ్బి పెద్దదగుతూ చెవి తమ్మికి పొడిచిన రంధ్రమును పెద్దదిగా చేస్తుంది. తర్వాత ఆ జీలుగు బిండలో తరచుగా ఒక్కొక్క సన్నని చీపురు పుల్లను గుచ్చుతూ పోతారు అలాగున ఓపికతో ఒక్కొక్క చీపురుపుల్లను అదనంగా పెడుతూ ఆ రంధ్రమును ముంజేయి దూరేటంత పెద్దదిగా చేస్తారు ఆ రంధ్రము ఎంత పెద్దదయి అందులో పెట్టుకున్న ఆభరణం యొక్క బరువుకు ఆ చెవి తమ్మి ఎంత సాగితే అంత అందమని వారి నమ్మకము తమ్మి కొనలు బాగా సాగిపోయి భుజాలకు తగలడం కొంతమందిలో మనం చూడవచ్చు. ఆ రంధ్రములో కేరమ్ము బిళ్ళవంటిది ఆభరణముగా పెట్టుకుంటారు. ఇటువంటి అలంకరణ మలయాళ స్త్రీలలోకూడా ఉన్నది.

పండుగా పర్వంవస్తే రకరకాల గొలుసులు, పూసల పేర్లు సవర స్త్రీలు అనేకంగా వేసుకుంటారు గాజు పూసలు, ఎర్ర గురివెంద గింజలు, పగడాలు మొదలయినవి ఒక పొడుగు పాటి తీగకు గుచ్చి ఆ తీగను రొమ్ముల మీద నుండి పీకవరకు మెడలో చుట్టుకుంటారు. మగవారు కూడా స్త్రీలలాగే మెడలో యిటువంటి పూసల పేర్లు వేసుకుంటారు. గాని ఆడవారే ఎక్కువ పేటలు వేసుకుంటారు. స్త్రీలు మొలకు నల్లటి గాజు పూసలను యిరవై ముప్పై వరసలు వచ్చేటట్టు ధరిస్తారు.

మోచేతులకు యిత్తడితోగాని, ఎల్యూమినమ్‌తో గాని చేసిన కంకణాలను వీరు ధరిస్తారు. వాటి మీద అందమైన నక్షీలను చెక్కుస్తారు. రెండు మూడు జతల ఇత్తడి గాజులను కూడా తొడిగించుకుంటారు. ఒకొక్క చేతికి నాలుగేసి లోహపు చుట్లు వేళ్లకు ఉంటాయి. కాళ్లకు లోహపు కడియాలు, కాలి వేళ్లకు పిల్లేళ్ల పెట్టుకుంటారు. మధ్యవేళ్లకు ధరించే పిల్లేళ్లకు పైన బిళ్లలు ఉంటాయి. గ్రామ పెద్ద అంటే 'గొమాంగ్' భార్య హోదా తెలియజేయడానికి అన్నట్టు కాళ్లకు పెద్ద కడియాలను ధరిస్తుంది.

ఇత్తడి నగలను, యితర ఆభరణాలన్నిటినీ సవరలు దిగువ ప్రాంతాలలోని బజారులలో కొంటారు ఇత్తడి నగలను సవరలలో ఒక జాతి వారు తయారు చేస్తారు. ఇప్పుడిప్పుడు కొంత మంది సవరలు వెండి నగలను కూడా చేయించుకుంటున్నారు.

పండుగ దినాల్లో బృందనృత్యములు జరుగాతాయి. ఆ నృత్యాలలో పాల్గొనే యువకులు ప్రత్యేకమయిన శ్రద్ధ తీసుకుని అలంకరించుకుని అందగా తయారు అవుతూ ఉంటారు. తమ అలంకరణతో యితరులను ముఖ్యంగా యువతుల్ని ఆకర్షించాలని ప్రయత్నిస్తారు. తమ తలపాగాలలో పక్షి యీకల్ని, నెమిలి

కనుల్ని తురాయిల్లాగ అమర్చుకుంటారు. వారు నడుస్తున్నా నృత్యం చేస్తున్నా ఆ తురాయి ఊగిసలాడుతూ వారికి అందాన్ని చేకూరుస్తుంది. జుత్తుముడి నిటారుగా నిలబడడానికని, యిత్తడితో చేసిన దానిని కాని, కర్రతో చేసినది కాని ఒక అట్ల కాడవంటిది తన తలపాగలో అమర్చుకుంటాడు సవరవాడు

ప్రతి సవరవాడూ చెవులను కుట్టించుకుంటాడు. చెవికి రెండేసి కన్నాలు ఉంటాయి తమ్మెకి ఒక కుట్టు పైచెవి అంచు పైని ఒక కుట్టు కుట్టించుకుంటారు. మీది కన్నాలలో నుండి సన్నని యిత్తడి గొలుసులను వేలాడ వేసుకుంటారు. ముక్కుకు కుడివైపు కుట్టించుకుని, చిన్న యిత్తడి చుట్టును తగిలించు కుంటారు.

మెడలో ఎల్యూమినమ్‌తో చేసిన కంటెగాని నికెల్‌తో చేసినకంటెగాని సవరవాడి మెడలో సాధారణంగా కనబడుతుంది. పూసల పేర్లు కూడా ఉంటాయి. నాలుగైదు యిత్తడి గొలుసులు కూడా మెడలో ఉంటాయి. పూసల పేర్లు యిరవై ముప్పయి వరకూ ఉంటూ ఉంటాయి. చేతివేళ్లకు రెండు మూడు చుట్లు కూడా ఉంటాయి.

పచ్చబొట్లు పొడిపించు కొనడానికి సవరవారిలో ఆడా మొగా కూడా సరదా పడతారు. కాని జయపురం కొండల మీద నుండే పొరి జాతులాగ, కోల్, ముండా కొండజాతుల వారిలాగ మరీ ఎక్కువగా పచ్చబొట్లు పొడిపించుకోరు. ముఖం మీద, రొమ్ము మీద, ముంజేతుల మీద, జెబ్బలకు వెలుపలి వైపున, కాళ్ల మీద, పాదాలమీద ఆడ పిల్లలు విధిగా పచ్చబొట్లు పొడి పించుకోవాలి. ఏ ఏ బొమ్మలు వేయించుకోవాలి అన్నది వారి వారి యిష్టం మీద ఆధారపడి ఉంటుంది నుదిటి మీద అడ్డంగాను, నిలువుగానూ కూడా పచ్చబొట్టు పొడిపించుకుంటారు. ముక్కు పైని నుదిటి మీద నిలువు గీత మాత్రం ఉంటుంది. ఆ గీతకు యిటూ అటూ సమానంగా పచ్చబొట్టు వేయించుకుంటారు. మధ్య నుండే గీతకు బదులు బొట్టులాగ ఒకే చుక్కను పొడిపించుకునే వారు కూడా లేకపోలేదు ముక్కుకు పొడుగునా నిలువు గీత పెట్టించుకునే వారు కూడా ఉన్నారు. బుగ్గల మీద కొందరు బొట్లు పొడిపించుకుంటారు.

రకరకాల పువ్వులను, నెమలి, పావురము, గువ్వ మొద లయిన పక్షుల బొమ్మలను, కోతి, పులి మొదలయిన జంతువుల బొమ్మలను కొంత మంది ముంజేతి లోపలి వైపున వేయించు కుంటారు. వివిధ రకాల లతలను పాదాల మీద చేతులపైన, చిన్న చిన్న సున్నాలను, చుక్కలను, చిన్న గీతలను చేతి వేళ్ల మీద, కాలి వేళ్ల మీద పొడిపించుకుంటారు.

పచ్చ బొట్లు పొడిపించుకొనడం సవరలలో ఒక ఆచార మయింది. గాలి సోకకుండా, దెయ్యాలు, భూతాలు పట్టుకోకుండా పచ్చబొట్లు వారిని కాపాడతాయని వారిలో కొంత మందికి నమ్మ కము కూడా ఉన్నది ఏమైనా పచ్చబొట్లు అందాన్ని యిస్తాయని సవరవారు భావిస్తారు

పచ్చబొట్లు పొడిపించుకునే ఆచారం కోయలు, కోదులు మొదలయిన కొండ జాతి వారిలోనే కాక మన వారిలో కూడా ఉంది

వృక్ష సంబంధమైన రంగును, మసి బొగ్గును, నూనెతో కలిపి ముద్ద సేసి, ఆ ముద్దను సూదులతో గాని ముళ్లతో గాని పొడిచి అద్దుతారు సవరవారు.

## తిండి

సవరలకు తిండినిగురించి బెంగలేదు. కష్టపడివ్యవసాయము చేసికొని ఏదో రకము ధాన్యము పండించుకుంటారు. వేటాడి జంతువులను చంపి వాటిని తింటారు. కష్టపడ కుండానే వారికి కొన్నికాల కాయగూరలు లభిస్తాయి. నేలకాస్త తవ్వితే దొరికే అనేక రకముల దుంపలు వారికి లభిస్తాయి వారికి తిండికొరతలేదు బిచ్చము ఎత్తుకో వలసిన అవసరము వారికిలేదు. ఏగుడ్డివాడో, ఏకుంటివాడో, ఏముసలివాడో మాత్రము బిచ్చమెత్తుకుంటే బిచ్చ మెత్తుకొంటాడు.

సవరలకు తినడానికి కావలసిన వన్నీ వారు నివసించే కొండల మీదనే దొరుకుతాయి. ఒక్క ఉప్పు, ఎండు మిరప కాయలు మాత్రం కొండలకు దిగువనుండే పల్లెలలోను, పట్నాల లోను కొనుక్కుంటారు. కొండల మీద లభించే వంట చెరుకును, తేనె, చింతపండు మొదలయినవి తీసుకుపోయి పల్లెలలోను, పట్నాలలోను అమ్ముతారు. ఆ వచ్చిన సొమ్ముతో వాళ్ల తిండికి కావలసిన ఉప్పు, మిరపకాయలనే కాక, కట్టుకునే గుడ్డలను అలంకరించుకొనే పూసలను, మొదలయిన వాటిని కొనుక్కుంటూ ఉంటారు పూర్వం, వారు తెచ్చిన దినుసులను యిచ్చి వాటికి

( 37వ పేజీ చూడుడు )

# పారిశ్రామిక విశేషాలు

## ( 1961 అక్టోబరు )

(రాష్ట్ర పారిశ్రామిక రంగంలో అనుదినం అభివృద్ధిపథకాలు ప్రవేశ పెట్టబడుతున్నాయి. పారిశ్రామికవేత్తలు, ప్రజలు వాటిని గురించి తెలుసుకోటం అవసరం అనే దృష్టితో ముఖ్య పారిశ్రామిక విశేషాలు ఈ శీర్షిక క్రింద ఇవ్వబడుతున్నాయి.)

హైద్రాబాదు సనత్‌నగర్‌లో సింథటిక్ డ్రగ్స్ ఫ్యాక్టరీ స్థాపనకు ఏర్పాట్లు చురుగ్గా జరుగుతున్నాయి. ఈ ఫ్యాక్టరీ బహుశా 1964వ సంవత్సరంలో ఉత్పత్తి ప్రారంభిస్తుంది. దీనిలో సుమారు 3,000 మందికి ఉద్యోగావకాశం వుంటుంది. నవంబరు 3వ తేదీన రష్యన్ నిపుణులు రాజధానికి వచ్చినప్పుడు సనత్‌నగర్‌లో ఫ్యాక్టరీ కొరకు నిర్దేశించిన స్థలాన్ని సందర్శించారు.

### భారీ విద్యుత్పరికరాల ప్రాజెక్టు

ఈ ప్రాజెక్టు పనులు శీఘ్రగతిని జరుగుతున్నాయి హైద్రాబాదు సమీపంలో రామచంద్రాపురం వద్ద ఫ్యాక్టరీకి కావలసిన 6,000 ఎకరాల భూమిని స్వాధీనపర్చుకోటానికి చర్యలు తీసుకుంటున్నారు. ప్రారంభ పనులను త్వరితగతిని అమలు పరిచే నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం కొందరు ఇంజనీర్ల ఉద్యోగ సేవలను ప్రాజెక్టుపరం చేసింది.

### ప్రభుత్వ రంగం

హంగరీ నిపుణులు, భారత ప్రభుత్వ డెవలప్‌మెంట్ ఆఫీసరు (గాజు, సెరామిక్స్)తో కలిసి ఇటీవల స్థానిక ఫ్యాక్టరీలనూ, ఏకీకృత గాజు ప్రాజెక్టును నెలకొల్పటానికి అనువైన ఇతర స్థలాలను సందర్శించారు. వారు తమ ప్రారంభ నివేదికను సిద్ధం చేశారు. అంతిమ నివేదికను సమర్పించటానికి బహుశా రెండు నెలలు పట్టవచ్చు.

### ప్రైవేటు రంగం

1951 వ సం.పు పరిశ్రమల (అభివృద్ధి, క్రమబద్ధం) చట్టం క్రింద భారత ప్రభుత్వం దిగువ లైసెన్సులు మంజూరు చేసింది:—

1. పశ్చిమ గోదావరి జిల్లాలో గోధుమ రవ్వ, పిండి మిల్లు నెలకొల్పటానికి లైసెన్సు లభించింది. ఇది రోజుకు 50 టన్నుల గోధుమను విసరకలుగుతుంది.

2 33 కి.వా. మొదలు 5000 కి వా. వరకు వివిధ సైజులలో ట్రాన్స్‌ఫార్మర్లనూ, 11 కి వా మొదలు 2,000 ఆ వరకు వివిధ సైజుల సర్క్యూట్ బ్రేకర్లతో సహా స్విచ్ గేర్లను ఉత్పత్తి చేయటానికై విశాఖపట్నంలో ఒక కర్మాగారాన్ని స్థాపించటానికి లైసెన్సు ఇవ్వబడినది.

3. ఎలక్ట్రిక్ మీటర్లను ఉత్పత్తి చేసే యంత్రాగారాన్నొకదానిని విశాఖపట్నంలో స్థాపించటానికి కూడా లైసెన్సు లభించింది. దీనిలో సంవత్సరానికి 78,000 మీటర్లు ఉత్పత్తి కాగలుగుతాయి.

4. పోత ఇనుప కడ్డీల ఉత్పత్తికై హైద్రాబాదులో ఒక ఫ్యాక్టరీని నెలకొల్పటానికి లైసెన్సు జారీ చేయబడినది.

పిండి మిల్లుల శక్తిని హెచ్చించటానికి పెట్టుకున్న దరఖాస్తులనూ, క్రిమి సంహారక ఉపకరణములనూ, కిల్‌సైట్‌ను ఉత్పత్తి చేసేందుకు కర్మాగారాల స్థాపనకై పెట్టుకున్న దరఖాస్తులను కూడా రాష్ట్ర ప్రభుత్వం సిఫార్సు చేసింది.

### నిజాం చక్కెర ఫ్యాక్టరీ

నిజాం చక్కెర ఫ్యాక్టరీ లిమిటెడ్ విస్తరణ కార్యక్రమం చురుగ్గా అమలు జరుగుతున్నది. రెండవ యంత్రం బహుశా 1961 నవంబరులో పని ప్రారంభిస్తుంది. ఫ్యాక్టరీ కాలనీలోనూ, క్షేత్రంలోనూ ఇండ్లు నిర్మించే పని కూడా త్వరితంగా జరుగుతున్నది.

వేతనాల బోర్డు సిఫార్సుల ప్రకారం జీతాలు చెల్లించటానికి ఫ్యాక్టరీ నిర్వాహకులు ఏర్పాట్లు చేశారు.

## సింగరేణి కాలరీస్

తృతీయ ప్రణాళికా కాలంలో కాలరీల విస్తరణ కార్యక్రమానికై ఋణ సహాయం క్రింద 1961–62 వ సంవత్సరంలో పాక్షిక చెల్లింపుగా భారత ప్రభుత్వం ఒక కోటి రూపాయలు మంజూరు చేసింది.

ఈ కాలరీలలో ఉత్పత్తి పరిస్థితి ఉచ్ఛ స్థితిలో వుంది. 1961 సెప్టెంబరు మాసాంతం వరకు 20,00,024 టన్నుల ఉత్పత్తి జరిగింది. కాగా గడచిన సంవత్సరం ఇదే కాలంలో జరిగిన ఉత్పత్తి 18, 03,196 టన్నులు.

## లఘు పరిశ్రమలు

విజయవాడలోని పారిశ్రామిక వాడల విస్తృతీకరణకు ప్రభుత్వం రూ. 8 లక్షలు మంజూరు చేసింది. వర్తమాన ఆర్థిక సంవత్సరములో ఈ కార్యక్రమానికి రూ 0.20 లక్షల వ్యయం పరిమితం చేయబడినది. యంత్ర పరికరాలు, విడిభాగాల ఉత్పత్తికి హైద్రాబాదులో ఒక కర్మాగారాన్ని నెలకొల్పటానికీ,ఆటో మొబైల్ సర్వీసింగ్, రేడియో సర్వీసింగ్‌లలో స్వల్పకాలికశిక్షణ పథకాన్ని అమలు పరచటానికి అవసరమైన స్థలాన్నీ, యంత్రాలను ముడి సరుకులను కొనటానికి ప్రస్తుత ఆర్థిక సంవత్సరములో డబ్బు మంజూరు చేయబడినది. ఈ పథకాలవల్ల హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలోని విద్యావంతులైన నిరుద్యోగులకు ఉద్యోగావకాశాలు ఏర్పడ గలవు.

రాష్ట్రప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ లఘుపరిశ్రమల సలహా మండలిని పునర్వ్యవస్థీకరించింది.

నంద్యాల గ్రామీణ ఎస్టేటులో వ్యవసాయపనిముట్లు అద్దాలను ఉత్పత్తిచేసే రెండు ఫ్యాక్టరీలు పని ప్రారంభించినవి.

1961 నవంబరులో క్రొత్తఢిల్లీలో ప్రారంభం కానున్న భారత పారిశ్రామిక ప్రదర్శనములో నెలకొల్ప బడుతున్న ఆంధ్రప్రదేశ్ మంటపం నిర్మాణం చురుగ్గా జరుగుతున్నది.

ఈ సందర్భంగా చేస్తున్న ఏర్పాట్లను గురించి తెలయజేయటానికై 1961 అక్టోబరు 13 వ తేదీన హైదరాబాదులో ప్రముఖులను ఆహ్వానించారు. లఘుపరిశ్రమలు, ఎక్సైజు శాఖల మంత్రితోసహా అనేక మంది అధికార, అనధికార ప్రముఖులు హాజరయ్యారు. వివిధ ప్రభుత్వ శాఖలు, పారిశ్రామిక సంస్థలకు చెందిన ప్రదర్శన వస్తువులను వారికి చూపించారు

## చేతి పరిశ్రమలు

రాష్ట్ర చేతి పరిశ్రమల సలహా మండలి సమావేశం 1961 అక్టోబరులో జరిగింది. ఏడవ అఖిల భారత చేతి పరిశ్రమల వారోత్సవాల నిర్వహణకై ఈ సమావేశంలో కార్యక్రమాన్ని సిద్ధం చేశారు. 1961 నవంబరు 20 వ తేదీన ఈ సప్తాహం ప్రారంభమవుతుంది.

అఖిల భారత చేతి పరిశ్రమల సంస్థ అధ్యక్షుడు ఈ నెలలో హైదరాబాదుకు వచ్చినప్పుడు ప్రాంతీయ చేతి పరిశ్రమల శిక్షణ సంస్థ భవనానికి శంకుస్థాపన చేశారు

## చర్మకార పరిశ్రమ

చర్మకార పరిశ్రమకై చట్టబద్ధమైన బోర్డును నియమించే వరకు పని చేసేందుకై తాత్కాలిక చర్మకార బోర్డును ప్రభుత్వం నియమించింది. మద్రాసులోని కేంద్ర చర్మ పరిశోధన సంస్థ డైరెక్టరు డా. వై. నాయడమ్మ ఈ బోర్డు అధ్యక్షుడుగా నియమించబడినారు. ఉన్నతాధికార సంఘం బృహత్ప్రణాళికలో చేసిన సిఫార్సుల ఆధారంగా రాష్ట్రంలో చర్మ కార పరిశ్రమాభివృద్ధికై ఈ బోర్డు కార్యక్రమాలనూ, విధానాలను రూపొందిస్తుంది. చర్మ కార పరిశ్రమ డిపార్ట్‌మెంటల్ యూనిట్ల నిర్వహణ, విస్తరణలకు సంబంధించి ఈ బోర్డు ప్రభుత్వానికి సిఫార్సులు కూడా చేస్తుంది. సహకార పద్ధతిలోకాని లేదా వ్యష్టిగాకాని తోలు, తోలు వస్తువుల ఉత్పత్తి, మార్కెటింగ్‌లను నిర్వహిస్తున్న యూనిట్ల విస్తృతీకరణకు క్రొత్తగా అటువంటి యూనిట్ల స్థాపనకు ఋణాలు, గ్రాంటుల ద్వారా ఆర్థిక సహాయంలభింపజేయటానికి కూడా ఈ బోర్డు సిఫార్సులు చేస్తుంది.

# జాతీయైకమత్యము

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

వేరులు వాఱి లౌకిక వివేకములోలి నడంచి సంఘమం
దోరిమి దూరమై యొకని యుద్ధతికే యొకఁ డగ్గమైతిర
స్కార పరాభవాదిక వికారము లెన్నిటినో సృజించి యి
ద్ధారుణి కిచ్చె వాని నొక దారికిఁ దెచ్చుటమేలు గాదొకో!

వానిని మూలముట్టగ వివాదము లేక పెకల్చి శాస్త్రవి
జ్ఞానము సర్వజాతికి నజస్రము తెన్నగ బోధ చేసి దే
శానఁ బ్రశాంతి గూర్పను విచారము దీర్పను దీక్షనిచ్చలున్
బూనఁగఁ బోలు; దానికిఁ బ్రబుద్ధులు కొందఱెదిర్చి వచ్చినన్

తరములనుండి యాఁకలియు దప్పికనైతము విప్పిచెప్పకో
నెఱుఁగని మందభాగ్యు లతిహీనులు పెక్కురు నేఁడు విద్యలోఁ
జొరఁబడి శక్తి యుక్తులను జూపిసుఖప్రదమైన వృత్తిలోఁ
బరువు గడింపరే! యొకఁడె భాగ్యము గుత్తగొనంగఁ బాడియే!

వారొక యంగవైచి నలువైపుల నిబ్బరమైన డెందమే
పారి పరీక్ష కాఁగి తమ భారము తామె భరించుదాఁకన
వ్వారిగ వారికిన్ వలయు వైభవ మేదియుఁగాని యీయఁగాఁ
గోరిన నేడ్తురేల మఱి కొందఱు ప్రాషికబుద్ధి యెంచుచున్

ఒకరుని ముందుఁ జూడఁ దగియున్న తఱిన్ మదినైఁపలేక క
చ్చెకు మునుదూఁకఁగా నదియుఁ జెల్లునె! బిక్క పకీరులైన వా
రికిఁ దగు సాయమేది యొనరించిన దేశము మేలు కూర్చుచున్
సకలము రక్ష సేయదొ నిజంబగు నభ్యుదయంబు కాదొకో!

చీలికవెట్టి సత్త్వమును జిందఱ వందఱఁ జేసి స్వేచ్ఛమై
నేలఁగఁ జాలిరన్నలు సుమీ! యను జ్ఞానము లేదు నీకు; నీ
మూలమునన్ సమస్తము సమూలముగా జిగివోవనున్నయ
వ్వేళ మహాత్ముఁ డెట్టి పరివేదన వొందెనొ యెంచియుంటివే!

ఆంధ్ర ప్రదేశ్

పలువురి రాజకీయముల ప్రాభవమెల్ల నెఱింగివానిలో
పలఁగల మేలు గీళ్లు పొరపాటులు చక్కఁగఁ బాఱఁజుచియా
వలఁ దనజాతికెయ్యది యవశ్యమొ దానికె రేఁబవళ్లువ్యా
కులపడి నిత్యుపాసముల కుంగడగెంగద పెక్కుభంగులన్

మతమును రాజకీయమగు మార్గములోఁ బెనవైచి హైందవ
స్థితికి నపూర్వ హైన్యమును దెచ్చిన సీమ ప్రభుత్వమున్ బరి
స్థితి కనువైన యట్టులొక తీర్పునఁ బెట్టి, పరాధికారదు
ర్గతి యిదిగో నటంచు నెఱుకంగలిగించె మహాత్ము డత్తఱిన్

అది యొక 'యేకు మేకయి' నిరాశ యొనర్పఁ 'బరాయి'యేలికల్
బెదరియు బెగ్గడిల్లియు (దపించియు దారికివచ్చి; రిట్టి యా
పద యుపవాసముల్ జరిపి పాపిన యామహితాత్ము నుద్యమం
బది గురుతింపఁ జాలరుగదా సమయజ్ఞులుగాని హైందవుల్

నలువది కోట్ల మానవులనారత మొక్కటిగా వసింపఁగా
వలయును—జాతినీతి మతవర్గ విభేదము లెన్నరాదు; కా
వలసిన శాంతికిన్ గుదురుపాటు వహించుట మేలటంచు న
గ్గలమగు మిత్రలాభ మెరుఁగంగఁ బ్రబోధ మొసంగె నిచ్చలుఁ

అందలి తత్వ మిట్టిదని యందఱెఱింగి మెలంగిరేని మా
కిందలి పెత్తనంబు భరియింపఁగ నైతియుఁగాదు కావునన్
ముందొక మందువైచి నయమున్ భయమున్ జవిచూపిజాతిలోఁ
బొందును రూపుమాపవలెఁ బోయని వ్యూహము వన్నిరేలికల్



## సవరలు—నివాసం

( 33వ పేజీ తరువాయి )

బదులు వారికి కావలసిన వస్తువులను తీసుకుపోతూ ఉండేవారు ఇప్పుడు మారకం వ్యాపారం చేయడంలేదు. అమ్మడమూ, కొనడమూ నేర్చుకొన్నారు.

కొండలమీద అనువైన చోట దున్ని, పంట పొలాలను తయారు చేసి కందులు, జొన్నలు మొదలయినవి కూడా వడ్లతో పాటు పండించడం వారికి తెలుసు. పంట పొలాలు లేనివారు కర్రలు కొట్టి, దుంపలు తవ్వి, పసుపు, అడ్డాకులు మొదలయిన ఆటవిక సంపదను అమ్మి వారి పొట్ట పోషించుకుంటున్నారు. గతిలేనివారు యితర సవరల వద్ద కూలికి పనిచేసి, వాళ్ల పశువులను మేపి, పంట పొలాలకు కాపుండి, డబ్బు సంపాదించి జీవిస్తున్నారు. సవరలు వేటలో నిపుణులు. వారికి కావలసిన వ్యవసాయపు పనిముట్లను, వారి ఆయుధాలయిన విల్లును, అమ్ములను, గండ్రగొడ్డలిని, మొలకత్తిని యితర ఆయుధాలను వారే తయారు చేసికొనగలరు.

శ్రీకాకుళం జిల్లా:

# "పాత్రపడ"లో ఆదర్శ పాఠశాల

శ్రీ కందుకూరి కాశీవిశ్వనాథం

"ఆదర్శ" గ్రామమనగా అన్ని రంగములలోను అభివృద్ధి చెంది గ్రామస్థులకు కావలసిన కనీసపు సౌకర్యములు గ్రామస్థుల యొక్క స్వయం కృషి వలన కలుగజేసికొని సంతోష సంభ్రమములతో కళకళలాడుచున్న గ్రామమని సహజముగా మన మనుకొనుచుందుము. ఇది సహజమే కావచ్చు, కాని యీ దిగువ మదహరింపబడు గ్రామము మరియొక ప్రత్యేక రీతిలో "ఆదర్శ" గ్రామముగ యితర గ్రామములకు దారి చూపుచున్నది.

ఇదియొక కుగ్రామము. సుమారు నలుబదియైదు ఇండ్లకన్న యెక్కువ లేవు. గ్రామమునకు చేరుటకు సరియైన బాట లేదు. బండిదారి అసలే లేదు. ఒక చిన్న చిట్టడవి మధ్యనున్నట్లుండును. గ్రామప్రజలందరు "ఒరియా" భాష మాట్లాడుదురు ఆంధ్ర ప్రదేశ్‌లో చిట్టచివరి జిల్లాయైన శ్రీకాకుళం జిల్లాలోని సోంపేట పంచాయితీ సమితిలో చేరిన ఒక చిన్న గ్రామమిది. ఇక్కడివారు తమ పిల్లలకందరకు ప్రాంతీయ ప్రధాన భాషయైన "తెలుగు" భాషనే నేర్పించుటకు ప్రత్యేక కృషి సల్పిరి. వారి కృషి ఫలితముగ సోంపేట పంచాయితీ సమితివారు యీ చిన్న గ్రామములో నొక యేకోపాధ్యాయ ప్రాథమిక పాఠశాలను మంజూరీ చేసిరి.

గత సంవత్సరము జూలై నెలలో పంచాయితీ అధ్యక్షులైన శ్రీ గవ్ని పద్మనాభరావుగారిచే యీ పాఠశాల ప్రారంభింపబడినది. ఈ పాఠశాలను, విద్యార్థుల శ్రద్ధాశక్తులు చూచువారికి విస్మయము కలిగించుచున్నది. నిర్బంధ విద్యా విధాన పద్ధతుల ప్రకారము గ్రామములోని బడి యీడుగల బాలబాలికలు యావన్మంది (సుమారు 42) పాఠశాలలో చేర్చబడిరి. తక్కిన పాఠశాలలలో ఉపాధ్యాయులున్నప్పుడు కూడా సాధారణముగ పాఠశాల తనిఖీ నిమిత్తము ఉద్యోగ, ఉద్యోగేతరులు వచ్చు సమయమందుకూడా బాలబాలికల హాజరు పూర్తిగనుండదు పైగా బాలబాలికల శుచి శుభ్రత విషయములలోగూడ శ్రద్ధాసక్తులు సన్నగిలియుండును. కాని విచిత్రమేమన, మన యీ గ్రామములోని విద్యార్థులు, ఉపాధ్యాయుడు కారణాంతరము చేత గ్రామాంతరము వెళ్ళియున్నను పాఠశాల క్రమముగ ఉపాధ్యాయుని సమక్షమున చదుచుచున్న విధముననే యావన్మంది విద్యార్థులు హాజరయి వారి పాఠములను చదువుకొందురు. అందరును చక్కగ తల దువ్వుకొని ఆరోగ్యముగ కనబడుదురు, వారికి వున్నంతలోనే వారి బీద దుస్తులను శుభ్రము చేసికొని శరీరము నిండుగ ధరించుకొందురు మరియొక విశేషమేమన, గ్రామములోని ప్రతి యింటి లోని స్త్రీ, పురుషులు గూడ అందులో నూటికి నూరుపాళ్ళు విద్యాగంధములేని వారయ్యుగూడ, తమ బాల బాలికల విద్యయందు అందునను తెలుగు భాషను నేర్పింపవలెనను కుతూహలమునందు, అద్వితీయమైన ఆసక్తిని ప్రదర్శించుట బహు శ్లాఘా పాత్రము. అరువది, డెబ్బది సంవత్సరముల వయస్సుగల ముదుసలి స్త్రీలు వాకిల ముంగిట కూర్చొని, తమ పిల్లలు శ్రద్ధగ చదువుచున్నది లేనిది కనిపెట్టుచు, వారిని తఱచు హెచ్చరించుచుండుట గొప్ప విషయము. బహు బీద గ్రామమయ్యు, గ్రామస్థుల కృషివలన తాత్కాలికముగ నొక పాఠశాలను వారి స్వయం కృషితో నిర్మించుకొనిరి. ఇంకను పాఠశాలను విస్తరింపజేయు నిమిత్తమున్ను, బాలబాలికల విహారాదుల నిమిత్తమున్ను, గ్రామస్థులందరు యేకీభవించి ఒక ఎకరము భూమిని సమితి పేర వ్రాసి యిచ్చుటకు అంగీకరించిరి ఈ గ్రామము పేరే "పాత్రపడ". ట్రంకు రోడ్డుపై గల కంచిలి గ్రామమునకు రెండు మైళ్ళ దూరములో నున్న నొక బీద గ్రామము.

దేశములో ప్రస్తుతము నలుమూలల మనము వినుచున్న

(44వ పేజీ చూడుడు)

కథానిక :

# మరీచిక

శ్రీ మధురాంతకం రాజారాం

( గత సంచిక తరువాయి )

ఎనిమిది గంటలకు సరిగ్గా క్రిందికి దిగి వచ్చాడు ప్రకాశం. కిటకిటలాడి పోతున్న అతిథులతో, ఒక్కుమ్మడిగా చెలరేగుతున్న కోలాహలంతో, కప్పునుంచీ వ్రేలాడుతున్న పూల దండలతో. అగరువత్తుల సువాసనలతో హాలు హాలంతా పుష్పక విమానంలా వుంది. చప్పున కనిపించడం లేదు గానీ యింత హాల్లో తనకొక సీటు ఖాళీగా వుండకపోదు. వారగా నిల్చుని చుట్టూరా కలయ పరికిస్తున్నాడు ప్రకాశం.

వెనుక వైపునుంచి చిరపరిచితమైన కంఠం వినిపించింది. పిలుస్తున్నవాడు శేఖరం.

ప్రకాశానికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. కాలేజి సహపాఠకుల్లో తనవింకా జ్ఞప్తిలో వుంచుకున్న నలుగురైదుగురు మిత్రుల్లో శేఖరం ఒక్కడు.

"రావోయీ ప్రకాశం! నాటికీ నేటికీ లేట్‌లతీఫ్‌వి రా సోదరా నువ్వు! సర్దుకుని అర్ధ సింహాసన మిస్తున్నాను గానీ కూర్చో" ఆప్యాయంగా ఆహ్వానించాడు శేఖరం.

''అర్ధ సింహాసనానికైతే సమ్మతిస్తున్నానుగానీ. విందులో అంటాకు మాత్రం ప్రత్యేకంగానే వేయించు శేఖరం!"కూర్చుంటూ అన్నాడు ప్రకాశం.

విందు ప్రారంభమైంది. తీపీ, కారం, చిత్రాన్నం, చక్కెర పొంగలి, వడా పాయసం వరుసగా విస్తర్లోకి వచ్చి, రాగానే మాయమై పోతున్నాయి. శేఖరం భోజన పరాక్రమ ప్రదర్శనానికి ఉద్యమించిన అవకాశాన్ని పురస్కరించుకుని హాల్లో సమావిష్టులైన బంధు మిత్రులవైపు పరిశీలనగా చూడసాగాడు ప్రకాశం. బాహ్య దృష్టికి అక్కడొక విందు జరుగుతున్నట్టే కనిపించినా, విందుకు వెనుక విజాని కక్కడొక పందెం ప్రారంభమైనట్టుగా భాసించడంతో ప్రకాశం నివ్వెరపడిపోయాడు. ప్రతి వ్యక్తి ఎదుటివారిని తనవైపుకు ఆకర్షించు కోవాలన్న ప్రయత్నంలో తలమునకలై వున్న ఆ సంరంభం మధ్య ప్రకాశం కొంతసేపు చేష్టలుదక్కి స్థాణువులా వుండిపోయాడు. వేషంతో కొందరు, మాటలతో కొందరు, హావభావాలతో కొందరు, మొత్తంపైన అందరూ అలాంటి ప్రయత్నాల్లోనే నిమగ్నులై వున్నారు. అసలు సమస్య అక్కడే ఉద్భవించింది. అందరూ వ్యక్తులైతే శ్రోతలెవ్వరు? అందరిదీ ప్రదర్శనమే అయితే ప్రేక్షకులెవ్వరు?

ఆకు ఖాళీచేసి శీతల పానీయాలకోసం కాచుకుని కూచున్న వ్యవధిలో ప్రశ్నించాడు శేఖరం–"నువ్వు జయప్రదాదేవి పాట కచ్చేరీ గూడా వినదలచుకున్నావా ప్రకాశం?"

"ఆవిడ పాడుతుందా ఏమిటి?" అన్నాడు ప్రకాశం.

''ఇంకా నయం! ఆవిడ గాకపోతే నువ్వూ నేనూ పాడుతామా ప్రకాశం! ప్రాధేయపడ వలసిన అవసరం లేదు. ఆసక్తిని అభినయిస్తే చాలు పాటకు వినిమయంగా ఆమె ఆశించేదేమిటో తెలుసా ప్రకాశం? డబ్బుకాదు. కావలిస్తే తండ్రిగారి కందాలో శ్రోతలకు భోజనాలు పెట్టించి, స్వంత ఖర్చుతో కిళ్ళీలు, సిగరెట్లు తెప్పించి హాయిగా విని పొమ్మని ఆలాపన మొదలు పెడుతుంది జయప్రద. ఆమెకు కావలసిందల్లా యించుక పొగడ్త. ముఖస్తుతి అయినా యిబ్బందిలేదు నువ్వెప్పుడైనా గణాచారిని చూచి ఎరుగుదువా ప్రకాశం! గణాచారికి మొగుడుండడు తనవాళ్ళపైన మమకారాలుండవు. తనేమిటో తన నావహించిన అలౌకిక వాతావరణ మేమిటో, ఆవిడదొక ప్రత్యేక ప్రపంచం. జయప్రద సంగీత దేవతచేత ఆవేశితురాలు. తండ్రి ఆమెకెప్పుడో పెళ్ళి

చేశాడు. ఆ భర్త తిండీ నీళ్ళలాంటి ప్రాణావసర విషయాలకే ప్రాధాన్య మిచ్చి, సంగీత సాహిత్యాలను అడపా దడపా కాస్తో కూస్తో సేవించే మామూలు రకం మనిషి. మరి కళంటే ఏమిటో నీకు తెలుసుగదా ప్రకాశం! అది లౌకికమైన నిబంధనల నన్నిటినీ నుగ్గు నూచం చేసి ఆకాశ వీధుల్లో జలాదూర్లు తిరుగుతుంది జయ ప్రద విషయంలోనూ అంతే జరిగింది..."

అంతలో పానీయాలుగూడ వచ్చేశాయి.

"నువ్వింతగా, చెప్పిన తరువాత నాకేమో జయప్రద సంగీతం వినాలనే వుంది శేఖరం! కానీ ఈ తలనొప్పి ఒకటి నన్ను దారుణంగా వేదిస్తోంది. బయటికి వెళ్ళి కొంత సేపు చల్లటి గాలిలో తిరిగి వాద్దామనుకుంటున్నాను..." అన్నాడు ప్రకాశం.

"అరెరే, అది మన అయిడియా! నీకెలాతట్టింది ప్రకాశం! వెళ్దాం పద" అంటూ తనే ముందుగా బయల్దేరేశాడు శేఖరం బయల్దేరుతూ బంగళా ఆవరణలో గంగరావి చెట్టు క్రిందలి సిమెంటు దిన్నెలపైన పవ్వళిస్తే శిరోభారంతోబాటు భుక్తాయాసం గూడా యిట్టే ఉపశమిస్తుందని తన రెండో అయిడియాగూడ బయట పెట్టేశాడు.

గంట తొమ్మిదైంది. హాల్లో పాటకచ్చేరీ ఏర్పాట్లు జరుగు తున్నాయేమో అతిధులు వసారాలో మూగిపోయారు. జయప్రదాదేవి భర్తకు మల్లే సంగీతమంటే అంతగా పట్టింపు లేని వాళ్లు కొందరు మామయ్య దగ్గర సెలవు తీసుకుని యిళ్ళకు వెళ్ళిపోతున్నారు. కాళ్ళూ చేతులూ బారగిల చాపుకుని అరుగుపైని వెల్లకిల పడుకున్న శేఖరం ఒకటి రెండు గడియలసేపు నిశ్శబ్దంగా గడచిపోయిన తరువాత హఠాత్తుగా ప్రసంగానికి శ్రీకారం చుట్టాడు.

"నువ్వెప్పుడూ యితరుల అభిప్రాయాలను తారుమారు చేస్తుంటావు ప్రకాశం! ఈ ఫంక్షనుకు నువ్వు రావేమోనను కున్నారు హాల్లో కనిపించేదాకా నేనుగూడా నువ్వు రాలేదేమో ననుకున్నాను..."

''అలాగా శేఖరం! రాకపోవడానికి నాకట్టే పెద్ద కారణమేమీ కనిపించలేదు పోగా నా భయాలు కూడా నాకున్నాయి. సంబంధం బెడిసి పోయింది గనుక ఈ సమయంలో హాజరు పలుకకపోతే నేను బొత్తిగా కుళ్లుమోతు క్రింద లెక్కింప బడతానేమో నని పించింది..."

''ఓహో, అదా నీ ధర్మ సందేహం!" పకపక నవ్వేశాడు శేఖరం. "ఎలాగైతేనేం ప్రకాశం, మీ అత్తయ్య కోరిన కోనలో వాన కురిసింది. నువ్వు గనుక గైర్ హాజరైవుంటే ఈ ఘోష యాత్ర బూడిదలో పోసిన పన్నీరై మీ అత్తయ్య మనసుకెంతో బాధ కలిగి వుండేది..."

''నా మూలంగా అత్తయ్య కామాత్రం సంతృప్తి కలిగితే నాకంతకంటే కావలిసిందేముంది శేఖరం!" ఆలోచిస్తూ అన్నాడు ప్రకాశం

సీటి ఆవిరిని విరజిమ్మడానికి ముందుగా స్టేషనులోకి వచ్చి ఆగిన రైలు బండిలా తటాలున లేచి కూర్చున్నాడు శేఖరం "నువొక్కడివే గాదు ప్రకాశం! మీ అత్తయ్యకు సంతృప్తిని చేకూర్చే మహోద్యమంలో నీలాంటి వాళ్ళింకా ఎందరో వున్నారు. ఏ ఒకరిద్దరో తప్పా మిగిలిన వాళ్ళందరూ ఈ సంబరానికి వచ్చే శారు. ఎందరో మహానుభావులని వూరికేనే అన్నారా త్యాగరాజు! అందరిని గురించీ వాకొనడం నా చేతనయ్యే పని గాదు. ముచ్చటగా ముగ్గురిని గురించి మాత్రం ముక్తసరిగా ముచ్చటిస్తాను. పురాణం లో ఈ పిడకల వేటేమిటన్న సందేహం కలగవచ్చునీకు! తీర్థానికి వెళ్ళొచ్చిన తర్వాత అక్కడేం చూచావన్న ప్రశ్నకు బదులు చెప్పడానికైనా ఒకటి రెండు విషయాలు తెలుసుకోడం అవసరం. పైగా జాబితాలోనుంచి తొలగింప బడ్డావుగనుక, యింకా జాబితాలో వున్న వాళ్ళనిగురించి తెలుసుకోవాలన్న కుతూహలం నీకుండక పోదు. మొదట చక్రపాణిని గురించి చెబుతాను...."

''చక్రపాణి అంటే ఆఛాయాచిత్ర గ్రహకుడేనా శేఖరం!"

"శ్రమపడ్డావుగానీ, నీ అనువాదానికి నా సానుభూతి! నా మట్టుకు నేను అతనొక ఉపగ్రహం అంటాను. ఈ ఉపగ్రహం జయప్రదను ముఖ్యగ్రహంగా చేసుకుని ఆవిడ చుట్టూ పరిభ్రమి స్తోంది ప్రస్తుతం! ఎందుకూ అంటావు. ఎందుకో అంటాను! మరీ మరీ నొక్కి అడుగుతావనుకో, నీళ్ళెందుకు ప్రవహిస్తున్నాయి, గాలెందుకు వీస్తుంది అని ఎదురు రెట్టిస్తాను. ఆలోచించాలేగానీ సంజాయిషీలే తోచక పోతాయా ప్రకాశం! నువ్వు ఫలానా హోటల్లో కాఫీ తీసుకున్నానని చెప్పగలవు. ఫలానా బ్లేడుతో ముఖం గోక్కున్నానని చెప్పగలవు. అంతతేలిగ్గా ఫలానా అమ్మా యిని ప్రేమించానని బాహాటంగా చెప్పుకోగలిగేపాటి గుండె దిటవు నీకుండదు. నాకు తెలిసినంతలో ఆకాంటిగుండెదిటవు చక్రపాణి కొక్కడికి మాత్రమే వుంది. నా మాట మీద నీకు నమ్మకం లేకపోతే నువ్వు అతడి ఫోటో ఆల్బం చూడ వచ్చు. అందులో చక్రపాణి ఎప్పుడెప్పుడు ఎవరెవరిని ప్రేమించినట్టుగా భావించాడో ఆ వివరాలన్నీ రూపభంగిమలతోసహా కనిపిస్తాయి. నువ్వు చక్ర

పాఠీని చిత్రగ్రాహకుడన్నావు. అంతకన్నా బాహుకుడనడం సమంజసం; కర్కోటకుడుకరిచిన తర్వాత నలుడు వికార స్వరూపంతో బాహుకుడై పోతాడు. ఇక్కడ ప్రేమ అన్న మనోవికారానికిలోనై చక్రపాణి యిలా తయారయ్యాడు మన్నించు ప్రకాశం; ప్రేమ అన్న పదానికి నేను తీరని అపచారం చేసినట్టు నువ్వు భావించ వచ్చు. కానీ వాస్తవమేమిటంటే అంచులు అరిగిపోయి, అక్షరాలు మాసిపోయిన రూపాయి నాణానికి మల్లే ప్రేమ అన్న పదానికిక్కడి సాంఘిక వ్యవహారంలో మారకపు విలువలు లేవు. పదమంటే ఏమిటి ప్రకాశం; అది ఓ భావానికి సంకేతం; 'లవ్ ఈజ్ గాడ్' అన్నప్పుడు ఆ వాక్యంలోని 'లవ్' ఎదుట చేతులు జోడించాలనిపిస్తుంది. కుక్క 'లవ్ లవ్' మని మొరిగినప్పుడు దుడ్డు కర్ర చేతికి తీసుకోవాలనిపిస్తుంది. కాగా పోగా చక్రపాణి ప్రేమ యిప్పుడు జయప్రదపైకి ప్రసరించి, అక్కడ పక్రీ భవనం చెంది సూటిగా శోభాదేవిని తాకుతోంది ఈ పరిణామాన్ని యింతకంటే సునిశితంగా వివరించడానికి నేను చాలను ప్రకాశం; అందుకు ఫ్రాయిడ్ స్వయంగా దిగరావాలి. లేటెస్ట్ డెవలప్‌మెంటు ఏమిటో చెబుతాను ప్రకాశం—జయప్రద యిప్పుడు మీ అత్తయ్యకు, చాక్రపాణి తల్లిదండ్రులకూ మధ్య పెళ్ళి పెత్తనాలు సాగిస్తోంది .."

వింటున్న కొద్దీ ప్రకాశానికి తలబరు వెక్కి పోతోంది. కణతల్ని వ్రేళ్ళతో బిగబట్టుకుని మోచేయి వూతగా అతడు అరుగు పైకి వ్రాలి పోయాడు.

"తపాలాశాఖను తీవ్రంగా ఎదుర్కొనే చిక్కొకటివుంది ప్రకాశం;" మాట్లాడుతున్న కొద్దీ శేఖరంలో ఉత్సాహం అతిశయిస్తోంది. "అదే చిరునామా తెలియని జాబులగొడవ; ఈ జగన్నాటక రంగంపైన గూడా మనకప్పుడప్పుడూ చిరునామా తెలియని జాబుల్లాంటి వ్యక్తులు కొందరు తారసిల్లుతుంటారు. వాళ్ళెక్కడి నుంచీ వచ్చారో తెలియదు వాళ్ళగమ్యమేదో తెలియదు..."

"ఎవర్నిగురించి చెబుతున్నావు శేఖరం?" అడ్డు తగిలి ప్రశ్నించాడు ప్రకాశం.

"జాబితాలో రెండో వ్యక్తిని గురించి; తనని గురించి ప్రపంచాని కేమీ తెలియక పోవడం వుంది చూడావా ప్రకాశం, అదెంతటి ఆకర్షణగాదు; దీనితో బాటు అతడి పేరు, వాలకమూ, మాటల ధోరణి, పర్సులోనుంచీ ఎడమచేతితో వందరూపాయల నోట్లను పైకి తీసే తీరు—యివన్నీ శచీంద్రబాబుకున్న యితర ఆకర్షణలు ఇన్నింటికీ మించి, అతనిలో విరహ లక్షణాలు కొన్ని వున్నాయి. అతడు తన జీవితానికి సంబంధించిన వంటూ కొన్ని విషాదాంత ప్రణయగాధలు గూడా పేర్కొంటాడు. ఆ విరహ లక్షణాలతో, ఈ ప్రణయగాధలతో అతడు సలీం, ఖయస్, దేవదాసుల తర్వాత మళ్ళీ అంతటి విషాద ప్రేమికుడుగా కనిపిస్తాడు. మీ అత్తయ్య, శోభ, జయప్రదలాంటి వాళ్ళందరూ అతడి సాన్నిధ్యంలో మంత్రముగ్ధులు. అంతెదుకు ప్రకాశం—పారిస్ సమాజంలో కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టోకైనా యిలాంటి పరిగణన లభ్యమై వుండదు

"ఇక చాలు గానీ యింతటితో నీ అక్షయ భాండాన్ని మూసిపెట్టు శేఖరం; నా ఓపికను బట్టి మళ్ళీ ఎప్పుడైన మరి కొంత అమృతం పుచ్చుకుంటాను" అన్నాడు ప్రకాశం

"అదేమిటి ప్రకాశం! ఇంకా సినిమాలు తీసే సుగుణాకరమున్నాడు, నాగపూర్‌లో ఎక్కడో ఉద్యోగం చేస్తున్న విశ్వనాథం - రి అబ్బాయి వున్నాడు...

మిత్రుడి వాక్ప్రవాహం బారినుంచీ తప్పించుకోవడానికి ప్రకాశానికో ఉపాయం స్ఫురించింది. "ఉండేవుంటారుగానీ మనలో మనమాట శేఖరం; జాబితాలో నువ్వెన్నోవాడివి?"

"అబ్బో నేనేమిటో అనుకున్నాను ప్రకాశం; నువ్వునేనను కున్నంతటి అమాయకుడని గావు మనదేముంది; లేదంటే మీమామగారు, మానాన్నగారు ఒకేక్లబ్బులో మెంబర్లు అందువల్ల ఎప్పటికప్పుడు యిక్కడి వర్తమానాలు నాచెవిదాక వస్తుంటాయి..."

ఒకటిరెండుసార్లు ఆవులించి, అరుగుపైన్నే కాసేపు కునికిపాట్లుపడి ప్రకాశం దగ్గర సెలవుతీసుకుని స్వగృహాభిముఖుడై వెళ్ళిపోయాడు శేఖరం

ఎప్పుడెనుకున్నాయో ప్రకాశానికి తెలియదు. ఆకాశాన మబ్బులు గుసారం వేసుకున్నాయి ఉండి వుండీ చినుకులు రాలసాగాయి వడగళ్ళలాంటి చినుకులు నాలుగు ఒంటిపైన పడటంతో ప్రకాశాం ధిగ్గున మేలుకున్నాడు పదకొండూ యిరవై చూపుతోంది చేతిగడియారం

హాల్లో అయిదు నిమిషాలు మాత్రం కూర్చో గలిగాడు ప్రకాశం జయప్రదాదేవి పాట కచ్చేరీ పూర్తై యిప్పుడక్కడ చదరంగాలు, చతుర్ముఖ పారాయణాలు, లోకాభి రామాయణాలు జోరుగా జరుగుతున్నాయి. అగరువత్తుల మధుర పరిమళాలకు బదులుగా ధూమమేఘమాలికలు నర్తిస్తున్నాయి. పూలదండలు వాడిపోయి వెలవెల పోతున్నాయి.

ప్రకాశం మేడపైకి వెళ్ళాడు.

శోభాదేవి గదిలో దీపం వెలుగుతోంది

పాదరక్షల సవ్విడి వినిపించిదేమో గదియతీసి తలుపులు తెరుస్తూ "నువ్వాబావా" అంది శోభ

"నేనే శోభా అన్నాడు ప్రకాశం.

"కూర్చుందువుగానీ లోపలికిరా బావా!" పిలిచిందిశోభ.

"కూర్చోడమెందుకులే శోభా! పడుకోవాలి నేను నీగది ఎదుటకు వచ్చేసరికి నాకోవిషయం జ్ఞప్తికి వచ్చింది. వెనుకటి కెవరో పెళ్ళి ఏర్పాట్లన్నీ ఘనంగాచేసి మంగళసూత్రం చేయించ డానికి మరచిపోయారట! నా విషయంలోనూ యించుమించు అంతే జరింది నీకోస, ఓకానుక తెచ్చాను. తెచ్చిన కానుకను చేతి సంచిలో వుంచి నీ గదిలో గోడకుతగిలించాను..."

"ఇవ్వుడైనా మించిపోయిందేముంది బావా! ఏదీ నీ కానుక? బల్లవైపుచూస్తూ అడిగింది శోభ. జన్మదినోత్సవ సందర్భములో వచ్చిన కానుకలన్నీ ఆబల్లపైన్నే వున్నాయి. చీరలు, నగలు, వెండిపాత్రలు, పుస్తకాలు......

సంచీలోనుంచి పొట్లాన్నితీసి శోభాదేవిచేతుల్లో పెట్టాడు ప్రకాశం.

నూలుపోగులు తెంచి కాగితాల ప్యాకింగును విడదీసింది శోభ. అది ఓ చిన్న చలువరాతి బుద్ధవిగ్రహం.

"బుద్ధదేవుడాబావా" ప్రకాశం కళ్ళల్లోకి చూచింది శోభ.

"అవును శోభా" ఇంతకంటే సముచితమైన కానుకేదీ నాకు స్ఫురించలేదు. అశాంతికీ గందరగోళానికీ తావలమై పోతున్న ఈ ప్రపంచంలో బుద్ధ భగవానుడి దర్శనం కన్నా మనసుకు శాంతి కలిగించే దేముంది శోభా! కానుకతోబాటు నా శుభకాంక్షలు గూడా స్వీకరించు వెళ్ళొస్తాను శోభా! సెలవు..." మెల్లగా బయటికి వచ్చేశాడు ప్రకాశం.

*　　*　　*

రెండేళ్ళు గడచిపోయాయి. గడిచిపోయిన తర్వాత వెను దిరిగి చూచుకుంటే వాటి అడుగుజాడలైనా లేవు. రేయింబవళ్ళన్న రెక్కలుగట్టుకుని కాలం ఒకపక్షిలా పరతెంచిపోతుంది కాబోలు! ప్రకాశం అప్పుడప్పుడూ ఆలోచిస్తూ కూర్చునేవాడు. ఏలాగో రెండేళ్ళు గడచి పోయాయి. ఇకపైన ఎంతో కాలం యిలాగడవదు. "ఇప్పటికే ఆలస్యమైంది. రానున్న వైశాఖంలో ఆ శుభకార్యం కాస్త జరిగిపోవాలి" అంటూ అమ్మ అదే పనిగా సతపోరుతుంది.

కుట్టితేతేలు, కుట్టక పోతే కుమ్మర పురుగు అన్న సూత్రం ఆధారంగా ఎదుటి మనిషిని అంచనా వేసే లోకుల పాలిటికి ప్రకాశం తరహా అదోరకంగా కనిపించిన మాట నిజమే! కానీ లోకులనుకున్నట్టుగా ప్రకాశం విరాగీ కాదు. వివాహానికి విముఖుడూ కాదు లేదంటే సెంటు పూతల ఘుమాయింపులతో, మాటమాటకు రాసిక్యతను వెల్లిగక్కుతూ, త్రోవ పొడుగునా ఓరచూపులు బరపుకుంటూ వీధులవెంట షికార్లు తిరగ లేదు ప్రకాశం! అదే అతడి దోషం. ఈ దోషాన్ని—కాదా రాసిక్యతా లోపాన్ని వ్రేలెత్తి చూపి ప్రకాశాన్ని అపహసించిన మిత్రులు సైతం లేక పోలేదు. అప్పుడు గూడా ప్రకాశానికి ఆలోచనే శరణ్యమయ్యేది. ఏమిటీ ప్రపంచం? ఎక్కడికి దీని ప్రయాణం? కామినీ కాంచనాల ఆకర్షణను అధిగమించడం దుస్తరమే! కానీ అలాగని మనసు కళ్ళాన్ని వదిలి పెట్టి యింద్రియాశ్వాలను వాటి రాత కొద్దికీ వాటిని పరుగెత్తనిస్తే చివరికి మానవుడి జీవితం ఏమౌతుంది? ఎక్కడో ఒక చోట ఎవరో ఒకాయన చెబుతుండగా విన్నాడు ప్రకాశం—ఈ ప్రపంచంలో మరి కొంత కాలానికి స్త్రీ పురుష సంబంధం ఒక్కటి తప్పితే తదితర సమస్యలేవి వుండవట! విశ్వరూపం ధరించి మానవ జీవితాన్ని విహ్వలం చేసి పారవేసే ఆఖరు సమస్య అదేనట! ఏ మహర్షి చెప్పని మాట! మతాచార్యుడు వ్రాక్రువ్వని మాట! గుండెనుగుప్పిట్లోకి తీసుకుని భయపడి పోయాడు ప్రకాశం ఐతే యిన్ని సాంఘిక నియమాలు, యిన్ని నీతిశాస్త్రాలు, యిన్ని ప్రభుత్వ శాసనాలు మానవుణ్ణి రక్షించబోవడంలేదన్న మాట! మరొకాయన అప్పటికి తనేదో ఉపనిషత్తుకు వ్యాఖ్యానం భాషిస్తున్నంత గంభీరమైన పోజు పెట్టి చెప్పాడు ప్రకాశానికి! ప్రేమ ఏకవ్యక్తినిష్ఠమైనప్పుడు పవిత్రమైనదని ప్రస్తుతిస్తూ, అదే ప్రేమ బహువ్యక్తి పరివ్యాప్త మైనప్పుడు వ్యభిచారమని ఈసడించడం బొత్తిగా అవివేకమట! వక్రభాష్యాలు మాదకపు వస్తువల్లా బుద్ధిని తాడనం చేస్తాయి. నాటి ప్రభావానికి లోనైన మనుసు మొద్దు బారి పోతుంది. బహు వ్యక్తి పరివ్యాప్తమైన ప్రేమ! అబ్బో, లోక ప్రతారణానికి ఎంత చిట్కాయిది? విషయలోలుపత్వాని కొక మంచి పేరు కనిపెట్టిన ఆ పెద్ద మనిషి విజ్ఞతను మాత్రం అభినందించకుండా వుండలేక పోయాడు ప్రకాశం.

ప్రకాశం వివాహానికి సుముఖుడుగా లేడన్న వార్తకైతేతమ శాయశక్తులా ప్రచారం సాధించి పెట్టారుగానీ, అతడి మనసు లోపలి మనసులో నిగూఢంగా దాగివున్న అంతర్యాన్ని పసిగట్టిన బంధుమిత్రులెవ్వరూ లేరు. శోభ తనకు మేనత్త కూతురు.

మేనత్త ప్రసవంకోసం పుట్టింటికి వచ్చింది. అప్పటికి తనకింకా అయిదేళ్ళు నిండలేదు. ఓ రోజు శుభోదయాన పనసపండులాంటి చిన్నారి బుజ్జి పాపను ప్రక్కలో పరుండబెట్టుకున్న అత్తయ్య తనను చేరువకు తీసుకుని "ఒరే ప్రకాశం! నీకు పెళ్ళాం పుట్టింది రా" అంది. తనతోబాటు ఆ మధుర భావన గూడ పెరిగి పెద్దదౌతూ వచ్చింది ఇరువదేండ్లుగా తన హృదయోద్యానంలో దినదిన ప్రవర్థమానంగా శోభిల్లుతూ వచ్చిన ఆ రాగవల్లరిని ఈ నాడు సమూలంగా పెల్లగించి వేయాలని చూస్తున్నాయి పరిస్థితులు!

మరో వైపున శోభాదేవికోసం వరాన్వేషణ గూడా తీవ్రంగానే కొనసాగుతోంది అత్తయ్యకిప్పుడీ ధ్యాసతప్పితే యితర వ్యాసంగాలు లేవు ప్రతి సంబంధానికీ బొమ్మతోబాటు బొరుసు గూడా కనిపించడంతో ఆవిడహతాశురాలై పోతోంది చక్రపాణి మంచివాడే! కానీ అతడు తలిదండ్రులకు కడగొట్టు బిడ్డ. అతని కంటే పెద్దవాళ్ళయిదారుగురున్నారు. ఆ అత్త మామలు, ఆ బావలూ తోడుకోడళ్ళూ, వాళ్ళ బిడ్డలూ అందరితో కలిసి అది ఓ లంకంత సంసారం! ఆ సమిష్టి కుటుంబంలో శోభ ఎలా వూపిరి త్రిప్పుకోగలుగుతుంది? చక్రపాణి తరవాత వాడు శచీంద్ర బాబు. ఇతణ్ణి పెళ్ళాడిన అమ్మాయికి అత్త మామల ఆరడిగానీ, తోడుకోడళ్ళతో పొరపొచ్చాలుగానీ ఏర్పడడానికి ఆస్కారమే లేదు ఎందుకంటే శచీంద్రబాబు ఏకాకి! అదే, ఆ ఒంటరితనాన్ని చూస్తేనే అత్తయ్యకు భయం! ఏ అమ్మగన్న బిడ్డోగానీ ఈ శచీంద్రబాబుకు పునాదులే లేవు. ఇతని డబ్బు న్యాయార్జితంగాదనీ, యితని చరిత్ర అనుకున్నంత ఉదాత్తం గాదనీ పుకార్లు గూడా వున్నాయి తెలిసి తెలిసి తన కుమార్తెను నూతిలో త్రోసేటంతటి మూర్ఖురాలా అత్తయ్య! జాబితాలో మూడో వాడు సుగుణాకరం అతనికి గూడా తల్లిదండ్రులు లేరు. సువిశాలమైన మాగాణి పొలాలకు అతడు ఏకైక వారసుడు. కానీ సుగుణాకరంతో వచ్చిన చిక్కల్లా ఒక్కటే! అతడిదివరకే ఓ అమ్మాయిని పెళ్ళాడి ఆమెకు విడాకులచ్చేశాడు. ఆతరువాత సినిమాలోకంలో ఓ నాట్యతారను పెళ్ళాడి ముచ్చటగా మూడు నెలలు కాపురంచేసి ఈ సారి ఆవిడ దగ్గరనుంచీ విడాకులు పుచ్చుకున్నాడు. పొరబాటు గ్రహపాటుగా మారింది గనుక, యిక అగ్రహపాటు అలవాటుగా పరిణమించదనడానికి ఆస్కారం ఎక్కడ? ఇలా ఒక్కొక్కరిని త్రోసి రాజనుకుంటూ వచ్చి ఒక ఘట్టంలో అవకాశాలన్నీ శేఖరం పట్ల మొగ్గు జూపాయి శేఖరం తండ్రికొక్కడే కొడుకు. కాని ఆ తండ్రి ఏమంత కలిగిన వాడు కాడు పోగా శేఖరానికి పెళ్ళి కావలసిన చెల్లెళ్ళు నలుగురున్నారు. ఒకవేళ శేఖరం యిల్లరికానికి ఒప్పుకున్నా అత్తగారిల్లన్న ధనధ్రువం నుంచీ అమ్మగారిల్లన్న ఋణధ్రువంలోకి విద్యుత్తు ప్రవహించదనుకోడానికి అవకాశం లేదు ఈ విధంగా ఆ సంబంధం గూడా అత్తయ్య నిరాదరణకే పాత్రమైంది

చివరికొక్క సంబంధం మాత్రమే మిగిలింది. మధ్యవర్తుల ఎడతెగని ప్రయత్నాలవల్ల అదేకుదిరింది. లోకులందరూ విశ్వనాధంగార అబ్బాయి రమాపతి అదృష్టవంతు డనుకున్నారు. ఇంత మంచి సంబంధం కుదిరింది గనుక శోభగూడా అదృష్టవంతురాలనే బంధులోకం భావించింది. విశ్వనాధం గారికి గూడా మగవాళ్ళూ, ఆడపిల్లలు కలసి సంతానం ఏడెనిమిది మందికి తక్కువగాదు గానీ, వాళ్ళందరూ ఎవరికివారు వేర్వేరు వూళ్ళలో వున్నారు. పైగా విశ్వనాధం గారు తమ కొడుకుల సంపాదనలో నుంచీ ఒక్కనయా పైసా అయినా ఆశించేవారు కారు. రమాపతి నాగపూర్‌లో ఉన్నతోద్యోగి. ఉచితనివాస, ఉచితవాహన సౌఖర్యాలున్నాయతనికి! గొప్పఉద్యోగస్థుడి భార్యగా తనకూతురు నలుగురి మన్నన లందుకోవచ్చు. దేశంచూడవచ్చు జీవితాన్ని ఓ పాటగా పాడుకోవచ్చు అత్తయ్యకు అమందానందం కలగడంలో అబ్బురమేముంది?

పెళ్ళికి చంద్రాన్ని తోడిచ్చి తల్లిని పంపించాలను కున్నాడు ప్రకాశం. కానీ పార్వతమ్మ తానువెళ్ళనంటే వెళ్ళనని మొండికేసింది చివరకు చంద్రం ఒక్కడేవెళ్ళి నాలుగురోజులుండి తిరిగి వచ్చాడు. వచ్చినవాడు ముఖంముడుచుకుని. మౌనవ్రతం పట్టినట్టుగా రెండు రోజులపాటు బిర్రబిగుసుకుని కూర్చున్నాడు.

వేయివిధాలుగా బుజ్జగింపబడిన తరువాత యిటుతల్లిపైకి అటు ప్రకాశంపైకి రూక్షవీక్షణాలు బరపుతూ "చెప్పడానికేముంది! అందరూ కలసి శోభ కన్యాయం చేశారు" అన్నాడు చంద్రం

"అదేమిట్రా చంద్రం! ఏం జరిగిందో చెప్పరా బాబూ, చంపక" ప్రాధేయపడింది పార్వతమ్మ

"కాక పోతే అతడేం పెళ్ళికొడుకమ్మా! మనమనిషికాదు. మన మాటలు కావు పంచకట్టుకోమంటే కట్టుకోడు. పాంటుతోనేపెళ్ళిపీటలపైన కూర్చుంటాడు. అతడు పురోహితుడితో మాట్లాడ్డంకూడా యింగ్లీషులోనే! పెళ్ళికూతురి వ్రేలు పట్టుకోమంటే మాటి మాటికీ మరచి పోతాడు. ఎవరైన జ్ఞాపకం చేస్తే 'ఓహో'

మరచి పోయాను గదూ, అంటూ పెళ్ళిపందిరి పైకెగిరిపోయేటంత బిగ్గరగా నవ్వేస్తాడు. నాకళ్ళతో నేను చూచానన్నయ్యా! కంచు పాత్రలో గులకరాళ్ళుపోసి గిలకరించినటుగా ఒక్క పెటున అతడి నవ్వు ప్రారంభమయ్యే సరికి శోభ వులికిపడి గాబరా పడిపోతుంది. ఒకసారేంజరిగిందో తెలుసా అన్నయ్యా, పెళ్ళికొడుకు పెళ్ళి కూతురూ మండపంచుట్టూ తిరుగుకున్నారు. ద్వారం గగ్గర ఎవరు కనిపించారో ఏమిటో పెళ్ళికొడుకు 'హలో, హలో' అంటూ చేతులు బారగిల చాపుకుని అడ్డంగా కూర్చున్న వాళ్ళని తొక్కేస్తూ పరుగెత్తసాగాడు. మధ్యలో నలుగురడ్డపడి కొంగుముడి విప్పి వేశారు గనుక సరిపోయింది గానీ లేకుంటే అతడు శోభనలాగే ద్వారం దాకా లాక్కెళ్ళి పోయివుండేవాడు..."

విచారంలోగూడా నవ్వక తప్పిందిగాదు ప్రకాశానికి! "ఆది కాలంలో ఎప్పుడో మహావిష్ణువు గజేంద్రునిరక్షింప బోతూవుండగా యిలాంటిసంఘటనే జరిగిందట్రా చంద్రం!" అన్నాడు ప్రకాశం.

"ఇప్పుడిలా నవ్వులాటగానే వుంటుంది. కానీ ఎప్పుడో ఒకప్పుడు అందరూ కలసికట్టుగా విచారించక పోరు" అన్నాడు చంద్రం.

"నువ్వొక పిచ్చిపుల్లయ్యవిరా చంద్రం! వాళ్ల కోరికోరీ వరుణ్ణి తెచ్చుకుంటే వంకలెన్నడానికా నువ్వు పెళ్ళికి వెళ్ళింది! చాల్లే వూరుకో" మందలిస్తూ పార్వతమ్మ లోపలికి వెళ్ళిపోయింది.

ప్రకాశానికి యిదేమిటో విపరీతమనే అనిపించింది పెళ్ళి కొడుకు బాగా చదువుకున్నవాడు. పెద్ద ఉద్యోగం చేస్తున్నాడు. మరైతే పదిమందిలో ఎందుకిలా ఎబ్బెట్టుగా ప్రవర్తించాడు? మానవుడు సంఘజీవి. సంఘంలో తానూ ఒక్కడుగా మెలగుతూ తనకొక ప్రత్యేకతను, లేదా విశిష్టతను సంతరించుకోడానికి మానవునికి చాలా మార్గాలున్నాయి. ఎబ్బెట్టుగా ప్రవర్తించడం ఆ మార్గాల్లో ఒకటిగాకపోయినా, ప్రత్యేకతను నిలుపుకోడానికొక అడ్డుదారైతే కావచ్చు.

ఓనిర్ణయానికి వచ్చాడు ప్రకాశం. ఈనాడు శోభ తనకేమీ గాదు. కేవలం అన్యకాంత. పోగా ఆమె ముక్కుపచ్చలారని పసిబిడ్డ గాదు. భర్త అభిరుచులకు అనువుగా ఆమె తన జీవితాన్ని మలచుకోవచ్చు. లేక భర్తనే తన అభిరుచులకు అనువుగా సంస్కరించుకుని తనచీర చెంగువెంట త్రిప్పుకోవచ్చు ఈ రెండే గాక మరొక పద్ధతి సైతం లేకపోలేదు. "రథమునేనైతేను, రంగి చక్రాలు; మామనసులే మంచి గుర్రాలజోడు..." అన్న కవిగారి సూక్తి ప్రకారం ఆమె సంసారాన్ని మరింత శోభావహంగా గూడా చక్కదిద్దుకోవచ్చు. ఏది ఏమైనా తానిక శోభను గురించి ఆలోచనలు పెటుకోవలసిన అవసరమేమీ లేదు. (సశేషం)



## "పాత్రపడ"లో ఆదర్శ పాఠశాల

(38వ పేజీ తరువాయి)

భాషా సమస్యలకు సంబంధించిన వింత సంఘటనల దృష్ట్యా, యీ చిన్న గ్రామస్థులు చూపిన భాషా సమైక్యత, దూరదృష్టి, సంఘీభావము, విద్యాసక్తి-ఇవి ఆదర్శప్రాయములు కావా? దేశములో అస్సాము, పంజాబు మొదలైనచోట్ల తలయెత్తుచున్న భాషా సమస్యా పరిష్కారమునకు యీ గ్రామము మార్గదర్శకము కాదా? ఇంతకన్న "ఆదర్శ" మన్ననేమి? ఈ కీర్తి యంతయు ఆ గ్రామములోని శ్రీ అర్జున బిసాయివంటి గ్రామ పెద్దలకే దక్కినది. పాఠశాల ఏకోపాధ్యాయుడైన శ్రీ నక్క మునలయ్య కృషి ఫలితమే యీ గ్రామములోని విద్యావ్యాప్తి యందు గలిగిన చైతన్యము, ఇందుకు కృషి చేసిన గ్రామ సేవకుడు శ్రీ పి. భాస్కరరావుగారు కూడా (కంచలి గ్రూపు) ప్రశంస నీయులు. నిజముగా "పాత్రపడ" గ్రామములోని పాఠశాల ఆదర్శ పాఠశాల.

# పంచాయతీరాజ్య పురోగమనం

## మధ్యాహ్న భోజన కేంద్రం

శ్రీకాకుళం జిల్లా, రామభద్రాపురంలో గత అక్టోబరు 2వ తేదీన విద్యార్థుల నిమిత్తం ఉచిత మధ్యాహ్న భోజన కేంద్రాన్ని తెరిచారు గ్రామస్థులు స్వచ్ఛందంగా అందజేసిన విరాళాలతో దీనిని నడుపుతున్నారు.

## మోట బావులు

నెల్లూరు జిల్లా కొండపి పంచాయతీ సమితి ప్రాంతంలోని అనేక గ్రామాలలో మోటబావుల త్రవ్వకపు పనులు చురుగ్గా కొనసాగుతున్నవి. ఒక్కొక్క బావికి రూ. 750/-ల చొప్పున సబ్సిడీ ఇచ్చారు. 60 బావుల నిర్మాణం వివిధ దశలలో వున్నది సుమారు 50 ఎకరాల భూమికి కొత్తగా నీటిపారుదల సౌకర్యం కల్పించారు.

## రూ. 10,000 ల రసాయనిక ఎరువుల పంపిణీ

వరంగల్ జిల్లా పరకాల పంచాయతీసమితిలో 1961 సెప్టెంబరు నెలలో ఎరువుల వాడకం పథకం క్రింద రూ 10,000లు విలువ చేసే రసాయనిక ఎరువులను పంపిణీ చేశారు.

## ఫలించిన పాదయాత్ర

ఆలేరు పంచాయతీసమితి అధ్యక్షుడు, బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు, నల్గొండ అసిస్టెంట్ రేడియో ఇంజనీరు తదితరులు ఆలేరు పంచాయితీసమితిలోని అయిదు గ్రామాలలో పాదయాత్ర చేసి ప్రాథమిక ఆరోగ్యకేంద్రం స్థాపన నిమిత్తం రూ 6,440ల మొత్తం సేకరించారు. ఈ కేంద్రంలో ఆరు పడకలను ఏర్పాటు చేస్తారు.

## ప్రజల విరాళంతో సభామందిరం నిర్మాణం

పుట్లూరు పంచాయతీసమితి చింతలపల్లి గ్రామం యువజన మండలివారు సుమారు రూ 4,000ల వ్యయంతో సామూహిక సభామందిరాన్ని నిర్మించారు ఈ నిర్మాణ వ్యయాన్ని పూర్తిగా వారు గ్రామస్థుల నుంచి విరాళంగా సేకరించారు.

## యువజన సంఘాలు

కరీంనగరం జిల్లా సుల్తానాబాదు పంచాయతీసమితిలో గత సెప్టెంబరు నెలలో నాలుగు యువజన క్లబ్బులను స్థాపించుకున్నారు. వీటి సభ్యుల సంఖ్య 95

## లంబాడీ యువకులచే పాఠశాల భవన నిర్మాణం

నల్గొండ జిల్లా, మిర్యాలగూడెం పంచాయితీసమితిలోని తుంగపహాడ్ గ్రామంలో లంబాడీ యువకులు ఇటీవల ప్రాథమిక పాఠశాల కొరకు ఒక కచ్చా భవనాన్ని నిర్మించారు.

## ఆరుబయలు రంగస్థలం

కోటొూరట్ల పంచాయతీసమితి కార్యాలయావరణలో గత అక్టోబరు నెలలో ఆరుబయలు రంగస్థలాన్ని నిర్మించారు.

## 100 ఎరువుగుంటల నిర్మాణం

కడప జిల్లా వెల్లవలికంద్రిక గ్రామ ప్రజలు ప్రతి కుటుంబానికీ ఒక ఎరువు గుంటను నిర్మించుకోటానికి నిశ్చయించుకున్నారు. ఈ గ్రామస్థులు ఇప్పటికే 100 ఎరువు గుంటలను త్రవ్వారు.

## జాతీయ పొదుపు పత్రాలకు పెట్టుబడి

మెదక్ జిల్లా రామాయంపేట పంచాయతీసమితిలోని నార్సింగిలో 1961 సెప్టెంబరు 26వ తేదీన "జాతీయ పొదుపు దినోత్సవం" జరిగింది. ఉత్సవానికి హాజరైన గ్రామస్థులు అక్కడికక్కడే రూ, 525లు విలువచేసే పొదుపు పత్రాలు కొన్నారు.

# ? ? ?
# ప్రశ్నోత్తరావళి

ప్రశ్న : 199 శ్రీ జి.వి. రాఘవులు, పందలపాక, తూ.గో. జిల్లా.

రామపాదసాగర్ ప్రాజెక్టును ఎప్పుడు ప్రారంభిస్తారు? దీనికి ఎంత ఖర్చవుతుంది? ఈ ప్రాజెక్టు క్రింద ఎంత భూమి సాగవుతుంది?

సమా : రామపాదసాగర్ ప్రాజెక్టు పథకాన్ని సమగ్రంగా పరిశీలించిన మీదట గోదావరీనదికి అడ్డంగా ఇపూ్పరు వద్ద ఆనకట్టనూ, పోలవరం వద్ద బరాజ్‌ను నిర్మించి ఉభయ పార్శ్వాలనుంచీ రెండు కాలువలను నిర్మించటం ఉచితమని తలంచబడినది. రామపాదసాగర్ ప్రాజెక్టువల్ల కలిగే ప్రయోజనమే ఈ పథకాన్ని పూర్తిగా అమలు పరచటంవల్ల కూడా కలుగుతుంది దీనిక్రింద గోదావరి డెల్టా ప్రాంతంలో సుమారు 4 లక్షల ఎకరాలలో రెండవ పైరుకు నీటి పారుదల చేయటానికి తలపెట్టారు ప్రధమ దశలో సుమారు రూ. 14 00 కోట్ల వ్యయంతో ఆనకట్ట నిర్మించటానికి ఉద్దేశించబడినది. దీనికి మంజూరీ లభించవలసి వుంది ఈ పథకాన్ని తృతీయ ప్రణాళికా కాలంలో చేపట్టటానికి తలపెట్టారు.

ప్రశ్న: 200 శ్రీ జి. సురేంద్రరెడ్డి, బోత్, ఆదిలాబాదు జిల్లా, బద్వేల్ తాలూకాలో మాడూరు ప్రాజెక్టును ప్రభుత్వం మంజూరు చేసినదా? దీనికి ఎంత మొత్తం కేటాయించారు? పని ఎప్పుడు ప్రారంభింపబడుతుంది?

సమా: మాడూరు ప్రాజెక్టు (కడప జిల్లా)కు సంబంధించి, ఆ పథకానికి సంబంధించిన సూపరింటెండింగ్ ఇంజనీరు అందజేసిన ప్లానులనూ, అంచనాలను, అంతకంటే తక్కువ ఖర్చుతో ఎక్కువ ప్రయోజనాత్మకంగా వుండే లాగున పథకాన్ని సిద్ధంచేసే నిమిత్తం ఆయనకు తిరిగి పంపించారు. ఆయన నివేదిక అందవలసి వుంది. చెరువుల అభివృద్ధి పథకాలక్రింద మూడవ ప్రణాళికలో ఈ పథకాన్ని చేర్చటానికి తలపెట్టారు.

ప్రశ్న: 201 శ్రీ బొంతల వెంకట సుబ్బయ్య, గండిపాలెం.

గండిపాలెం (ప్రాజెక్టుఉదయగిరి తాలూకా, నెల్లూరు జిల్లా) ఎప్పుడు ప్రారంభింపబడుతుంది?

సమా: గండిపాలెం ప్రాజెక్టు పనులకు సంబంధించిన సమగ్ర ప్రణాళికలు అంచనాలు పరిశీలనలో వున్నాయి. అంచనాలను ప్రణాళికా సంఘం, కేంద్ర జలవిద్యుత్సంఘం ఆమోదించవలసి వుంటుంది. ఈ పథకాన్ని ఎప్పుడు ప్రారంభించేదీ ఇప్పుడే చెప్పటానికి సాధ్యం కాదు

ప్రశ్న: 202 శ్రీ జి. సురేంద్రరెడ్డి, బోత్,

(అ) గోదావరి ఉత్తర కాలువ ప్రాజెక్టు, కడం ఆనకట్ట గండిని పూడ్చటానికి ఎంత కాలం పడుతుంది?

(ఆ) వర్క్‌షాపును అక్కడినుంచి తరలిస్తున్నారా?

సమా: (అ) గో ఉ కా ప్రా., కడం ఆనకట్ట పునర్నిర్మాణం బహుశా 1962 డిశెంబరులో పూర్తి కావచ్చు.

(ఆ) ప్రాజెక్టు నిర్మాణం అన్ని విధాలా పూర్తయిన తరువాత అక్కడ (కడం) వర్క్‌షాపులు వుండనవసరం లేదు.

ప్రశ్న: 203 శ్రీ వేలూరి వైద్యనాథ్, చిరివాడ, గన్నవరం తాలూకా కృష్ణా జిల్లా.

చిరివాడ గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరా లభించటానికి ఎంత కాలం పట్టుతుంది?

సమా: చిరివాడ (గన్నవరం తాలూకా, కృష్ణా జిల్లా) గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరాను విస్తరింపజేసే పథకం ఇదివరకే మంజూరైనది. సాధన, సంపత్తులు సమకూరిన వెంటనే ఈ పథకం చేపట్టబడుతుంది.

# ప్రజాస్వామ్యం - మానవులు

"వాఙ్మయ మహాధ్యక్ష"

అతివృష్టులు అనావృష్టు
లావరించి దేశంలో
తినడానికి తిండిలేక
మొలచుట్టూ బట్టలేక
అంతూ పంతూ లేని
ఆపద లన్నీ వచ్చి
ప్రజలంతా యమయాతన
పడుతుంటే స్వార్థంతో
దేశం అధికారాలను
తెగనమ్మక దిగమింగక
బ్రతుగులొడ్డి ధైర్యంతో
శక్తి యుక్తు లెల్లచూపి
తెలివితోడ కష్టాలను
తొలగించే మనవేతలె
దేశమాత పుత్రులురా!
ప్రజారాధనీయులురా!

* * *

అభ్యుదయం ఒకవైపు
యుద్ధభయం మరోవైపు
పడుగూపేకై కలిసి
పెనవేసుక పోతుంటే
అయోమయంగా దేశం
అంకత్తెరలో పడగా
నిత్యం ప్రజలందరికీ
అత్యవసరమౌ సరుకుల
ధరవరలన్నీ పెంచక
దగారేట్లతో బ్రతుకులు
దోచేతత్వం లేక
పెంజీకటి అంగళ్లను
పచ్చిదొంగ వర్తకాలు
మచ్చుకైన చేయకుండ
మనగలిగిన వ్యాపారులె
మానవతామహితులురా!
మాననీయ చరితులురా!

* * *

బహూతరాల దేశదాస్య
బంధనాలు తెగగొట్టి
స్వతంత్రతాగరిమ వెలుగ
ప్రజాప్రభుత్వం నిలిపి
అహోరాత్రో చేసి
అభ్యుదయం సాధిస్తూ
ప్రాజెక్టులు కట్టిస్తూ
ఫ్యాక్టరీలు పెట్టిస్తూ
యెనలేని దేశసేవ
అనవరతం చేస్తుంటే
యెలుక మీద పిల్లినుంచి
పిల్లి మీద యెలుకనుంచి
అల్లరి చిల్లరి మూకల
ఉల్లములను కొల్లగొట్టి
కల్లలతో కపటాల్తో
కల్లోలంరేపకుండ
సమ్మెలని కట్టకుండ
సభలంటూ పెట్టకుండ
సంఘం క్షేమం కోరి
సహకరించు మానవులే
నరజాతికి సిరులురా!
సురజాతికి విరులురా!

— నా "ప్రజానీతి" నుంచి.

# కుటుంబ నియంత్రణము

శ్రీ దివాకరుని వెంకట సుబ్బారావు

కుటుంబ నియంత్రణము కుటుంబసౌఖ్యమును, కుటుంబము నందలి వారల ఆయురారోగ్యములను కాపాడును. క్రమ సలహాలు పొందుటవలన తల్లికి కలుగు అధిక గర్భములు నిరోధింపగలము కుటుంబమందు అవసరమగు బిడ్డలను పొందవచ్చును బిడ్డల ఆరోగ్యము కాపాడవచ్చును కుటుంబమందలి ఆర్థికస్థితి అభివృద్ధి పొందుటయేగాక సుఖజీవనము లభించును. తల్లితండ్రులు తమ బిడ్డల సౌఖ్యమును, అభివృద్ధిని కాపాడగల శక్తివంతులగుదురు. అధికగర్భోత్పత్తి గాకుండ కాపాడుట కుటుంబ నియంత్రమందలి భాగము. ఆయుర్భాగ్యము, జీవన సదుపాయము, గర్భస్రావము, క్రమ కాలగర్భధారణ కూడ కుటుంబ నియంత్రణయందలి భాగములు.

## భారత దేశమందలి జనాభా వివరములు

**1901—235.5** మిలియన్లు, 1911—249.0 మిలియన్లు, 1921—248 1 మిలియన్లు, 1931—275.3 మిలియన్లు, 1941—312,8 మిలియన్లు, 1951—356 9 మిలియన్లు. గత 50 సంవత్సరములలో 121.4 మిలియనుల ప్రజలు అధికమగుట కాననగును. మన దేశమందు, 1000 కి 40 వంతున జననము 1000 కి 27 వంతున మరణములు గలుగుచున్నవి. అనగా జనసంఖ్య 100కి 1.3వంతున అభివృద్ధినొందుచున్నది దాని ఫలితముగా ప్రతి సంవత్సరమునకు 4 5 మిలియన్ల ప్రజలు ఎక్కువగుచున్నారు. 1981 సంవత్సరము నాటికి మనదేశ మందలి ప్రజా బాహుళ్యము గమనించిన మనకున్న ఆహారధాన్యములు చాలక, కష్టముల పాల్గావలసివచ్చుననుట అతిశయోక్తి కాదు. ప్రస్తుత పంచవర్ష ప్రణాళికల ఫలితముగా మనకు కొంత శ్రమతగ్గును గాని మనదేశము ఆహారకొరత నుండి బయల్పడగలదను ధైర్యము చాలదు మనదేశమందు శిశుమరణములు 1000 కి సంవత్సరమునకు 134 వంతున అంచనావేయబడినది 1901 వ సంవత్సరమున 215 వంతున గల్గిన శిశు మరణములు 1951 నాటికి 81 తగ్గినవి. ఈ మరణములకు అనేక కారణము లున్ననూ, కుటుంబ నియంత్రణలేని కొదువవలన గల్గుమరణములు అధికమని చెప్పగలము అభివృద్ధినొందిన దేశములకు పోల్చి జూచిన శిశుమరణముల సంఖ్య మనదేశమందు షుమారు 5 రెట్లు ఎక్కువగా కన్పించుచున్నది. అమెరికాయందు 29, ఇంగ్లండు నందు 30 మాత్రమే శిశు మరణములు గల్గుచున్నవి. 20 జిల్లాలు గల్గిన ఆంధ్రప్రదేశమందు 36 00 మిలియనుల ప్రజలున్నారు. ఇందు 29 30 మిలియనులు గ్రామవాసులు, 6.30 మిలియన్లు పట్టణవాసులు కుటుంబ నియంత్రణ కార్యక్రమము ఆంధ్రప్రదేశమందు 13 జూన్ 1957 న ప్రారంభింపబడినది. 12 గురు సభ్యులుగల సంఘమేర్పడి ఈ కార్యనిర్వహణ బాధ్యతవహించినది. మొదటి పంచవర్ష ప్రణాళిక యందు రూ. 1,44,207, రెండవ పంచవర్ష ప్రణాళికయందు రూ 2,87422 వెచ్చింపబడినవి. పట్టణములందు 15, గ్రామములందు 87 కేంద్రములు స్థాపింపబడినవి. 1961 నాటికి పట్టణములందు 62, గ్రామములందు 478 కుటుంబ నియంత్రణా కేంద్రములు స్థాపింపబడినవి.

జనాభివృద్ధి గమనించిన పలువురు నిపుణులు భావి ప్రపంచమందు ప్రజలకు రానున్న కష్టసుఖములు గమనించుట, నివారణోపాయములు ఆలోచించుట 18 వ శతాబ్దమందు ప్రారంభమయ్యెను మాల్తస్ అను ఒక ఆంగ్లేయ ఆర్థిక శాస్త్రవేత్త 19 వ శతాబ్ద ప్రారంభమందు, జనుల కష్టసుఖములు విచారించు అతనిపుస్తకమందు ఈ అంశమును స్పష్టము చేసెను ప్రపంచమందున్న అవకాశముల నతిక్రమించు ప్రజాబాహుళ్యమువలన వారి భోజన సౌఖ్యములకు, వస్త్రములకు, వసతికి పలు కష్టములు రానున్నవని అభిప్రాయపడెను తన్మూలకముగా దరిద్రము, కరువు, జనులను కష్టములపాలు చేయునని, ప్రజలు రోగములకు గురియై అకాల మరణములనొందుదురని, మిగిలిన వారు కరువు కాటకములకు గురియగుటవలన శరీర పటుత్వము లేక మనో బలహీనులగుదురని భావించి ఈ కష్టముల నుండి బయల్పడుటకు కుటుంబ నియంత్రణమే శరణ్యమని వక్కాణించెను. కొంతకాలము గడువగా, శాస్త్రవేత్తలు ఇతని అభిప్రాయము సరికాదని తలచిరి.

ప్రపంచమందు ఆహార ధాన్యముల ఉత్పత్తి క్రొత్త పద్ధతులవలన అభివృద్ధినొందుట, నివసించుటకు తగు వసతులు ఎక్కువగా నేర్పరచుటకుగల మార్గముల నవలంభించుటవలన రాగల మార్పులు ఈ సమస్య నెదుర్కొనగలవని ఊహించిరి. క్రమముగా కల్గిన అభివృద్ధి గమనించిన జనబాహుళ్య సమస్య, ప్రథమమున నూహింపబడినంత భయముల కొంత వరకు తగ్గించినదిగాని పూర్తిగా రహితముగాలేదు. నాగరిక దేశములందలి ప్రజలు ఇది గమనించి తమ దేశములందు పరిశ్రమలను, ఉత్పత్తిని అనేక మార్గముల నభివృద్ధి జేసిక్కొనిరి. కుటుంబ ఆదాయమభివృద్ధికాగా, సంతాన నిరోధమవలంభించి తమ కుటుంబముల సుఖజీవనమునకు భంగము రాకుండ కాపాడుకొనవలసిన బాధ్యత గుర్తించిరి. వివాహముల యుక్తవయస్సువచ్చు నంతవరకు చేసికొనరైరి స్త్రీలు తమ బాధ్యతల గుర్తెరిగి కుటుంబ ఆర్థికస్థితి అభివృద్ధి చేయుటకు సంపాదనకు కడంగిరి మన దేశమందు ఇట్టి అవకాశము లింకనూ ప్రజలకందుబాటులోనికి రాలేదు, క్రమముగా అభివృద్ధి గాన్పించుచున్నది. ఇందుకు సహాయ్యముగా ప్రభుత్వమువారు చేసిన శాసనములు, ప్రజలఆదరాభిమానములు పాఠకులెరుంగుదురు. కుటుంబ నియంత్రణావశ్యకత గుర్తించిన మన నాయకుల అభిప్రాయములు:—రవీంద్రనాథ టాగూరు—కుటుంబ నియంత్రణ మార్గము స్త్రీలపాలిటి కల్పతరువు. తరచుగాగల్గు గర్భప్రాప్తివలని కష్టముల నివారింప వచ్చును తల్లుల ఆరోగ్యమభివృద్ధినొందును. ఆహారధాన్యముల కొరతగల్గిన మన దేశమందు అధిక సంతానమువలన కుటుంబమునకు కష్టములు తప్పవు పోషించుటకు శక్తిలేని కుటుంబములందు అధిక సంతానము పాపకారణము, అమాయక జీవులైన బాలల కష్టములకు గురుజేసి వారి మరణములకు తోడ్పడుటకంటె సంతాననిరోధము సంతోషముతో నిర్వహించుట ఉత్తమము.

డాక్టర్ యస్. రాధాక్రిష్ణన్—మాతృ ఆరోగ్యరక్షణను, శిశువుల భావి ఔన్నత్యమునకు సంతాన నిరోధనము అవసరము. ప్రజలు ఈ నీతిని గ్రహింతురు గాక.

శ్రీ జవహార్‌లాల్ నెహ్రూ— మనదేశమందలి ప్రజలు సుఖముగా జీవించుటకు మార్గములన్వేశించుట ప్రధానము మన సుఖ జీవనమునకు అనేక కారణములాటంకములైననూ, అధిక సంతానము అందు ముఖ్య కారణము. ఇది గమనించి ప్రజలు కుటుంబ నియంత్రణమవలంభిపవలసిన ఆవశ్యకత గుర్తింపవలెను ఇది అందరూ గమనించి దేశాభివృద్ధికి తోడ్పడగలరని విశ్వసించుచున్నాను.

శ్రీ పండిత గోవిందవల్లభపంతు— ముఖ్యముగా మన దేశము అధిక జనసంఖ్య వలని ఆపదలకు లోనగుచున్నది. కరువులు నిరోధించుటకు కుటుంబనియంత్రణ ఆచరింపవలెను.

శ్రీమతి ధనంవ్వతి రామారావు— కష్టములు, దుఃఖములు రాకుండ ప్రజలు సుఖింపవలెనన్న కుటుంబనియంత్రణమే ఆధారము. వేరొక మార్గములేదు. ఇందువలన మాతాశిశువుల ఆరోగ్యమభివృద్ధి నొందుటయే గాక కుటుంబ సౌఖ్యము చేకూరగలదు. ప్రతి జీవి సుఖజీవము నాసించుట వాని జన్మ హక్కు. ఇట్టి హక్కులనుభవించి సుఖించుటకు కుటుంబనియంత్రణము మూల సాధనము.

తల్లితండ్రులు, శిశువులు కుటుంబమందలి సభ్యులు. జననము సాంఘికముగాదు. ఇది జీవ సంబధ పరిణామము. పశుపక్ష్యాదులయందు సంపర్క కాలములు నిర్ణయింపబడి యున్నవి. మనుష్యున కివి లేవు. మానవుల యందు శిశుపోషణ భారము తల్లితండ్రుల బాధ్యత. ఏలన శిశువులు పెద్దలై స్వశక్తిచే సంపాదించు కొనగల సామర్థ్యమేర్పడు వరకు వారిని తల్లితండ్రులే పోషింపవలెను. సగటున 15-18 సంవత్సరముల ప్రాయము వరకు ఈ బాధ్యత తల్లితండ్రులకు తప్పదు. శిశుజననము మొదలు పోషణ బాధ్యత అభివృద్ధి నొందుచున్నది. వారి విద్యా సౌకర్యములకు అధికద్రవ్యము వెచ్చింపవలసి యున్నది. ఇట్టి బాధ్యతల నిర్వంహించుట శిశువులు అధికముగ జన్మించిన సామాన్య కుటుంబీకులైన తల్లితండ్రులకు కష్టము. కుటుంబ బాధ్యత వహించువారు తమ భార్యా పిల్లల బాధ్యతయేగాక తమపైని ఆధారపడియుండు వృద్ధులగు తల్లితండ్రుల బాధ్యతగూడ వహింపవలెను వివాహము చేసికొనుట, పిల్లలగనుట ప్రారంభ దశయందు ఉత్సాహకరమైననూ, రానురాను, కుటుంబ భారము అధికమైన కొలది కష్టదాయమగుట తెలిసిన విషయమే. బహుభార్యాత్వము వలని కష్టములు అనేకములని గ్రహించి ప్రభుత్వమువారు కుటుంబముల రక్షించుట కొరకు ప్రతి మానవుడు ఒక భార్యనే గలిగి యుండ వలెనని శాసించిరి. ఇందువలన మానవుడు గృహమందలి బాధ్యతల నిర్వర్తించుట, కుటుంబమందలి సభ్యుల యందు ప్రేమాస్పదములు గలిగియుండుట మొదలుగా గల అనేకములైన తన ధర్మముల పరిపాలించుట కవకాశమేర్పడుచున్నది. ఇందు మూలకముగా వివాహము ఫలదాయకమగుచున్నది. కుటుంబనియంత్రణమనగా కుటుంబ ఆరోగ్యము, సంతోషము కాపాడుట, ఇట్టి ముఖ్యమార్గము జీవితమందు ప్రతి మానవునకు

అవసరము. ఈ మార్గమవలంభించుటకు మార్గముల నభ్యసించుట యుక్త వయస్సునుండి తెలిసికొనుట క్షేమము. ఈ పరిజ్ఞానము తన కుటుంబ రక్షణకే గాక, దేశ క్షేమమునకు గూడ ఎక్కువగా సహకరించును. దేశమందు కుటుంబము ప్రధమ స్థానము వహించి యున్నది. అనేక కుటుంబముల కూటమి గ్రామము లేక పట్టణము. అనేక పట్టణ, గ్రామముల కూటమి దేశముకదా. కుటుంబములు సౌఖ్యవంతములైనగాని దేశము సౌఖ్యవంతము గ నేరదు ఇట్టి సౌకర్యముల చేకూర్చుటకు అనేక ప్రయత్నములు జేయబడు చున్నవి. 3 లేక 4 పిల్లలు గల కుటుంబములు నివసించుటకు తగు గృహముల నిర్మించుట, పాంఘికవృత్తులకు ధన సహాయ్యము చేయుట, గర్భవతులైన స్త్రీల పరీక్షించి వారి ఆరోగ్యము కాపాడు టకు వైద్య సహాయ్యము, ఆరోగ్యకేంద్రములు స్థాపించి బాల బాలి కల ఆరోగ్య మభివృద్ధి పొందించు మార్గములు, పాఠశాలలందు బీద విద్యార్థులకు భోజన వసతులు, గర్భవతులగు స్త్రీలకు జీత నష్టముగాకుండ సెలవు సౌకర్యములు, తల్లితండ్రులు లేని బిడ్డ లకు ధన సహాయ్యము, తక్కువ జీతముల సౌకర్యములతో విద్య నభ్యసించు వసతులు, స్త్రీలకు తగు ఉద్యోగ ప్రాప్తి, గర్భధారణాది విషయముల తెల్పు సంస్థలు, ఇత్యాది వసతులు నాగరిక దేశము లందు ఆచరించుట మనము చూచుచున్నాము. మన దేశమందే గాక, మన ఆంధ్రావనియందుగూడ ఇట్టి సౌకర్యములు అభివృద్ధి నొందుచున్నవి. ఇట్టి వసతుల నేర్పరుచుటకు, కుటుంబములు సుఖముగా జీవించు సదుపాయాములు జేయుట, అనవసరమగు సంతానము నిరోధించి, తగు సంతానము ఆరోగ్యవంతులై అభి వృద్ధిపొందు అవకాశముల గల్పించుట ముఖ్యోద్దేశము. అవసర మగునంతవరకు గల్గిన సంతానము మాతా పితృల ప్రేమ నొందు టయేగాక, దేశ క్షేమమునకు తోడ్పడును. ఈ హితవులవలన సంతాన నిరోధము లేక కుటుంబనియంత్రణ మన దేశమందు ముఖ్యమని గమనింప బడినది. ఇది అవసరము, త్వరలో అందరూ ఆచరింపవలసినదను బాధ్యత గుర్తింపవలెను.

పైన వివరింపబడిన జననమరణ లెక్కల పరిశీలించిన మన దేశమందున్న ప్రస్తుత స్థితి విశదమగును. జననమరణ సంఖ్యలు సమానములైన ఇట్టి ప్రమాదము వాటిల్లదు. క్రమముగా, మరణములకు హేతువులగు రోగముల కట్టుబాట్ల యందుంచుటకు నిపుణ వైద్య సహాయ్యము అభివృద్ధినొందుట, ఆహారకొరత తీరుటవలన జననములు మరణములకన్న ఎక్కువగా నున్నవి. ఆహారము, వస్త్రములు, నివసించ తగు క్రమమందుండినగదా జీవన సౌఖ్యము లభించును. అందుకు జననములు తగ్గవలెను. ఆ స్థితిలో ప్రజలు ఇప్పటికంటె ఒక్కువ ఆర్థిక సౌఖ్యమును భవింపగలరు ప్రస్తుత పరిశీలనలననుసరించి ఆసియా ఖండ మందలి దేశములలో జననములు 1000 కి 40-50 వరకును, మరణములు 1000 కి 25-30 వరకు నుండగా ఆయు ప్రమాణము 30 నుండి 35 సంవత్సరములకు మించుట లేదు. కొద్ది మంది మాత్రమే 60 సంవత్సరములకు పైగా జీవించుచున్నారు. శిశు మరణములుగూడ ఎక్కువగా నున్నవి. 15 సంవత్సరముల ప్రాయ మునకు లోనైనవారు తల్లి దండ్రుల మీద ఆధారపడియుండుట తప్పదు. ఇట్టి వారు నూటికి 40 మంది మన దేశమందున్నారు. నాగరిక పాశ్చాత్య దేశములందు వీరు 20 నుండి 25 వరకు నున్నారు. ఈ తారతమ్యత గమనించిన మన దేశమందు తల్లి దండ్రుల బాధ్యతలు ఎక్కువని వారి కష్టములు వ్రాయనలవి గావని గ్రహింపనగును. శ్రమ జీవులు తమ సంపాదన వలన వీరిని పోషించుట కష్టమగుచుండ, దేశాభివృద్ధికి వారు చేయగల సేవ క్షీణించుటవలన దేశము అభివృద్ధినొందుట కష్టమగుచున్నది. పిల్లలు తగు విద్యనభ్యసించినగాని ఉత్తమ పౌరులై దేశసేవ చేయజాలరు. అధిక సంఖ్యాకులగు ప్రజలు మన దేశమందు బీదలగుటచే వారి సంతానము అభివృద్ధి నొందుటకు అవకాశములు తక్కువగుటయేగాక, దేశాభివద్ధి నిరోధింపబడుచున్నది. గాన ప్రజలు అభివృద్ధినొంది దేశము సౌభాగ్యవంతమగావలెనన్న కుటుంబ నియంత్రణ తప్పదు. అప్పుడు పిల్లలకు అవసరమగు సౌఖ్య జీవనమును, గృహ పరిసర వసతులు, వస్త్రాది సౌఖ్య ములు, విద్య, వారు యుక్తవయస్కులు అగునపుడు తగు సంపా దనకుగల సదుపాయములు లభింపగలవు.

( ఇంకా వుంది )



# సంగ్రహ ప్రకటనలు

## పంటల పోటీలు

1960–61, 1961–62వ సంవత్సరాలలో వరి, జొన్న పంటలపోటీలను వేరువేరుగా నిర్వహించాలని ప్రభుత్వం ఆదేశించింది రాష్ట్రంలోని అన్నిజిల్లాలకు వరి పంటలపోటీ వర్తిస్తుంది. జొన్నపంట పోటీమాత్రం అనంతపురం కడప, కర్నూలు, నెల్లూరు, కృష్ణా, గుంటూరు, హైదరాబాదు, ఆదిలాబాదు, కరీంనగరం, ఖమ్మం, మహబూబునగరం, మెదక్, నల్లగొండ, నిజామాబాదు, వరంగల్లు జిల్లాలకు పరిమితం చేయబడింది. గ్రామం, బ్లాకు, జిల్లా, రాష్ట్రస్థాయిలలో యీ పోటీలను నిర్వహించి బహుమతులు ఇస్తారు. కర్షకులందరు అంటే కర్షక యజమానులు, కౌలుదారులు యీ పోటీలలో పాల్గొనవచ్చు. ప్రభుత్వ క్షేత్రాలు, పరిశోధనా సంస్థలుకూడా ఈ పోటీలలో పాల్గొనవచ్చు. అయితే బహుమతులకు మాత్రం వాటికి అర్హత వుండదు. ప్రతి భూఖండానికి రూ. 1 చొప్పున రుసుం చెల్లిస్తూ వ్యవసాయ విస్తరణాధికారికి గానీ లేదా బ్లాకులోని అగ్రికల్చరల్ అసిస్టెంటుకు గాని నిర్ణీత ఫారముపై దరఖాస్తులు పంపాలి. దరఖాస్తు ఫారములు స్వీకరించే ఆఖరు తేదీని జిల్లా వ్యవసాయ శాఖాధికారి తరువాత నిర్ణయిస్తారు.

## చర్మ పరిశ్రమ బోర్డు

చర్మకార పరిశ్రమ అభివృద్ధికి పథకాలు రూపొందించి, ఈ పరిశ్రమాభివృద్ధికై రాష్ట్రప్రభుత్వం కేటాయించిన మొత్తాలను వినియోగ పరిచేవిషయంలో ప్రభుత్వానికి సిఫార్సులు చేసేనిమిత్తం ప్రభుత్వం 10 మంది సభ్యులతో చట్టబద్ధమైన బోర్డు ఏర్పడే వరకు తాత్కాలిక చర్మపరిశ్రమ బోర్డును నియమించింది. మద్రాసులోని కేంద్రచర్మ పరిశోధన సంస్థ డైరెక్టరు డా. వై. నాయుడమ్మ బోర్డు అధ్యక్షుడుగా నియుక్తులైనారు. చట్టబద్ధమైన బోర్డు ఏర్పడే వరకు కానీలేదా 1961 అక్టోబరు 17 వ తేదీలగాయతు ఒక సంవత్సరం వరకు గాని ఏదిముందు జరిగితే అప్పటివరకు ఈబోర్డు పనిచేస్తుంది.

## సరోజినీదేవి ఆసుపత్రి

హైద్రాబాదులోని సరోజినీదేవి ఆసుపత్రిని నేత్ర వ్యాధుల చికిత్స, బోధనల ఆసుపత్రిగా ప్రకటించటానికి ప్రభుత్వం ఆదేశించింది దీనిలో 200 పడకలు ఏర్పాటుచేస్తారు హైద్రాబాదు ప్రజల సౌకర్యార్థం ఉస్మానియాజనరల్ ఆసుపత్రిలోనూ, సికింద్రాబాదు ప్రజల నిమిత్తం గాంధీ ఆసుపత్రిలోను కన్ను, ముక్కు, గొంతువ్యాధుల ప్రత్యేక విభాగాలను తెరవటానికికూడా ప్రభుత్వం ఆదేశించింది కన్ను, ముక్కు, గొంతు వ్యాధుల చికిత్సకు ప్రత్యేకంగా ఒక ఆసుపత్రిని తెరవాలని కూడా ప్రభుత్వం అనుకుంటున్నది. అందుకుగల అవకాశాలను పరిశీలించే నిమిత్తం ఒక ప్రత్యేకాధికారిని కూడా ప్రభుత్వం నియమించింది.

## నాగార్జున సాగర్‌కు "మనోరమ" సర్వీసు

నాగార్జునసాగర్, నాగార్జున కొండలను సందర్శించగోరే యాత్రికుల సౌకర్యార్థమై ప్రతి ఆదివారంనాడు లగ్జరీ కోచ్ "మనోరమ"ను నడపటానికి ఏర్పాట్లు జరిగినవి, 1961 డిసెంబరు 3వ తేదీ ఆదివారంనుంచి ఈ సర్వీసు ప్రారంభించ బడుతుంది. మధ్యాహ్నభోజనం, టీతోసహా రాకపోకలక్కు ఒకవ్యక్తికి రూ. 14ల చొప్పున చార్జీ తీసుకుంటారు. ఈ కోచ్ ఉదయం బయలుదేరి నాగార్జునసాగర్, నాగార్జునకొండలకు వెళ్లి సాయంత్రానికి తిరిగి వస్తుంది. ప్రస్తుతానికి ఇది వారానికి ఒకసారి (ఆదివారం) నడిచినా యాత్రికుల ఒత్తిడినిబట్టి అవసరమైనప్పుడు ఎక్కువసార్లు కూడా నడుపబడుతుంది.

## రాష్ట్ర గిడ్డంగుల సంస్థ

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రగిడ్డంగుల సంస్థడైరెక్టర్ల బోర్డుసభ్యులుగా యీ క్రింద పేర్కొన్న వ్యక్తులను కేంద్ర గిడ్డంగుల సంస్థ నామినేటు చేసింది. వీరి సభ్యత్వగడువు 1961 ఆగష్టు 5వ తేదీ నుంచి మూడు సంవత్సరాలు.

1. శ్రీ ఇ. బి. రాఘవయ్య, 2. శ్రీ జైరామ్ రెడ్డి, శ్రీ జె వి. సోమాయాజులు 4. డిప్యూటీ చీఫ్‌ఆఫీసర్, వ్యవసాయ పరపతిశాఖ, రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి. 5 డిప్యూటీ సెక్రటరీ-ట్రెజరర్, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, మద్రాసు స్థానిక హెడ్డాఫీసు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గిడ్డంగుల సంస్థ డైరెక్టరుగా రాష్ట్ర ట్రాన్సుపోర్టు కమీషనరుస్థానే రాష్ట్ర వ్యవసాయ శాఖమంత్రి వ్యవహరిస్తారు. రాష్ట్ర గిడ్డంగులసంస్థ డైరెక్టరుగా ట్రాన్స్‌పోర్టు కమీషనరు నామినేషన్ను ప్రభుత్వం ఉపసంహరించు కున్నది.

## పంచాయతీరాజ్య డిప్యూటీ కమీషనర్లు

కాకినాడ, కర్నూలు, హైద్రాబాదులలో పంచాయతీ రాజ్య డిప్యూటీ కమీషనర్ల ప్రధాన కార్యాలయాలను నెలకొల్పడానికి ప్రభుత్వం ఆదేశించింది. వారివారి అధికారం క్రింద ఉండే జిల్లాలు యీ దిగువరీతిగా ఉంటాయి:—

| | |
|---|---|
| 1. పంచాయతీ రాజ్య డిప్యూటీ కమీషనరు, కాకినాడరేంజి, కాకినాడ. | శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాలు |
| 2 పంచాయతీ రాజ్య డిప్యూటీ కమీషనరు, కర్నూలురేంజి. కర్నూలు | నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం కర్నూలు, మహబూబ్‌నగరంజిల్లాలు |
| 3. పంచాయతీ రాజ్య డిప్యూటీ కమీషనరు, హైదరాబాదు రేంజి, హైదరాబాదు, | హైదరాబాదు, నల్గొండ,ఖమ్మం వరంగల్లు, మెదక్, కరీంనగర్, నిజామాబాదు, ఆదిలాబాదు జిల్లాలు. |

## కార్మిక వివాదాలలో నిర్బంధ విధానాలు

కొన్ని కార్మిక సంఘాలు తమ కోర్కెలు ఆమోదింపజేయుట కొరకు, నిరాహారదీక్ష, సమ్మె మొదలైన విధానాలను అవలంభించే పద్ధతిని నిరూపిస్తూ ప్రభుత్వం 1960 జూన్ 11వ తేదీన పత్రికా ప్రకటన జారీచేసింది. అయినప్పటికీ కొన్ని కార్మిక సంఘాల కార్యవర్గ సభ్యులు, నాయకులు కార్మిక నియమావళి సాధారణ మార్గాల ద్వారా తమ వివాదలు పరిష్కరించుకోకుండా నిర్బంధ విధానాలను అనుసరిస్తూ క్రమశిక్షణా చట్టాన్ని ఉల్లంఘిస్తున్నారు. ప్రభుత్వం తమ విధానాన్ని పునరుద్ఘాటిస్తూ కార్మిక సంఘాల నాయకులు నిర్బంధ విధానాలను అవలంభించ వలదనీ. అట్టి చర్యలు తీవ్రమైనవిగానూ చట్టవిరుద్ధమైనవిగానూ పరిగణించబడతాయని ప్రభుత్వం హెచ్చరిస్తున్నది.

## సిమెంటు ధరల హెచ్చింపు

టారిఫ్ కమిషన్ సిఫార్సులను పురస్కరించుకొని భారత ప్రభుత్వం సిమెంటు ఎఫ్ ఓ ఆర్ ధరను 1961 నవంబరు 1వ తేదీనుంచి టన్నుకు రూ. 13/-ల చొప్పున హెచ్చించింది. 1961 అక్టోబరు 31వ తేదీ అర్ధరాత్రి తరువాత ఫ్యాక్టరీలనుంచి రవాణా చేయబడే సిమెంటు నిలువలన్నింటికీ ఈ హెచ్చింపుధర వర్తిస్తుంది సిమెంటు నిలువదార్లకుకానీ లేదా నేరుగా వినియోగదార్లకు కాని 1961 అక్టోబరు 31వ తేదీకి పూర్వం రవాణా చేయబడిన సిమెంటును పాత ధరకే (అంటే టన్నుకు రూ 122-60 న. పైలు) అమ్మవలెను అక్టోబరు 31వ తేదీ అర్ధరాత్రి తరువాత రవాణా చేయబడిన సిమెంటును టన్నుకు రూ. 135-60 న.పైల చొప్పున విక్రయించవలెను. సిమెంటు పాతధర, కొత్త ధరలను అందరికీ స్పష్టంగా కనిపించే విధంగా వ్రాసి వుంచవలసిందిగా స్టాకిస్టులందరినీ కోరడమైనది

## గ్రామాల మార్పిడి

భువనగిరి తాలూకాలోని యీ క్రింద పేర్కొన్న గ్రామాలను ఎక్సైజు వ్యవహారాల నిర్వహణ నిమిత్తమై హైదరాబాదు జిల్లా మేడ్చల్ తాలూకాలోని షమీర్‌పేట ఎక్సైజు రేంజిలో చేర్చటానికి ప్రభుత్వం ఆదేశించింది. రెవెన్యూ వ్యవహారాల నిమిత్తమై యీ గ్రామాలను మేడ్చల్‌తాలూకాకు బదిలీ చేయడం ఇది వరకే జరిగింది. ఆ గ్రామాలు ఇవి:— 1. ఉద్దెమర్రి 2 మోడె చింతలపల్లి 3. పెద్దలక్ష్మాపూర్.

## లైసెన్సుపొందిన ఎలక్ట్రికల్ కంట్రాక్టర్లు

1956వ సం.పు భారత ఎలక్ట్రిసిటీ నియమావళి ప్రకారం, విద్యుద్దీపాల బిగింపు, తత్సంబంధమైన ఏ పనినైనా రాష్ట్ర ప్రభుత్వం నుంచి లైసెన్సుపొందిన కంట్రాక్టర్లు మాత్రమే చేపట్టవల్సి ఉంటుంది.

చలామణిలోవున్న లైసెన్సులేని కంట్రాక్టర్లూ, అదేవిధంగా పునరుద్ధరింపబడని లైసెన్సులుగల కంట్రాక్టర్లు ఇట్టిపనులు చేపట్ట కూడదు.

కాబట్టి ప్రజలు విద్యుద్దీపాలను బిగించే పనులను కంట్రాక్ట రుకు అప్పగించేముందు అతనివద్ద చలామణిలోనున్న లైసెన్సు ఉన్నదీ లేనిదీ నిర్ధారణ చేసుకోవలసిందిగా విజ్ఞప్తి చేయడ మవు తున్నది.

## వర్క్సు కమిటీ

నూరు లేక అంతకంటే ఎక్కువ మంది కార్మికులు పనిచేసే కార్మిక సంస్థ లేదా ఈ ప్రకటన ఆంధ్ర ప్రదేశ్ గెజెటులో ప్రకటింపబడే తేదీకి పూర్వం 12 నెలలలో ఏ రోజునైనా నూరు మంది కార్మికులు పనిచేసిన ప్రతి పారిశ్రామిక సంస్థ యజమాని, 1947 వ సంవత్సరపు పారిశ్రామిక వివాదాల చట్టం (1), (3) వ సబ్ సెక్షన్లననుసరించి 1958 వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక వివాదాల నియమావళి 7 వ భాగంలో సూచించిన విధంగా వర్క్సు కమిటీని నియమించవలెనని సదరు చట్ట నిబంధనల క్రింద ప్రభుత్వం ప్రకటన వేసింది

## మురికిపేటల నిర్మూలనపై గోష్ఠి

హైద్రాబాదు సికింద్రాబాదు నగరాలలోనూ, ఒక లక్ష కంటే అధిక జనాభాగల ఇతర నగరాలలోను మురికిపేటల నిర్మూలనకు సంబంధించిన వివిధ విషయాలను చర్చించే నిమిత్తం మురికిపేటల నిర్మూలనపై ఒక గోష్ఠిని నిర్వహించటానికి ప్రభుత్వం నిశ్చయించింది. హైద్రాబాదులో 1961 డిసెంబరు 17, 18, 19వ తేదీలలో ఈ గోష్ఠి జరుగుతుంది రాష్ట్రంలో ఒక లక్ష కంటే ఎక్కువ జనాభాగల పట్టణ మునిసిపాలిటీల ప్రతినిధులు, భారత ప్రభుత్వం గృహ నిర్మాణాలు, సరఫరా మంత్రిత్వ శాఖకు చెందిన కొందరు అధికార్లు, భారత్ సేవక్ సమాజ్ ప్రతినిధులు గోష్ఠిలో పాల్గొంటారు.

## గరిష్ఠ వయః పరిమితి హెచ్చింపు

ఎస్. ఎస్ యల్. సి స్థాయిలో గ్రూపు IV సర్వీసులో నియామకానికై అభ్యర్థుల గరిష్ఠ వయఃపరిమితిని 25 సంవత్సరాల నుండి 21 సంవత్సరాలకు తగ్గిస్తూ, యీ నిర్ణయాన్ని 1964 జూలై 1 వ తేదీ నుండి అమలు చేస్తారని ప్రభుత్వం లోగడ ప్రకటించింది దీనిని పునః పరిశీలించిన తర్వాత పోలీసు రిజర్వు సబ్ యినస్పెక్టరు ఉద్యోగాలలో పట్టభద్రుల నియామన్ని ప్రోత్సహించడానికై గరిష్ఠ వయః పరిమితిని 23 సంవత్సరాలకు హెచ్చించటానికి ప్రభుత్వం నిర్ణయించింది. శరీర సౌష్టవం విషయంలో పోలీసు సబార్డినేటు సర్వీసులో సబ్ ఇనస్పెక్టర్ల నియామకానికి వర్తించే నియమాలే వీరికి కూగా వర్తిస్తాయి. కాబట్టి యీ వయః పరిమితి హెచ్చింపు అవసరమైంది యీ మార్పు కూడా 1964 జూలై 1 వ తేదీ నుండి అమలులోకి వస్తుంది.

## స్థానిక పరిపాలన ఇంజనీరింగ్ సర్వీసు

జిల్లా పరిషత్తులు, పంచాయతీ సమితులు, పంచాయతీలకు సంబంధించి పనిచేసే గెజిటెడ్, నాన్‌గెజిటెడ్ సిబ్బంది కొరకు 1961 నవంబరు 1 వ తేదీ నుంచి ప్రత్యేకంగానూ, స్వతంత్రంగాను ఇంజనీరింగ్ సర్వీసులను వ్యవస్థీకరించటానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఈ సర్వీసులలో దిగువ వారు వుంటారు: (1) (అ) పంచాయతీ ఇంజనీరింగ్ సబార్డినేటు సర్వీసు, (ఆ) స్థానిక పరిపాలన ఇంజనీరింగ్ సర్వీసు, (ఇ) రహదార్ల శాఖ స్వాధీనం చేసిన 7 సబ్ డివిజన్లు 28 శాశ్వత విభాగాలు, (ఈ) స్థానికాభివృద్ధి పనులు, గ్రామీణ రోడ్ల అభివృద్ధి పథకములకు సంబంధించిన పూర్తి సిబ్బంది (2) సమితి బ్లాకుల ఇంజనీరింగ్ సిబ్బంది, (3) మంజూరైన ఇతర అదనపు సిబ్బంది, (4) సమితి ఏర్పడని బ్లాకులు (ఏజన్సీ) బహుళార్థసాధక ప్రాజెక్టులలోని ఇంజనీరింగ్ సిబ్బంది, (5) కొత్తగా స్థాపించే బ్లాకులకు ఏకీకృత ఇంజనీరింగ్ సర్వీసుననుసరించి మంజూరు చేయబడే ఇంజనీరింగ్ సిబ్బంది (6) స్థానిక పరిపాలన సూపరింటెండింగ్ ఇంజనీరు, ఆయన సిబ్బంది, పై సర్వీసు క్రింద జిల్లాపరిషత్తు పంచాయతీ సమితులు, పంచాయతీలలో పనిచేసే నిమిత్తం ప్రతి జిల్లాకు ఒకరు చొప్పున నియోగింపబడిన 20 మంది ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లు, వారి సిబ్బంది.

కొత్తగా ఏర్పాటుచేసిన యీ సర్వీసులను (1) స్థానిక పరిపాలన ఇంజనీరింగ్ సర్వీసుఅనీ, (2) స్థానిక పరిపాలన ఇంజనీరింగ్ సబార్డినేటు సర్వీసు అని పిలుస్తారు వీటిలో మొదటి సర్వీసులో పైన పేర్కొన్న సిబ్బందిలోని గెజిటెడ్ ఉద్యోగులూ రెండవదానిలో నాన్ గెజిటెడ్ ఉద్యోగులు వుంటారు.

## ప్రజోపయోగకరమైన సర్వీసు

1947 వ సంవత్సరపు పారిశ్రామిక వివాదాల చట్టం నిమిత్తమై ప్రభుత్వం ఆసుపత్రులు, డిస్పెన్సరీల సర్వీసులను 1961 నవంబరు 2 వ తేదీ నుంచి మరో ఆరు నెలల వరకు ప్రజోపయోగకరమైన సర్వీసుగా ప్రకటించింది.

## పన్ను మినహాయింపు

భారత ప్రభుత్వం కేటాయించే చక్కెర ఎగుమతి కోటాల మేరకు ఆంధ్ర ప్రదేశ్‌లోని చక్కెర ఫ్యాక్టరీలనుంచి విదేశాలకు ఎగుమతి చేయబడే చక్కెరపై చెరకు పన్ను విధించకూడదని ప్రభుత్వం ఆదేశించింది.

# ప్రభుత్వ నిర్ణయాలు

* రాష్ట్రమంతటిలోకీ ఉత్తమంగా కృషిచేసే పంచాయతీలకు వివిధదశలలో బహుమతులు ఇవ్వటానికి రాష్ట్రప్రభుత్వం నిశ్చయించింది. ప్రతిబ్లాకులోను అత్యుత్తమ మైనదిగా ఎన్నికచేయబడే పంచాయతీకి రూ. 1,000 లను బహూకరిస్తారు. జిల్లా స్థాయిలో ఉత్తమమైనవిగా ఎన్నుకొనబడే పంచాయతీలకు రూ 5,000 ల చొప్పున ఇస్తారు. చివరన రాష్ట్రమంతటిలోనూ ఉత్తమమైనదిగా నిర్ణయించబడే పంచాయతీకి రూ 15 000 ల బహుమతి ఇస్తారు. బ్లాకు స్థాయిలో నిర్ణయాలు గైకొనే సెలక్షను కమిటీలలో బ్లాకు డెవలప్‌మెంట్ ఆఫీసరు, పంచాయతీ సమితి అధ్యక్షుడు, జిల్లా వ్యవసాయ శాఖాధికారి సభ్యులుగా ఉంటారు. జిల్లా స్థాయిలోని సెలక్షన్ కమిటీలలో కలెక్టరు, వ్యవసాయశాఖ డిప్యూటీడైరెక్టరు వుంటారు. రాష్ట్రస్థాయి సెలక్షన్ కమిటీలో ప్రధాన కార్యదర్శి, పంచాయతీరాజ్య కమీషనరు, ప్రణాళికాశాఖ కార్యదర్శి సభ్యులుగా వుంటారు.

* స్వాతంత్ర్యోద్యమ కాలంలో రాష్ట్రానికీ, దేశానికి స్వర్గీయ శ్రీ అల్లూరి సీతారామరాజు చేసిన సేవలకు గుర్తింపుగా ఈ విప్లవవీరుని సోదరుడైన శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుకు జీవితాంతం వరకు నెలకు రూ. 80/- ల చొప్పున పింఛను ఇవ్వటానికి ప్రభుత్వం నిశ్చయించింది. శ్రీ సీతారామరాజు సోదరులలో శ్రీ సత్యనారాయణ రాజు ఒక్కరే సజీవంగా వున్నారు.

* గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలో వజ్రాలపాడు వద్ద పులిచింతలపాడు వాగుకు అడ్డంగా రిజర్వాయరు నిర్మాణాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది. దీని నిర్మాణానికి రూ. 10,000,00 ఖర్చవుతుంది. పల్నాడు ప్రాంతంలోని చెంచు, లంబాడ ప్రజలకు ఇది ఎక్కువగా ఉపకరిస్తుంది

# విశేషాలు

## ఉపాధ్యాయులకు జాతీయ అవార్డులు

ఉపాధ్యాయుల కొరకు ఉద్దేశించిన జాతీయ అవార్డులలో అయిదింటిని ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయులుపొందారు. గత అక్టోబరు 31వ తేదీన క్రొత్తఢిల్లీలో జరిగిన అవార్డుల బహూకరణోత్సవంలో వాటిని పొందిన రాష్ట్రఉపాధ్యాయులు వీరు:

1. శ్రీ మున్షీ బనారసీదాస్ సక్సేనా
2. శ్రీ మహమ్మద్ రఫియుద్దీన్ సిద్దీఖీ
3. శ్రీ పట్నాయకుని నరసింహం
4. శ్రీ బి. యస్. ఠాకూర్
2. శ్రీ ఎస్. సుందరమూర్తి

## బాల సాహిత్యం

### ఇద్దరు తెలుగు రచయితలకు బహుమతులు

1961 వ సంవత్సరంలో జరిగిన ఏడవపిల్లల గ్రంథరచన పోటీలో గెలుపొందిన రచయితల పేర్లను విద్యామంత్రిత్వ శాఖ శాలూకు బాల సాహిత్యసంఘం ప్రకటించింది. ఏడుగురికి రూ. 1,000 చొప్పున, 21మందికి రూ. 5,00ల చొప్పున బహుమతులు లభించాయి.

శ్రీ రామారావు వ్రాసిన "పరమాణుకథ", శ్రీ కె. నరసింహాచారి రచించిన "బిడ్డల చేతిపనులు" అనే రెండు తెలుగు పుస్తకాలకు ఈ బహుమతులు లభించినవి.

## సాహసకృత్యానికి జాతీయ అవార్డు

### ఏలూరు బాలునికి లభ్యం

అసమానమైన ధైర్యసాహసాలు ప్రదర్శించినందుకు గాను ఈ సంవత్సరం జాతీయ అవార్డును బహూకరించటానికి ఏలూరుకు చెందిన చి.పిన్నమనేని నరసింహారావు అనే 16 సంవత్సరాల బాలుడిని భారత శిశు సంక్షేమ మండలి ఎన్నుకున్నది. ఈ బాలుడు ఏలూరు పోలీసు సబ్ ఇనస్పెక్టరు కుమారుడు. 1960 సెప్టెంబరు 2 వ తేదీన ఇతను నర్సాపూర్ తాలూకా బగ్గేశ్వరం గ్రామంలో అగ్నిజ్వాలలు అలుముకున్న ఇంటిలో చిక్కుబడిపోయిన 60 సంవత్సరాల ఒకవృద్ధస్త్రీని, అక్కడ చేరినవారంతా నిస్సహాయులై చూస్తూవుండగా ప్రాణాపాయానికి సైతం లెక్కచేయకుండా ఆ ఇంటిలోనికి దూరిరక్షించాడు

## తెలుగు గ్రంథకర్తకు టాగూరు అవార్డు

ఈ సంవత్సరం టాగూరు శత వార్షిక జయంతి ప్రత్యేక అవార్డులుపొందిన నలుగురు గ్రంథకర్తల పేర్లను కేంద్రసాహిత్య అకాడమీ నిర్ణాయక సంఘంవారు గత అక్టోబరు 27 వ తేదీన ప్రకటించారు. ఈ బహుమాన గ్రహీతలలో ఒకరైన శ్రీ ఆకురాతి చలమయ్యగారు ఆంధ్రప్రదేశ్ వాస్తవ్యులు.

శ్రీ చలమయ్య శాంతినికేతనంలో విద్యాభ్యాసం చేశారు. ఆయన టాగూరు రచనలను పెక్కింటిని తెనిగించారు. అంతేకాక కవీంద్రుని జీవిత చరిత్రను కూడా ప్రకటించారు.

క్రొత్తఢిల్లీలో గత నవంబరు 11వ తేదీన అంతర్జాతీయ సాహిత్యగోష్ఠి ప్రారంభోత్సవం సందర్భంలో ఉప రాష్ట్రపతి గ్రంథకర్తలకు బహుమతులు అందజేశారు.

# ప్రగతి పథంలో

(జిల్లాల నుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు)

## ఆదిలాబాదు

### గాంధీ జయంతి

ఆదిలాబాదులో గత అక్టోబరు 2వ తేదీన గాంధీ జయంత్యుత్సవాలు జరిగాయి. ప్రభాత భేరీతో ఉత్సవ కార్యక్రమం ఆరంభమైంది. స్థానిక బహుళార్ధసాధక ఉన్నత పాఠశాల విద్యార్థులు శ్రమదానం చేశారు. సాయంత్రం బహిరంగ సభ జరిగింది.

## అనంతపురం జిల్లా

### రాయలసీమ సహకార సంస్థ

అనంతపురంలో నిర్మించిన రాయలసీమ సహకార సంస్థ నూతన భవనానికి రాష్ట్ర సహకార శాఖామాత్యులు శ్రీ కల్లూరు చంద్రమౌళి గత అక్టోబరులో ప్రారంభోత్సవం చేశారు. రూ. 80 వేల ఖర్చుతో దీన్ని నిర్మించారు.

## కడప

### సాంఘిక సేవా శిబిరం

పెండ్లిమర్రి పంచాయతీసమితి కార్యాలయ సిబ్బంది గత సెప్టెంబరు 24వ తేదీన వల్లూరులో స్థానిక ఉన్నత పాఠశాల విద్యార్థుల సహకారంతో "సాంఘిక సేవా శిబిరాన్ని" నిర్వహించింది. ఈ సందర్భంగా వారు 1,000 గ్లిరిసిడియా మొక్కలు నాటారు. 10 ఎరువుగుంటలు త్రవ్వారు.

## చిత్తూరు

### తిరుపతిలో వ్యావసాయ కళాశాల

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు శ్రీ ఎస్. గోవిందరాజులు అక్టోబరు 27వ తేదీన తిరుపతిలో వ్యవసాయ కళాశాలకు ప్రారంభోత్సవం చేశారు దీనితో రాష్ట్రంలోని వ్యవసాయ కళాశాలల సంఖ్య మూడుకు పెరిగింది. వ్యవసాయమంత్రి శ్రీ నూకలరామచంద్రారెడ్డి కళాశాల, హాస్టలు భవనాలకు శంకుస్థాపన చేశారు.

### రాష్ట్ర పంచాయతీ సమ్మేళనం

తిరుపతిలో నాలుగు రోజుల పాటు జరిగిన ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమ్మేళనానికి అక్టోబరు 23వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

### తిరుపతిలో నౌకాదళ విభాగం స్థాపన

భారత నౌకాదళాధిపతి వైస్‌అడ్మిరల్ ఆర్. డి. కటారి అక్టోబరు 16వ తేదీన తిరుపతిలో ఎన్.సి.సి. 29వ నౌకాదళ విభాగానికి ప్రారంభోత్సవం చేశారు. ఆంధ్ర ప్రదేశ్‌లో స్థాపించిన నౌకాదళ విభాగాలలో ఇది అయిదవది. ఇది శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి అనుబంధపరిచిన మొట్టమొదటి విభాగం.

## గుంటూరు

### గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం

తాడికొండ పంచాయతీ సమితి కర్లపూడిలో అక్టోబరు 12వ తేదీన గ్రామసహాయకుల శిక్షణ శిబిరాన్ని ప్రారంభించారు. సమాజాభివృద్ధి కార్యక్రమాలవల్ల కలుగు ప్రయోజనాలను గూర్చి శిక్షితులకు వివరించారు. శిక్షణావకాశాలను ప్రయోజనాత్మకంగా వినియోగించు కోవల్సిందిగా వారికి ఉద్బోధించారు. శిక్షితులు "శ్రమదానం" ద్వారా గ్రామంలో కొన్ని మట్టిరోడ్లు నిర్మించారు.

### ఉచిత మధ్యాహ్న భోజనం

అక్టోబరు 12వ తేదీన జరిగిన మంగళగిరి పంచాయతీసమితి

సర్వసభ్యసమావేశంలో సమితికి చెందిన హరిజన ఎలిమెంటరీ పాఠశాలల విద్యార్థులకు ఉచితంగా మధ్యాహ్న భోజనం సరఫరా చేయటానికీ, రామచంద్రపాలెం, మలకాపురం, ఇనవోలు గ్రామాల లోని పాఠశాలలకు భవనాలు నిర్మించటానికి తీర్మానించారు

ఎలిమెంటరీ పాఠశాల భవనం

కృష్ణాయపాలెంలోని పంచాయతీ సమితి ఎలిమెంటరీ పాఠశాల భవనాన్ని అక్టోబరు 2'వ తేదీన ప్రారంభించారు. ఈ గ్రామం గుంటూరుకు 18 మైళ్ళ దూరంలో వుంది.

## హైదరాబాదు

మత్స్య ప్రదర్శనం

హైద్రాబాదులోని భారత ప్రభుత్వ మత్స్యవిస్తరణ విభాగం వారు రాష్ట్ర మత్స్యశాఖ సహకారంతో నవంబరు 11 నుంచి 17వ తేదీవరకు హైద్రాబాదు హుసేన్ సాగర్ మత్స్యక్షేత్రంతో మత్స్య పోషణ సప్తాహాన్నీ, ప్రదర్శనను నిర్వహించారు. ఇటువంటి ప్రదర్శనం జరగటం ఆంధ్రప్రదేశ్‌లో ఇదే మొదలు.

ఇరిగేషన్ పనులు

పంచాయతీసమితులనుంచి ప్రతిపాదనలు చేరిన అనంతరం జిల్లాపరిషత్తు నవంబరులో రూ 91,000 లు ఖర్చయ్యే 47 చిన్నతరహా ఇరిగేషను పనులను మంజూరుచేసింది

సమాజాభివృద్ధి కార్యక్రమం

ప్రణాళికా శాఖామంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి నవంబరు నెలలో పర్గి పూర్వ విస్తరణ బ్లాకుకు ప్రారంభోత్సవం చేశారు. దీనితో హైద్రాబాదుజిల్లా అంతటా సమాజాభివృద్ధి కార్యక్రమం విస్తరించింది. పర్గిపూర్వ విస్తరణ బ్లాకులో 147 గ్రామాలు, 51 గ్రామ పంచాయతీలు వున్నవి.

మేడ్చల్ కిసాన్ క్లబ్ ఆదర్శ కృషి

మేడ్చల్ కిసాన్ క్లబ్‌వారు జాతీయ పొదుపు ఉద్యమాన్ని ప్రారంభించారు. వారు రూ 60/–ల మేరకు పెట్టుబడులను సేకరించ గలిగారు.

కుత్బుల్లాపూర్‌ను "పొదుపుగ్రామం"గా ప్రకటించారు. ఈ గ్రామంలో 200 కుటుంబాలవారు రూ 310 లు విలువచేసే ఒక రూపాయి పొదుపు బిళ్ళలనూ, అయిదు రూపాయిల బాండ్లను కొన్నారు.

## కరీంనగరం

జిల్లా ప్రణాళిక

తృతీయ పంచవర్ష ప్రణాళిక జిల్లా పథకాలనూ, జిల్లాలోని బ్లాకుల పథకాలను సిద్ధంచేసే నిమిత్తం అక్టోబరు 21వ తేదీన పంచాయతీ సమితుల అధ్యక్షులు, బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్లు, జిల్లా అధికార్లు, రెవెన్యూ డివిజనల్ ఆఫీసర్ల ప్రత్యేక సమావేశం జిల్లాపరిషత్తు సమావేశ మందిరంలో జరిగింది.

ప్రాథమిక పాఠశాలాభవనం

గంగాధర బ్లాకులోని వెదురుగట్ట గ్రామంలో నిర్మించిన ప్రాథమిక పాఠశాలాభవనాన్ని అక్టోబరు 24వ తేదీన తెరిచారు. దీని నిర్మాణవ్యయం రూ 6,000 లు. ఈ మొత్తాన్ని ప్రజలే విరాళంగా ఇచ్చారు.

జాతీయ పొదుపు

ఈ జిల్లాలో 1961 ఏప్రిల్ నెలారంభంనుంచి 1961 అక్టోబరు 21వ తేదీవరకు రూ. 1,22,990ల మేరకు జాతీయ పొదుపు పత్రాలకూ, రూ. 45405ల మేరకు బహుమతి పత్రాలకు పెట్టుబడి లభించింది.

## ఖమ్మం

ఆటో టెలిఫోను ఎక్సేంజీ

భద్రాచలంలో నవంబరు 6వ తేదీన ఆటో–టెలిఫోను ఎక్ఛేంజికి ప్రారంభోత్సవం జరిగింది.

## కృష్ణాజిల్లా

లయోలా కళాశాలలో ప్రణాళికా సదస్సు

ప్రణాళికా వారోత్సవాల సందర్భంగా ఆంధ్ర లయోలా కళాశాల ప్రణాళికాగోష్ఠి నిర్వాహకులు నవంబరు 2వ తేదీన మూడవ ప్రణాళికపై ఒక సదస్సును ఏర్పాటు చేశారు మొదటి రెండు ప్రణాళికలలో సాధించిన ఫలితాలనూ, మూడవ ప్రణాళిక లక్ష్యాలను, ఇతర సమస్యలను గూర్చి విద్యార్థులు తమతమ వ్యాసాలను చదివారు.

జగ్గయ్యపేటలో గిడ్డంగి నిర్మాణం

జగ్గయ్యపేటలో నిర్మించిన గిడ్డంగికి వ్యవసాయ మంత్రి శ్రీ నూకల రామచంద్రా రెడ్డి అక్టోబరు 29వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. రాష్ట్రంలో స్థాపించిన గిడ్డంగులలో ఇది 21వది.

టెలిఫోన్ ఎక్స్ఛేంజి

దివి తాలూకా అవనిగడ్డలో అక్టోబరు 31వ తేదీన క్రొత్తగా టెలిఫోన్ ఎక్స్ఛేంజిని ప్రారంభించారు.

పారిశ్రామిక వాడలకు నివేశన స్థలం

సుమారు 20 యూనిట్లు ఉండే ఒక పారిశ్రామిక వాడ స్థాపనకు గాను రాష్ట్ర ప్రభుత్వం మచిలీపట్నం లోని మాచవరం గ్రామంలో, 20 ఎకరాల భూమిని మంజూరు చేసింది.

జగ్గయంపేటసమితి ప్రారంభోత్సవం

జగ్గయ్యపేట పంచాయతీ సమితికి అక్టోబరు 15వ తేదీన జిల్లాపరిషత్తు అధ్యక్షుడు ప్రారంభోత్సవం జరిపారు.

## కర్నూలు

వైద్య కళాశాల లైబ్రరీ హాలు

కర్నూలు వైద్యకళాశాల ఆవరణలో రు. 265000 ల వ్యయంతో నిర్మింపబడిన లైబ్రరీ హాలు నూతన భవనానికి అక్టోబరు 31 వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు, సమావేశాలు జరగటానికి వీలుగా కూడా ఈ హాలును నిర్మించారు.

శ్రీశైలంలో అతిథి గృహాలు

శ్రీశైలంలో అతిథి గృహానికి జిల్లా పరిషత్తు ఉపాధ్యక్షుడు అక్టోబరు 19 వ తేదీన శంకుస్థాపన చేశారు. దీని నిర్మాణానికి గాను అంచనా వేయబడిన రు. 10000 లనూ జిల్లా పరిషత్తు, జిల్లాలోని వివిధ పంచాయతీ సమితుల ఉద్యోగులు 5000 మంది ఇచ్చారు. జిల్లా పరిషత్తు అధ్యక్షుడు మరొక అతిధి గృహానికి శంకు స్థాపన చేశారు. దీనికి రు. 60000 లు వ్యయమవుతుంది. ఈ ధనాన్ని జిల్లా పరిషత్తు నిధులనుండి ఖర్చు చేస్తారు.

## మహబూబ్‌నగర్

షాద్‌నగర్‌లో గిడ్డంగి శాఖ

షాద్‌నగర్‌లో గిడ్డంగి శాఖనొకదానిని అక్టోబరు 15 న తెరిచారు. ఈ సందర్భంలో మేనేజింగ్ డైరెక్టరు శ్రీ పి. శేషాద్రి శర్మ మాట్లాడుతూ, ఇప్పటికే 19 గిడ్డంగులు ప్రారంభించబడినవనీ ఇంకా అయిదింటిని తెరవడానికి ప్రతిపాదనలు జరిగినవనీ అన్నారు.

## మెదక్

ప్రాథమిక ఆరోగ్య కేంద్రం

నార్సింగిలో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని స్థాపించడానికిగాను రామాయంపేట పంచాయతీ సమితి అక్టోబరు 15 న రు 38000 ల మొత్తాన్ని మంజూరు చేసింది. బ్లాకు హెడ్‌క్వార్టర్సులో ఒక కేంద్ర గ్రంథాలయాన్నీ, అన్ని గ్రామ పంచాయతీలలోను మొత్తం 41 గ్రంథాలయాలనూ తెరవడానికి కూడా సమితి నిశ్చయించింది.

## నల్గొండ

గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం

భువనగిరి పంచాయతీ సమితి అధ్వర్యాన అనంతారం. గ్రామంలో అక్టోబరునెలలో మూడు రోజుల పాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహింపబడింది. జిల్లా పౌర సంబంధాల యూనిట్టు వారు ఒక ప్రదర్శనను ఏర్పాటు చేశారు. ఉత్తమ గ్రామమైన ముంగోడు, పూర్తిగా మహిళాసభ్యురాండ్రుగల మట్టంపల్లి గ్రామాల ముఖ్య కార్యకలాపాలను తెలుపు పటాలను మొదలైనవాటిని దీనిలో ప్రదర్శించారు.

"నవభారత నిర్మాణం" ప్రదర్శన

కేంద్ర సమాచార, ప్రసార మంత్రిత్వ శాఖవారు నాగార్జున సాగర్ ఆనకట్ట స్థలంలో అక్టోబరు 27 వ తేదీ నుండి ఒక వారం దినాల పాటు "నవభారత నిర్మాణం" ప్రదర్శనను నిర్వహించారు. నాగార్జున సాగర్ ప్రాజెక్టు స్థలంలోని పనివారి ప్రయోజనార్థం దీనిని ఏర్పాటు చేశారు. పంచవర్ష ప్రణాళికలకు సంబంధించిన సమాచారాన్ని చిత్ర పటాలు మొదలైన వాటి సహాయంతో సందర్శకులకు తెలియజేశారు. ప్రతి రోజూ చలనచిత్ర ప్రదర్శనలు కూడా జరిగాయి.

ఆలేరు సమితి

ఆలేరు—మంటపురి రోడ్డు నిర్మాణానికై ఆలేరు పంచాయితీ సమితి అక్టోబరు నెలలో రు. 5000 లను మంజూరు చేసింది.

గౌరీపల్లిలో రు. 10000 ల వ్యయంతో ఒక పాఠశాల భవనాన్ని నిర్మించాలని కూడా తీర్మానించారు. ఇందులో రు. 5000 మొత్తాన్ని ప్రజలు విరాళంగా ఇస్తారు.

జాతీయ పొదుపు

నల్గొండ జిల్లాలో 1961 అక్టోబరు 7 వ తేదీ వరకు

జాతీయ పొదుపు పత్రాలకు రు. 7.36 లక్షలు, బహుమతి పత్రాలకు రు. 99.090 ల మొత్తం పెట్టుబడిగా లభించింది. రాష్ట్ర మంతటిలోను బహుమతి పత్రాలకు అత్యధిక మొత్తాన్ని మదుపు పెట్టిన ఖ్యాతి ఈ జిల్లాకు లభించింది.

## నెల్లూరు

ఈదూరు గ్రామానికి విద్యుచ్ఛక్తి

శాసనసభ్యులు శ్రీ వి. కోదండ.రామిరెడ్డి మీటు నొక్కడం ద్వారా తోటపల్లి గూడూరు పంచాయతీ సమితిలోని ఈదూరు గ్రామంలో విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం చేశారు

## నిజామాబాదు

పౌష్టికాహార కార్యక్రమ విస్తరణ

పౌష్టికాహార కార్యక్రమ విస్తరణకై బాన్సువాడ బ్లాకును ఎన్నిక చేశారు,

## శ్రీకాకుళం

గ్రామీణ కమ్యూనిటీ వర్క్‌షాపు ప్రారంభం

కమ్మరిగుంట గ్రామంలో ఒక గ్రామీణ కమ్యూనిటీ వర్క్‌షాపుకు జిల్లా పరిషత్తు అధ్యక్షులు అక్టోబరులో ప్రారంభోత్సవం చేశారు. వ్యవసాయ పరికరాలను ఈ వర్కుషాపులో తయారు చేస్తారు

జాతీయ పొదుపు

టెక్కలి పంచాయతీ సమితి సభ్యులు గత సెప్టెంబరు 24 న సమావేశమై జాతీయ పొదుపు పత్రాలకు రూ. 2,000 లు పెట్టుబడి పెట్టడానికై ప్రతి పంచాయతీని అభ్యర్థించటానికి తీర్మానించారు.

## విశాఖ పట్టణం

గంట్యాడ సమితి.

గంట్యాడ పంచాయతీ సమితి కార్యాలయ భవనానికి ప్రజా శిక్షా సమాచారశాఖల మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి నవంబరు 5వ తేదీన శంకుస్థాపన చేశారు.

యెలమంచిలిలో పంచాయతీరాజ్య దినోత్సవం

యెలమంచిలి సమితి ప్రాంతంలోని 32 పంచాయతీలూ నవంబరు 1వ తేదీన పంచాయతీరాజ్య దినోత్సవం జరుపుకొన్నవి. జాతీయపతాకావిష్కరణ, ప్రజలు, విద్యార్థుల ఊరేగింపు, ఆటలు, బహిరంగసభ అనాటి కార్యక్రమ సాధారణ అంశాలు.

ఈ సందర్భంలో ధర్మవరం పంచాయతీ, పాఠశాల విద్యార్థులకు దుస్తులను పంచిపెట్టింది. రేగుపాలెం గ్రామస్థులు 50 సెంట్ల భూమిని పంచాయతీకి విరాళంగా ఇచ్చారు. మామిడివాడ పంచాయతీ సంతర్పణచేసింది ఇవీ ఆనాటి కార్యక్రమ ప్రత్యేకాంశాలు.

ఆటోమాటిక్ ఎక్ఛేంజి.

యెలమంచిలిలో అక్టోబరు 31 న ఆటోమెటిక్ టెలిఫోన్ ఎక్స్ఛేంజిని, ప్రారంభించారు.

కర్షకుల పర్యటన

పార్లమెంటు సభ్యుడు శ్రీ వి. వి రమణ నాయకత్వాన దేశపర్యటనకై బయలుదేరిన 400 మంది సభ్యులుగల కర్షకబృందం అక్టోబరు లో ఢిల్లీని సందర్శించారు. తుమ్మపల్లి వ్యవసాయదారుల సంఘంవారు ఏర్పాటుచేసిన ఈ పర్యటన కార్యక్రమంలో కర్షకులను చారిత్రక ప్రాముఖ్యంగల ప్రదేశాలకూ భాక్రానంగల్ వంటి ప్రాజెక్టు స్థలాలకూ తీసుకు వెళ్లారు.

లయన్స్ క్లబ్బువారిచే పాలకేంద్రం నిర్వహణ.

లయన్స్‌క్లబ్బువారిచే నడపబడనున్న ఒక పాలకేంద్రానికి అక్టోబరు 19 న విశాఖపట్టణంలో ప్రారంభోత్సవం జరిగింది. ఇందులో బాలలకు ఉచితంగా పాలు పంచి పెడతారు.

పాఠశాల నివేశస్థల దాతలకు సత్కారం.

పెనుగోలె ధర్మవరంలోని మాధ్యమిక పాఠశాల కమిటీ స్కూలుభవనం, ఆటస్థలాల నిమిత్తం 3.5 ఎకరాల భూమినీ రూ. 3,000 ల రొక్కాన్ని సేకరించింది. ఈ స్థలాన్ని విరాళంగా ఇచ్చిన శ్రీ గన్నెం రామారావు, శ్రీ వెంకటరమణ, శ్రీ వెంకన్న గారలను ధర్మవరంలో అక్టోబరు నెలలో జరిగిన ఒక సభలో సన్మానించారు. పాఠశాలను వచ్చె జూన్ నెలలో తెరుస్తారు.

## వరంగల్లు

జిల్లా పరిషత్తుల గ్రాంట్లు

అక్టోబరు 20వ తేదీన జరిగిన జిల్లాపరిషత్తు నాల్గవ స్థాయీ సంఘం సమావేశంలో దోర్నకల్లు, ఆత్మకూరు, పర్వాల, బచ్చన్న పేట, నర్మెట, మాదికొండ, లాడనూరులలోని జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలల మరమ్మతుల నిమిత్తం రు. 12800 లను మంజూరుచేశారు.

1961-62వ సంవత్సరంలో హరిజనులు, వెనుకబడిన తర

గతుల విద్యార్థుల ఉపకారవేతనాల పునరుద్ధరణ నిమిత్తం కమిటి వరుసగా రు. 2,000 రు. 4000ల మొత్తాలను మంజూరు చేసింది హరిజనులకు ఎడ్ల సరఫరాకై ప్రతిబ్లాకుకు రు 600 చొప్పున కూడా కమిటీ మంజూరు చేసింది.

హనుమకొండనుండి పంపూరు గ్రామానికి రోడ్డు నిర్మించేటందుకు రు. 5000లు మంజూరు చేయబడ్డవి. మూడవ ప్రణాళికా కాలంలో ములుగు గ్రామంలో ఒక గ్రామీణ పారిశ్రామిక వాడను స్థాపించాలని మొదటి స్థాయీసంఘంకూడా తీర్మానించింది.

పాఠశాలలు, బావుల నిర్మాణం.

పంచాయతీరాజ్య ఉత్సవాల సందర్భంగా వరంగల్లు పంచాయతీసమితి సమితి ప్రాంతంలో 28 బావులు, 7 పాఠశాల భవనాల నిర్మాణానికీ, 20 రోడ్డుపనులకూ, 3 మురుగునీటి పథకాలకూ గాను రు. 1.63 లక్షలను మంజూరుచేసింది.

## శ్రీకాకుళం

టెక్కలి గ్రామాలకు క్రొత్తరోడ్లు

టెక్కలి పంచాయతీ సమితి పనుల స్థాయీసంఘం అక్టోబరు 13న 16 క్రొత్తరోడ్డు పనులను మంజూరు చేసింది. ఈపనుల అంచనా వ్యయం రు. 27000. మంచినీటి బావుల త్రవ్వకానికై 50 శాతానికి బదులు 25 శాతం ఖర్చును భరించడానికి నరసింగపల్లి గ్రామ పంచాయతీకి అనుమతి ఇచ్చారు.

## పశ్చిమ గోదావరి.

రు 15000ల మేరకు శ్రమదానం

పంచాయతీ రాజ్య ద్వితీయ వార్షికోత్సవం సందర్భంగా చింతలపల్లి ఏజెన్సీ బ్లాకులో 19 రోడ్డు పనులు, ఒకబావిత్రవ్వకం, ఒక నీటిపారుదల కాల్వ మొత్తం రు. 15000 లు వ్యయం కాగల పనులు ప్రజల శ్రమదానం ఫలితంగా పూర్తి అయినవి

రు 20,000 ల వ్యయంతో రోడ్లు

కొత్తగూడెం (దుబ్బచెర్ల పంచాయతీ హద్దు) నుండి అయ్యవరం వరకు రు. 20000ల వ్యయంతో ఒక కంకరరోడ్డును వేయడానికి తాడేపల్లిగూడెం పంచాయతీసమితి అక్టోబరులో అనుమతించింది.

బీదలకు పట్టాలు

చింతలపూడి తాలూకా కేతవరంలో భూములు లేని 130 మందికి అక్టోబరు 27న పట్టాలను ఇచ్చారు. ఇప్పుడు వారు 500 ఎకరాల బంజరు భూమిని సాగుచేస్తారు.

కేతవరంను కోట'చింతలపూడి రోడ్డుతో కలిపే ఒక క్రొత్త రోడ్డు, కేతవరంలో ఒక పాఠశాలభవనం కూడా అక్టోబరు నెలలో తెరువబడ్డాయి.

ప్రాథమిక పాఠశాలల ప్రారంభం.

భీమడోలు పంచాయతీసమితిలోని గొడుగుపేట, రామానుజపురం, ఐ. యస్. రాఘవపురంలలో అక్టోబరునెలలో మూడు ప్రాథమిక పాఠశాలలను తెరిచారు.

---

మొదట జుట్టు బట్టి పిదప కాళ్ళు బడుట
కొన్ని వేళలందు గొప్పె కాని
కారణమ్ము లేక కాళ్ళు బడుట తప్పు
జననుతాంతరంగ! వినురః రంగ!

కళా కృష్ణుల "కృష్ణశతకతి" నుంచి.

# గ్రంథసమీక్ష

## స్తుతిరత్నమాలిక

గ్రంథకర్త : శ్రీ సోమంచి వాసుదేవరావు

క్రౌన్ ఆక్టేవో 76 పుటలు

వెల : రూ. 1.25 న పై.

కాపీలకు : గ్రంథకర్తపేర, శ్రీకాకుళము వ్రాయవలెను.

స్తుతిరత్నమాలిక ఖండ కావ్య సంకలనమనదగును. ఇందు భక్తకల్పద్రుమశతకము, సూర్యనారాయణస్తవము, హరిహరనాథశతకము, సమీరనందనస్తుతి, గీతామృతలహరి, సౌభాగ్యలక్ష్మీస్తుతి, శ్రీరామ దండకములు గలవు. గ్రంథకర్తలు మహాకవులట ఇతఃపూర్వమే వీరు సమీరసందేశమును రచించుటేకాక వాల్మీకి రామాయణాంతర్గత సుందరకాండమును నిర్వచనముగా అనువదించినారు భక్తికల్పద్రుమశతకము కృష్ణభక్తి ప్రతిపాదకము. వీరీ శతకమున తమ కావ్యరచనా ఫణితి నీగతి విన్నవించినారు,

"పదసారస్యము, నర్థగౌరవము, విద్వస్తుత్య పాండిత్య సం
పద, విజ్ఞానము, భక్తిభావమును శోభాస్ఫూర్తి పెంపారి యొ
ప్పిదమౌ నీస్తుతి పద్యరత్నములు"

ఇందలి రచన మత్తేభ శార్దూల వృత్తవిలసితము. వీరిశైలి ఒకచో గంభీరమై, మరొకచో ప్రౌఢదీర్ఘ సమాసభూయిష్ఠమై వేఱొకచో లలితపదవిలసితమై నలరారుచున్నది. గ్రంథకర్తలు పైన చెప్పిన లక్షణములు తమ కావ్యరచనయందు పాటించి రనియే చెప్పవచ్చును. భక్తకల్పద్రుమ శతకము, సూర్యనారాయణ తారావళి ఒకే శైలిలో నడిచినవి. హరిహరనాథ శతకమున కందములు కలవు. కందరచనకూడ మత్తేభ శార్దూలముల శైలి యందే సాగినది. శ్రీరామ దండకము లలితపదవిలసితమై ఎల్లరకు సుబోధకముగా నున్నది. భగవద్గీతలోని సారాంశము గీతామృతలహరిలో పొందుపరచ బడినది. వీరిశైలి ఎడనెడ పోతనామాత్యుని దలపించుచున్నది. స్తుతిరత్న మాలిక ముముక్షువులు చదువదగిన పొత్తము.

—'పి'

## నారాయణ శతకం

రచయిత : "సంగీతసాహిత్య కళానిధి" శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు.

24 పేజీలు. వెల : అర్ధరూపాయి.

కృతికర్త శ్రీ కృష్ణమాచార్యులుగారు దక్షిణ భారతంలో సుప్రసిద్ధులైన ఫిడేలు విద్వాంసులుకూడా 1948 నుండి ఆలిండియా రేడియో నిలయ సంగీతవిద్వాంసులు.

"తొలి యత్నంబిది కబ్బమల్లుటకు............నా తల
పుల్ సాగగజేసి మాట నెటులో దక్కించు నారాయణా"

అని ఆదిలో భగవంతుణ్ణి ప్రార్థించుకున్నారు. శతకమంతా చదివి చూస్తే భగవంతుడాయన ప్రార్థన మన్నించినట్లే వుంది. తొలి యత్నంలో యింత ధారాళంగా కవిత నడపడం యీ కృతికర్తకే చెల్లు.

"అరిషట్కంబెమరయ్యె జిత్తమను తేరాయత్తమయ్యెన్ గృషీ
కరయాభిద్రవ వాజి రాజముల పీకంబూన్చి నాశాత్ర వో
త్కరముం గూల్పగజైత్రయాత్రకిక సూతత్వంబు నీవందు మే
నరుడన్ గానొకొ?నూరు పాళ్లను నరుండన్ నమ్ము నారాయణా"

అనే పద్యం శతకం మొత్తంమీద అన్నింటికంటే బాగుంది.

ప్రతులకు : గోదాగ్రంథమాల, శ్రీమన్నారాయణపురం, ఉల్లిపాలెం పోస్టు, దివి తాలూకా, కృష్ణా జిల్లా.

## భాగవతసారం

రచయిత : శ్రీమాన్ మాడభూషి గోపాలాచార్యులు బి.ఎ.

24 పేజీలు  వెల : 38 నయాపైసలు.
ఇదికూడా గోదాగ్రంథమాల ప్రచురణే.

ద్రావిడ భాషలో పెరియాళ్వారను నామాంతరంకల శ్రీవిష్ణు చిత్తులు రచించిన "ముదలాయిరమ్" అనే ప్రబంధంలోని మూడు దశకాలకు యిది తెనుగుసేత. ముచ్చటైన మాత్రాచ్ఛందస్సులలో సహజమైన తెనుగుకవిత రాసి చూపించారు కవి.

'లాలీ' అనే ప్రథమ ఖండంలో యశోద శ్రీకృష్ణునికి జోల పాడుతుంది. రెండో ఖండంలో యశోద కృష్ణునికి తల దువ్వడం. "కాకీ కాకీ రావే, మాచిన్ని కృష్ణునికి తలదువ్వి పోవే" అంటూ పసివాణ్ణి తల్లి మాయచేస్తున్నట్లు కల్పించడం చాలా బాగుంది.

ఒక్క ముక్కలో చెప్పాలంటే యీ రచనలో యశోద అచ్చం తెనుగువారి ఆడబడుచులా కనిపిస్తుంది. "మిక్కిలి చిక్కిన మేని తల్లి" ( సీత, 3వ ఖండిక ) వంటి ప్రయోగాలు విన సొంపుగా వున్నాయి.

మూడవ ఖండం సీస పద్యాలు. హనుమంతుడు అశోక వనంలోని సీతతో తాను రామదూతనని గుర్తులు చెప్పడం.

"ప్రత్యేకభోగమై పరదృష్టి తాకక కంచుకబద్ధమై కావ బడిన వక్షోజముల తల్లి", "బద్ధస్తని" వంటి ప్రయోగాలు— సంస్కృత సంప్రదాయ మెలావున్నా తెనుగు పాఠకుడికి రుచించవు. మొత్తంమీద కొద్దిలో మంచి పుస్తకం. తెనుగులో కవిత చెప్పడం తెలిసిన పుస్తకం

## భారతమాత శతకం

రచయిత : చర్ల లక్ష్మీనారాయణ
వెల : పావలా
ప్రతులకు : రచయిత పేర, కాకరపర్రు (పోస్టు)
తణుకుతాలూకా, ప.గో.జిల్లా.

దేశభక్తిని ప్రజల్లో ప్రబోధించడానికి రచయిత ఈ శతకం వ్రాశారు. అన్నీ కందపద్యాలు. శివాజీ, ఝాన్సీ, తాంతియాతోపే, రాణాప్రతాప్, నానాసాహెబ్ వంటి చారిత్రక వీరుల స్మరణ ఈ పద్యాల్లో వుంది. గాంధీ, నెహ్రూ, రాజేంద్రప్రసాద్, రాధాకృష్ణ పండితుల ప్రశంసకూడా వుంది. కవిత్వం చాలాభాగం పేలవంగా వుంది. 80వ పద్యంనుండి దేశభక్తి వదిలేసి సుమతిశతకంలాగా మామూలు నీతులు చెప్పబడినవి.

—కులపతి

## కళారాధన

రచయిత: శ్రీ కొండూరు వీర రాఘవా చార్యులు ఆంధ్రో పన్యాసకులు, వి. యస్. ఆర్ కళాశాల, తెనాలి. ప్రచురణ: ఆంధ్ర శిల్పకళాపరిషత్తు తెనాలి. 164 పేజీలు. వెల 2_50

చారిత్రక నవలలు ఇటీవల మనకు అరుదుగా అందుతున్నవి అటువంటి వాటిల్లో ఇది ప్రథమశ్రేణికి చెందిన నవల 12వ శతాబ్దంలోని ఆంధ్ర తమిళ కన్నడ దేశాలకుచెంధిన మత, రాజకీయ, శిల్పకళా సంస్కృతులు ఇందులో ప్రతిబింబిస్తున్నవి. దక్షిణాపథ శిల్పచరిత్రలో ఒక అద్వితీయ స్థానాన్ని ఆక్రమించిన జక్కణాచార్యుని అమరగాథ ఇందులోని ఇతివృత్తం. రెండవ విశ్వకర్మగా కీర్తింపబడిన జక్కణ హొయసల రాజైన వీరభల్లాళ దేవుని కోరిక ప్రకారం శ్రావణ బెళగుళలో 60 అడుగుల గోమతేశ్వరుని మూర్తిని సర్వాంగసుందరంగా తీర్చిదిద్దిన ప్రతిభాశాలి చిరకాలమునకు ఈ మహాశిల్పికి పుత్రోదయం జరిగింది. అయితే పుత్ర జననకాల నిర్ణయంలో దాదిచేసిన చిన్న పొరబాటు ఫలితంగా జక్కణాచార్యుడు ఇల్లు వీడివెడతాడు. మారువేషంలో ఉన్న ఈశిల్పిచిత్రంగా తిరిగి వీరభల్లాళుడు చేపట్టిన శిల్పనిర్మాణ కార్యక్రమాన్ని నిర్వహిస్తాడు. తుదకు చలువ చన్నిగరాయ మూర్తికై నిర్ణయించిన శిలాదోషం కారణంగా తన కుమారుని చేతనే ఓటువడి హస్తవిచ్ఛేదం గావించుకొంటాడు. చివరకు కథ సుఖాంతమవుతుంది.

మనోహరమైన ఈ ఇతివృత్తాన్ని ఆధారంచేసుకొని ఆనాటి వివిధ శిల్పరీతులనూ, రాజకీయ పరిస్థితులనూ మతరీతులనూ వివరించారు రచయిత.

ఈ నవలా రచనలో గ్రాంధికాన్నే చేబట్టినా పసందైన శైలితో చక్కని రచనా వైదగ్ధ్యంతో పాఠకులకు అపూర్వమైన విజ్ఞానాన్నందించి మనోవికాసానికి దోహదంచేసే ఈ నవల ప్రతివారూ తప్పక చదువతగ్గది. ఆంధ్రుల చారిత్రక గాధాయుక్తమైన ఈ రచనను మన కందించిన శ్రీ రాఘవాచార్యులవారిని ప్రశంసింప వలసి ఉంది.

"విజయ"

## మా ఘంటం

(సాంఘిక నవల)

రచయిత: శ్రీపుల్లాభొట్ల వెంకటేశ్వర్లు, ఎం. ఏ.

వెల: రూ 3 50    268 పుటలు

ప్రతులకు: రచయితపేర ఖమ్మం వ్రాయాలి

"ఇదియొక సరికొత్త పాతనవల" అన్నారు శ్రీవాత్సవ ఈ నవలకు తొలిపలుకు వ్రాస్తూ

"ఈ నవలయందు శ్రీవెంకటేశ్వర్లుగారు పల్లెటూళ్లలో నుండు భాగ్యవంతుల దర్పములను, పేదల కష్టనిష్ఠూరములను కండ్లకు కట్టినట్లుగా వర్ణించినారు . ఈరచనను బట్టి ఈగ్రంధకర్త మంచి కథా రచయితగా పేరుపొందగలడని నాకు తోచుచున్నది" అని ఆశీర్వదించారు పరిశోధకులు శ్రీఆదిరాజు వీరభద్రరావుగారు

నవలకు ఏవిధమైన కధావస్తువు తీసుకోవాలీ అన్నదిఎవరూ తేల్చిచెప్పవలసిన విషయంకాదు. కధావస్తువు ఏదైనా తీసుకున్న పరిధిలో సమగ్రమైన జీవితచిత్రణ జరగాలి, పాత్రలు పుట్టిపెరిగి సమ్యక్ పరిణామాన్ని పొందాలి

రచయితకు ఏదోచెప్పాలనే ఆవేదన ఉండవచ్చు. కాని ఆ ఆవేదన ఒక్కటేఉంటే చాలదు దాన్ని సజీవమైన పాత్రలతో ఏవిధంగా చిత్రించగలిగాడా అన్నదే మనకు కావాల్సింది. నవల జీవితానికి సమగ్రమైన వ్యాఖ్యానంగా ఉండాలి.

అట్టిప్రయత్నం జరగాలంటే కేవలం భాషమీద అధికారం ఉండీ లాభంలేదు కేవలం భావనావీధిలో ప్రయాణించి నందువల్లా ప్రయోజనం లేదు, ఈ రెంటినీ జీవితానుభవంతో రంగరించి పాఠకుడిని పట్టేసే సన్నివేశాలతో పాత్రల మనస్తత్వ చిత్రణతో నవలనిండి ఉన్నప్పుడు అది సరియైన నవలగా భాసిస్తుంది

"జి"

## రామానుజ చరిత్ర

రచన "శ్రీ రామానుజ దాసుడు"

వెల: అరవై రెండు నయాపైసలు

పుటలు. నలభై రెండు+పన్నెండు

## గోదాదేవి

రచన: "శ్రీ విరించి"

వెల: యాభైనయాపైసలు

పుటలు: ముప్పైరెండు+పద్నాలుగు.

పై రెండు పుస్తకాలను శ్రీ గోదా గ్రంథమాల (శ్రీమన్నారయణపురం, ఉల్లిపాలెం పోస్టు, దివి తాలూకా, కృష్ణాజిల్లా) వారు తమ బాలసాహితీ శాఖలో ద్వితీయ, తృతీయ రత్నములుగా ప్రకటించారు. ప్రజలలో భక్తితత్పరతనూ, ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని వ్యాపింపజేయటానికి సద్గ్రంధ ప్రచురణద్వారా శ్రీ గోదా గ్రంధ మాలవారు చేస్తున్నకృషిప్రశంసార్హమైనది. ప్రత్యేకించి బాలవాఙ్మయానికి వీరు చేస్తున్న సేవ అభినందనీయమైనది. శ్రీ వైష్ణవ సంప్రదాయాన్ని ఆసేతుహిమాచల పర్యంతం పరివ్యాప్తం చేయుటానికి ఉద్యమించిన శ్రీ రామానుజాచార్యుల దివ్య చరితమును పై మొదటి పుస్తకం సంగ్రహంగా విశదీకరిస్తుంది. దీనిలో యతిరాజుల జీవిత వృత్తాంతాన్నే కాకుండా వారి సన్నిహితులైన మరి కొందరు మహానుభావుల విషయాలనూ, భాష్యకారుల మహత్తును చాటు కొన్ని సంఘటనలను గురించి కూడా తెలుసుకోవచ్చు భాష సరళంగా వుంది పిల్లలే కాకుండా పెద్దలు కూడా చదువవలసిన గ్రంధమిది

పుస్తకం మూడవ పుటలో శ్రీ రామానుజుల 'మేనల్లుడైన' గోవిందుడు పదహారవపుటలో పినతల్లికుమారు'డెలా అయ్యాడన్న సందేహం మాత్రం ఈ పుస్తకాన్ని తదేకదృష్టితో చదివిన పాఠకులను బాధిస్తుంది

నిరంతర ధ్యానం. అనంత భక్తి సంకీర్తనముల వలన శ్రీహరి సాయుజ్యముపొందిన గోదాదేవి పావన చరితము రెండవ గ్రంధంలో సంగ్రహపరచబడినది ఈ కారణ జన్మురాలి జననోదంతం మొదలు ఆమె శ్రీ రంగేశునిలో ఐక్యమైపోయిన వరకు గల వివిధ జీవితఘట్టములను ఈ చిన్న పుస్తకంలో మనోజ్ఞముగా వర్ణించబడినాయి దేవి జనకుడు, మహాభక్తుడు అయిన శ్రీ విష్ణు చిత్తుల జీవిత విశేషాలను గురించి కూడా ఈ పుస్తకంలో తెలుసు కొనవచ్చు గోదాదేవి శ్రీమన్నారాయణుని సంస్మరిస్తూ, మార్గశిర మాసం ముప్పైరోజులూ రోజుకొకటిగా వ్రాసిన పాశురములు పరమపవిత్రములై నిలిచున్నవి శైలి మనోహరంగా సాగింది. ఇది అందరూ పఠించవలసిన పుస్తకం —జ.రా.

# రాష్ట్రంలోని ప్రాజెక్టు స్థలాలలో జర్నలిస్టుల పర్యటన

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఏర్పాటు చేసిన జర్నలిస్టుల రెండవ పర్యటన కార్యక్రమం 1961 నవంబరు 24వ తేదీన ఆరంభ మైంది. వివిధ జిల్లా ప్రాంతాలకు చెందిన పత్రికా ప్రతినిధులు హైద్రాబాదునుండి హౌరా ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి వెళ్ళారు వీరు కృష్ణాబ్యారేజ్, మాచ్‌ఖండ్, అరకులోయ, నాగార్జునసాగర్, మూసీ, శ్రీశైలం, తుంగభద్ర వంటి వివిధ ముఖ్యమైన ప్రాజెక్టులనూ, ఇంకా అనేక పారిశ్రామిక ప్రదేశాలను, అభివృద్ధి కార్యకలాపాలు కొనసాగుతున్న ఇతర స్థలాలను సందర్శిస్తారు

హైద్రాబాదునుండి బయలుదేరేముందు సమాచార శాఖవారు జరిపిన విందులో ఈ బృందం సభ్యులను స్థానిక పాత్రికేయులకు పరిచయం చేశారు. జిల్లా పత్రికా ప్రతినిధులకుకూడా ప్రాజెక్టు స్థలాలలోనూ, బ్లాకుప్రాంతాలలోను అమలు జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలను గురించిప్రత్యక్షంగా తెలుసుకోవటానికి అవకాశం కలిగిస్తున్నందుకు ఈ పర్యటన బృందం సభ్యులు ప్రభుత్వానికి తమ కృతజ్ఞతలు తెలియజేశారు

ఈ జర్నలిస్టుల బృందం పర్యటనకు బయలుదేరి వెళ్తున్న సందర్భంలో వారికి ఇచ్చిన సందేశంలో రాష్ట్ర ప్రణాళికా సమాచార శాఖల మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి ఇలా అన్నారు;

"ప్రజాభిప్రాయాన్ని కూడగట్టుకొనిరావటంలోపాత్రికేయులు వహించే ప్రధానమైనపాత్ర దృష్ట్యావిభిన్న ప్రాజెక్టులవద్ద అమలు జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలను గురించి వారు ప్రత్యక్షంగా చూసి తెలుసుకునే అవకాశం వుండటం అవసరం. ఉద్యోగ రీత్యా కొంతమందికి అప్పుడప్పుడు అటువంటి అవకాశాలు కలుగ వచ్చునేమోకాని అందరుమాత్రం అలాంటి అవకాశాలను పొందే స్థితిలో వుండరు. కనుకనే ప్రజాస్వామిక దేశాలలో ప్రభుత్వాలే తరుచుగా ఇటువంటి పర్యటనలను ఏర్పాటు చేయటం కద్దు. ఇలాంటి పర్యటనలు జరపడానికై ఇతర దేశాలవారు భారతీయ జర్నలిస్టులను ఆహ్వానించటం, అలాగే భారతప్రభుత్వం దేశంలోని భారీ ప్రాజెక్టుల సందర్శనార్థం పత్రికా ప్రతినిధుల పర్యటనలను ఏర్పాటు చేయటం జరుగుతున్నది. మన రాష్ట్ర ప్రభుత్వం గత ఫిబ్రవరిలో ప్రప్రథమంగా జర్నలిస్టుల పర్యటనను ఏర్పాటు చేసింది. రెండవ పర్యటన నేడే ఆరంభమవుతున్నది ప్రథమపర్యటన ఫలితంగా అభివృద్ధి కార్యక్రమాలను గురించి పత్రికలలో చాలావార్తలువచ్చాయి. పత్రికాప్రతినిధులు ఈ అవకాశాన్ని చక్కగా వినియోగించుకొని వివిధ అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకు సంబంధించిన సమస్తవిషయాలను అవగాహన చేసుకొన గలిగారని దీనిని బట్టి విదితమైంది కేవలం ప్రశంసలనే కాకుండా కొన్ని విమర్శలనుకూడా వారుచేశారు. కొన్ని లోపాలను, దోషాలను వారు చూపించారు ఇట్టి నిష్పాక్షికమైన, నిర్మాణాత్మకమైన విమర్శలను ప్రభుత్వం అవశ్యం స్వీకరిస్తుంది ఇలాంటి విమర్శల వల్ల మన అభివృద్ధి పథకాలను ఇతోధిక సామర్థ్యంతో అమలు పరుచుకొటానికి కావల్సిన సూచనలు లభిస్తాయి పొరపాట్లను సరిదిద్దుకునే అవకాశంకూడా లభిస్తుంది నిజానికి ఈ పథకాలన్నీ ప్రజలవే. వీటి విజయం చాలా వరకు ప్రజల సహాయ సహకారాల పైననే ఆధారపడివుంటుంది ప్రజలనుంచి ఇటువంటి సహకారం లభించాలంటే వారికి వాటిని గురించి సరైన సమాచారాన్ని అందజేయాలి. వాటి ప్రాధాన్యతను గురించి వివరించాలి ఈ విషయంలో పత్రికలు నిర్వర్తించే పాత్ర అత్యంత గురుతరమైనది. కనుకనే ఈ పర్యటనలను ఏర్పాటు చేయటంలో ప్రభుత్వం కేవలం సంధానకర్తగా మాత్రమే వ్యవహరిస్తున్నది, పత్రికా ప్రతినిధులు స్వయంగా అన్ని విశేషాలు చూడటానికీ, చూచిన వాటి విషయమై

( 65వ పేజీ చూడుడు )

# రచయితలు

శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి, పొన్నూరు, గుంటూరు జిల్లా

శ్రీ శిష్టా రామకృష్ణ శాస్త్రి, ట్రిప్లికేన్, మద్రాసు-5.

శ్రీ ద్వివేదుల సోమనాథశాస్త్రి, టిటిలాఘర్, బొలంగిర్ జిల్లా (ఒరిస్సా)

శ్రీ పల్లా సత్యనారాయణ, కొత్తపల్లి, మహబూబ్‌నగరం జిల్లా

శ్రీ వెలగా వెంకటప్పయ్య, గౌలీగూడ, హైదరాబాదు

శ్రీ జి వి. రామమూర్తి, ఖైరతాబాదు, హైదరాబాదు

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి, పండిట్, పి బి ఎన్. కళాశాల, నిడుబ్రోలు, గుంటూరు జిల్లా.

శ్రీ కందుకూరి కాశీవిశ్వనాథం, బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు, సోంపేట

శ్రీ మధురాంతకం రాజారాం, మొగరాల, చిత్తూరు జిల్లా.

"వాఙ్మయమహోధ్యక్ష" వడ్లమూడి గోపాల కృష్ణయ్య, ఎడిటర్: "ఆంధ్రప్రదేశ్" (తెలుగు), హైద్రాబాదు

శ్రీ దివాకరుని వెంకటసుబ్బారావు, త్రిమల్‌ఘిరి, సికింద్రాబాదు



## రాష్ట్రంలోని ప్రాజెక్టు స్థలాలలో జర్నలిస్టుల పర్యటన

( 64వ పేజీ తరువాయి )

తమ అభిప్రాయాలను ప్రజలకు నివేదించటానికి అవసరమైన ఏర్పాట్లను ప్రభుత్వం చేస్తున్నది.

"గత పర్యటనకు హైద్రాబాదు, విజయవాడల జర్నలిస్టులు మాత్రమే ఎన్నుకొనబడగా ఈ సారి జిల్లాప్రాంతాలలో పనిచేసే పాత్రికేయులకు అవకాశం కల్పించబడినది. ఈ పర్యటన కార్యక్రమంలో ప్రధానమైన ప్రాజెక్టులను చేర్చారు. అయితే ఈ కార్యక్రమంలో కొద్దిమార్పు మాత్రం జరిగింది. తక్కువ వ్యవధిలో ఎక్కువ విశేషాలను చూడకలిగే విధంగా ఇప్పటి కార్యక్రమాన్ని రూపొందించారు. ఈపర్యటన మీకు సుఖదాయకంగానూ ప్రయోజనాత్మకంగాను వుండగలదని విశ్వసిస్తున్నాను.

జైహింద్!

# ముఖ్యవార్తలు

రాష్ట్రంలో

21-10-61

ఆంధ్ర ప్రదేశ్‌లో వచ్చే సాధారణ ఎన్నికలకు ఫిబ్రవరి 22, 24, 26 వ తేదీలలో పోలింగ్ జరుగుతుందని అధికారికంగా ప్రకటించారు

22-10-61

హైదరాబాదులోని అడిక్‌మెట్‌లో ఆంధ్ర మహిళాసభ భవనానికి ముఖ్యమంత్రి పునాది రాయి వేశారు.

23-10-61

తిరుపతిలో నాల్గు రోజుల పాటు జరిగిన ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ రాజ్య సమ్మేళనానికి ముఖ్య మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

26-10-61

జాతీయ సమైక్యతను గురించి రాజభవనంలో జరిగిన ప్రాథమిక సమావేశానికి ప్రముఖ నాయకులు హాజరయ్యారు

27-10-61

తిరుపతిలో వ్యవసాయ కళాశాలకు ప్రారంభోత్సవం జరిగింది. దీనితో కలుపుకొని ఆంధ్ర ప్రదేశ్‌లో మూడు వ్యవసాయ కళాశాలలు ఉన్నాయి.

28-10-61

ప్రాథమిక విద్యా స్థాయిని పెంపొందింపుటకు, పాఠ్య గ్రంథాల వస్తు సేకరణకు ప్రాంతీయ పరిశోధనలయాలను యేర్పాటు చేయాలని హైద్రాబాదులో జరిగిన దక్షిణ మండలం విద్యా మంత్రుల సమావేశంలో నిర్ణయించారు.

1-11-61

ఆంధ్ర ప్రదేశ్ అవతరణ పంచమ వార్షికోత్సవం, పంచాయతీ రాజ్య ద్వితీయ వార్షికోత్సవం, తృతీయ ప్రణాళికలో ప్రథమ ప్రణాళికావారోత్సవం—యీ త్రివిధ ఉత్సవాలకు, హైద్రాబాదులో ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

2-11-61

గుల్హాతి సంఘం రాక సందర్భంగా హైద్రాబాదులో నదీ జలాల వివాదం గూర్చి జరిగిన అఖిల పక్ష సమావేశంలో 1951వ సం॥పు ఒప్పందానికి కట్టుబడి ఉండాలని రాష్ట్ర ప్రభుత్వం పునరుద్ఘాటించింది

3-11-61

హైద్రాబాదులో పత్రికా విలేఖరుల సమావేశంలో ప్రసంగిస్తూ, ఆంధ్ర ప్రదేశ్ విషయంలో గుల్హాతి కమీషన్ వహిస్తున్న పక్షపాత వైఖరిని కేంద్రం దృష్టికి తెస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఒక లేఖ వ్రాయాలని నిశ్చయించిందని పబ్లిక్ వర్క్సు మంత్రి వెల్లడించారు.

4-11-61

గుల్హాతి కమీషన్‌వారు ఆంధ్ర ప్రదేశ్, మైసూరు, మహారాష్ట్ర యింజనీర్లు హైద్రాబాదులో సమావేశమై, మూడవ ప్రణాళికలో చేర్చిన ప్రాజెక్టులు, ప్రస్తుతం నిర్మాణంలో ఉన్న ప్రాజెక్టులు, కృష్ణా, గోదావరి నదులలో లభించే అదనపు నీటిని గూర్చి చర్చించారు.

5-11-61

నిజామాబాదు జిల్లాలోని పోచంపాడు ప్రాజెక్టు ఆనకట్ట స్థలాన్ని గుల్హాతి కమీషన్ సదర్శించింది.

16-11-61

నదీ జలాల వివాదంపై కొన్ని రాష్ట్రాలమధ్య తలెత్తిన అభిప్రాయ భేదాలను నివారించడానికి, మధ్యవర్తిగా వ్యవహరించుటకు దేశీయ వ్యవహారాల శాఖా మంత్రి శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి తమ సంసిద్ధతను వెల్లడించారు.

13-11-61

కేంద్ర విద్యామంత్రి డక్టరు కే యల్. శ్రీమాలి హైద్రాబాదులోని హిందీ అర్బు కళాశాలకు ప్రారంభోత్సవం చేశారు.

17-11-61

రాష్ట్ర ప్రభుత్వం గజిటెడ్, నాన్ గజిటెడ్ ఉద్యోగుల మూలవేతనంలో పూర్తిగాగాని, ఎక్కువ భాగంగాని అలవెన్స్‌ను కలిపివేసి వేతనాలను పునర్వ్యవస్థీకరిస్తూ ప్రభుత్వం ఒక సుదీర్ఘ ప్రకటన చేసింది

19-11-61

సంగంవద్ద పెన్నార్ నదిపై నిర్మింపబడే కావలి కాల్వ ప్రాజెక్టుకు ముఖ్యమంత్రి పునాదిరాయి వేశారు

## భారతదేశంలో

28-10-61

న్యూఢిల్లీలో గవర్నర్ల సమావేశం ప్రారంభమైంది.

29-10-61

రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ అస్వస్థతనుండి కోలుకున్న తర్వాత అధికారికంగా కార్యక్రమాలలో పాల్గొన్నారు.

30-10-61

సహకార శాఖామంత్రుల తృతీయ వార్షిక సమావేశానికి ప్రధానమంత్రి న్యూఢిల్లీలో ప్రారంభోత్సవము చేశారు.

31-10-61

జాతీయ సమైక్యతాసాధనకై వివిధ మార్గాలను పరిశీలించి, అవసరమైన సిఫారుసులను చేయడానికి జాతీయ సమైక్యతా మండలిని ప్రధానమంత్రి నెలకొల్పారు.

31-10-61

పంజాబులో ప్రభుత్వం సిక్కులపట్ల విచక్షణ చూపుతున్నదన్న ఆరోపణను పరిశీలించుటకుగాను భారత మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ యస్ ఆర్. దాసు అధ్యక్షతన ముగ్గురు సభ్యులుగల కమీషన్‌ను నియమించారు.

3-11-61

యు కె నుండి బొంబాయివచ్చిన మొట్టమొదటి భారతీయ విమాన వాహక నౌక "విక్రాంత్"కు ప్రధానమంత్రి లాంఛన ప్రాయంగా స్వాగతం చెప్పారు.

8-11-61

బొంబాయికి 30 మైళ్ళ దూరంలో ఉన్న ధానాలో ప్రైవేటు రంగంలో నెలకొల్పే కేబుల్ ఫ్యాక్టరీకి కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ మురార్జీదేశాయి ప్రారంభోత్సవం చేశారు.

9-11-61

రాష్ట్ర పి యస్. పి కాంగ్రేసు ఐక్యసంఘటననుండి విడిపోవటానికి కేరళరాష్ట్ర ముస్లింలీగు కార్య నిర్వాహకవర్గం నిశ్చయించింది.

10-11-61

కేరళరాష్ట్రం శాసన సభాధ్యక్షుడు శ్రీ సి హెచ్ మహ్మదు కోయ తమ పదవికి రాజీనామా అందజేశారు.

11-11-61

న్యూఢిల్లీలో జరిగే పారిశ్రామిక ప్రదర్శనానికి ఉపరాష్ట్రపతి డాక్టర్ యస్. రాధాకృష్ణన్ ప్రారంభోత్సవం చేశారు.

20-11-61

ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ అమెరికా, మెక్సికోలలో 16 రోజులు పర్యటించి, లండన్, కైరోలలో మజిలీచేసి, న్యూఢిల్లీకి తిరిగి వచ్చారు.

## విదేశాల్లో

23-10-61

సోవియట్ రష్యా 50 మెగా టన్నుల సూపర్ బాంబును ప్రయోగించినట్టు సోవియట్ రక్షణశాఖామంత్రి మాలినోవిస్కీ ధృవపర్చారు.

23-10 61

1961వ సం.పు నోబుల్ శాంతి బహుమానాన్ని ఐక్యరాజ్య సమితి మాజీ ప్రధాన కార్యదర్శి కీ.శే. హేమర్ షెల్డుకు యిచ్చారు.

25-10 61

యుద్ధ విరమణ ఒప్పందం నిబంధనావళిని అంగీకరించే విషయంలో న్యూయార్కు కార్యస్థానంలోని ఐక్యరాజ్యసమితి విధించిన షరతులను కటాంగ అధ్యక్షుడు మోయిసేషోంబే అంగీకరించినట్టు సమితి ప్రతినిధి ఒకరు లియోపాల్డ్ విల్లీ లో తెలియజేశారు

26-10-61

యుగోస్లావ్ నవలా రచయిత ఐవో ఆంద్రిల్‌కు సాహిత్యంలో నోబుల్ బహుమతి లభించింది.

3-11-61

బర్మా ప్రతినిధి యుథాంటును. ఐ. రా. స. తాత్కాలిక ప్రధాన కార్యదర్శిగా భద్రతామండలి యెన్నుకున్నది.

5-11-61

అమెరికా అధ్యక్షుడు శ్రీ కెన్నెడీ ఆహ్వానంపై అమెరికాలో అధికారంగా పర్యటించేందుకు ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ న్యూయార్క్ చేరుకున్నారు.

5-11-61

భారత ప్రభుత్వం సిరియాలో ఏర్పడిన నూతన ప్రభుత్వాన్ని పరిగణించినట్టు న్యూఢిల్లీలో అధికారికంగా ప్రకటించారు.

11-11-61

పాకిస్థాన్ భూభాగంలో గూఢచారి చర్యలు జరిపాడనే నేరంపై భారత సైన్యానికి జెందిన లెఫ్టినెంటు కర్నల్ భట్టాచార్యపై విచారణ జరిపిన పాకిస్థాన్ ప్రత్యేక సైనిక న్యాయస్థానం ఆయనకు 8 సంవత్సరాల కఠిన కారాగార శిక్షను విధిస్తూ తీర్పు చెప్పింది.

15-11-61

ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ మెక్సికో పట్టణం చేరుకున్నారు.

---

## 1962 జనవరి-మార్చి
## "ఆంధ్రప్రదేశ్" ప్రత్యేక సంచికలు

క్రిందటినెల ఆంధ్రప్రదేశ్ పత్రికలో ప్రకటించినట్లుకాక ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమివారు మహాకవి శ్రీ గురజాడ అప్పారావుగారి శతవర్ష వర్ధంతి జనవరిలోను, ఆంధ్రపాణిని శ్రీ పరవస్తు చిన్నయసూరిగారి శతవర్ష జయంతి మార్చిలోను జరుపుతున్నారు. అందువల్ల "ఆంధ్రప్రదేశ్" పత్రిక రాబోయే జనవరి సంచిక శ్రీ గురజాడ ప్రత్యేక సంచికగాను, మార్చి సంచిక చిన్నయసూరి సంచికగాను వెలువడుతుంది. చిన్నయసూరి అనన్య భాషా సేవ గురించి ఆయన జీవితాన్ని గురించి ప్రత్యేక రచనలన్నీ 1962 ఫిబ్రవరి 10వ తేదీ లోపల మాకు చేరాలని కోరుతున్నాము.

ఎడిటర్
ఆంధ్రప్రదేశ్ (తెలుగు)
సమాచార పౌర సంబంధముల శాఖ, హైదరాబాదు.

# "ఆంధ్ర ప్రదేశ్" ప్రకటన రేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడుభాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| .3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1 సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}''$ డెమ్మీ.

2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.

3. పావుపేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు

4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలు, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8 వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటి నెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేసిన డిమాండు డ్రాఫ్ట్ద్వారాగాని పంపవలెను. డిమాండు డ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు-దక్కన్ పేరిట వ్రాయబడవలెను.

5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగుజాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినయితే అందుకు ఈ శాఖ బాధ్యత వహించదు.

6. ప్రకటన ఎంతస్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసింది. ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడుభాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈదిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్
సమాచార పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాద్-1

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | |
|---|---|
| వైశాల్యం | 1,06,052 చదరపు మైళ్ళు |
| జనసంఖ్య | 35,977.999* |
| పురుషులు | 18,175,349* |
| స్త్రీలు | 17,802,650* |
| సగటు వర్షపాతం | 35.65" |
| అరణ్య ప్రదేశం | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | 20 |
| తాలూకాలు | 189 |
| రెవిన్యూ సర్కిళ్లు | 1,000 |
| పట్టణాలు | 223 |
| గ్రామాలు | 28,945 |
| పంటలక్రింది ప్రదేశం 58–59 | 2,73,02,000 ఎకరాలు |
| కౌళ్ళ సంఖ్య | 42,45,832 |
| 1958–59 లో నీటి పారుదలను పొందిన ప్రదేశం | 86,29,000 ఎకరాలు |
| 1958–59 లో పుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | 61 56 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | 15.5 లక్షల గాలన్లు |
| రైలు మార్గాలు | 3009.13 మైళ్ళు |
| జాతీయ రహదార్లు | 1,415 ,, |
| రాష్ట్ర రహదార్లు | 3593 ,, |
| జిల్లా పెద్ద రోడ్లు | 8220 ,, |
| జిల్లా ఇతర రోడ్లు | 2852 ,, |
| గ్రామాల రోడ్లు | 3442 ,, |
| పాఠశాలలు | 36,375 |
| కళాశాలలు 1959–60 | 113 |
| వృత్తి విద్యా కళాశాలలు | 36 |
| తృతీయ పంచవర్ష ప్రణాళిక ప్రమాణం | రూ. 305 కోట్లు |

**1961–62 బడ్జెటు:**

| | |
|---|---|
| ఆదాయం | రూ. 85.12 కోట్లు |
| వ్యయం | ,, 87.62 ,, |
| పెట్టుబడి ఖర్చు | ,, 34.55 ,, |

*(1961 జనాభా లెక్కల తాత్కాలిక వివరాల ప్రకారం)

